# తత్వశాస్త్ర ప్రాథమిక పాఠాలు



మృతజీవి, జార్జి పోలిట్జర్

రచనకు

ఛాయానువాదం.

అనువాదం:- పా. సదాశివరావు.

కాకతీయ ప్రచురణలు.
వరంగల్
హైద్రాబాద్ రాష్ట్రం.

మూల్యం: 2-0-0.

ప్రతులు:- 500.

మూల్యం: 2-0-0.



అంకితమ్.

"మా॥ కే. శే. మాతామహి, మాతామహ
అనంతలక్ష్మి బజారు రామారావుగార్ల స్మృతిచిహ్న
అన



ప్రకా
కాకతీయ
ముద్రణా
అక్టోబ

# పీఠిక.

తత్వశాస్త్ర మనగానే అది సన్యాసులకూ, సాధుబాబాలకూ, లేక వయసుమళ్ళిన ముసలివాళ్ళకు తగినదనీ — దాన్ని గురించి సామాన్య ప్రజలు లేక ముఖ్యంగా యువకశక్తులు బుఱ్ఱ ఖరాబుచేసుకోవటం అనవసరమనీ సామాన్యంగా భావింపబడ్తూ ఉంటుంది.

ఎందుకని?... దీనికి కారణం మన భావవాద తత్వశాస్త్రపు లేక ఆధ్యాత్మికవాదపు నిరర్థకతయే. ఎందుకు?... ఆ తత్వశాస్త్రం మనలో ఉత్సాహాన్నీ, చైతన్యాన్నీ కల్గించుటకుబదులు నిరుత్సాహాన్నీ, మూఢ విశ్వాసాన్నీ పెంపొందింప ప్రయత్నిస్తూఉన్నది. అది మానవునిలో ప్రవృత్తిశీలతను — కోర్కెలను — చంపి నివృత్తిశీలాన్నీ, నిష్కామాన్నీ నిర్మాణంచేయ ప్రయత్నిస్తూఉన్నది. అది కేవలం ఊహాగానంగా ఉండి, శాస్త్రాధారాలను నిరాకరిస్తూఉన్నది. అది మాటలకూ — చేతలకూ పొసగనిదిగా ఉన్నది... కాబట్టి.

మన ఈ 'తత్వశాస్త్ర ఉదాసీనత'ను బట్టియే, తత్వశాస్త్రపు పై భావవాద ధోరణియొక్క విఫలత బుజువౌతున్నది. మన ఆధ్యాత్మికవాద విముఖత నిజంలో "ముఖంలోని అవలక్షణం" కాక, "అద్దంలోని లోపమే." అది తత్వశాస్త్రంయొక్క లోపంకాక, దాని ఆదర్శవాద ధోరణిలోని లోపంమాత్రమే.

ఇక ఈ చిన్న పుస్తకంలోని తత్వశాస్త్రం. అది నివృత్తిపరమైనదికాక ప్రవృత్తిని నిర్మాణంచేసేదిగా ఉన్నది. ఊహాగానంపైన కాక శాస్త్రాధారాలపైన నిర్మాణమైయున్నది. ఆచరణతో సమన్వయం లేనిదిగా కాక, ఆచరణాత్మక పురోగమనంపై ఆధారపడియున్నది. కాబట్టి, ఇది ఉదాసీనతను దారితీసేదిగా ఉండదు. ఇది ఆదర్శవాదంలోని పై లోపాలను ఖండించే తత్వశాస్త్రంయొక్క భౌతికవాదపార్శ్వపు నిరూపణ.

× × × × ×

# II

భౌతికవాదం క్రొత్తదికాదు. గతితార్కిక భౌతికవాదపు పడికట్లుకూడ క్రొత్తవికావు. చార్వాకుడు, బుద్ధుడు, కాణాదుడు, డెమోక్రిటస్, ఎపిక్యూరస్, బేకన్, లూథర్... ఇలాగే ఎందరో తత్వశాస్త్రవేత్తలు దేశదేశాలలో ఆదర్శవాద విఫలతపైన అన్నికాలాలలోను తిరుగుబాట్లు చేస్తూనేవచ్చారు—కాని 19వ శతాబ్దం ఆరంభంవరకు వారి విచారధారలకు తగు శాస్త్రాధారాలు లభింపలేదు. కాబట్టి ఆదర్శవాదపు 'మత' రూపకమైన అధికారబలాన్ని వారు నిర్మూలం చేయలేకపోయారు. పైగా ఆదర్శవాదులు అసత్య ప్రచారాలతో, నైతిక అభాండాలువేయటంతో, చతురోపాయాల దురుపయోగంతో, కుట్రలతో, దమననీతితో భౌతికవాదాన్ని, వాదులను, వారి ఆక్షేపణలను అణచివేయగల్గారు.

కాని ఇటీవల విజ్ఞానశాస్త్రం—విజ్ఞాన ప్రచారం—గొప్ప వికాసాన్ని చేకూర్చుకుంది. శోషక పాలకవర్గాలకు ఆదర్శవాదమూ, పీడిత శ్రామిక వర్గాలకు భౌతికవాదమూ పోరాటాయుధాలుగా రూపొందినవి. ఈ సిద్ధాంత పోరాటపు పర్యవసానమేమిటో అప్పుడే దేశదేశాల సమకాలిక చరిత్ర పుటలలో కన్పిస్తూనేఉన్నది. ఇదే వ్యక్తివాద సమాజవాదాల నేటి మానవపోరాటం.

మార్క్స్—ఎంగెల్స్—లెనిన్ ల పరిశోధనలమూలంగా నిర్మాణమై ప్రపంచంలో నేడు వ్యాప్తిగాంచుతూఉన్న ఈ గతితార్కిక భౌతికవాద తత్వశాస్త్ర మూలసూత్రాలు యువకశక్తులూ, విద్యార్థులూ, ప్రజా కార్యకర్తలూ ప్రతివారూ తప్పక తెలిసికోవలసినవి. ఈ ఆశయంతోనే మృతజీవి పొలిట్జర్ ఈ ప్రాథమిక పాఠాలను వ్రాశాడు. దీన్ని కాకతీయ ప్రచురణల నిర్వాహకులు తెలుగులో ప్రకటిస్తుండటం ముదావహం.

ఈపుస్తకంలో చెప్పబడేవిషయాలన్నీ క్రొత్తవికావు. ఇందలి భావాలు మనకందరికీ నిత్య జీవితంలో అనుభవమౌతుండేవే. ఐతే, ఆ భావాల చిరు పుస్తకంలో ఏకత్రితంగా పొలిట్జర్ చే శాస్త్రీయంగా క్రమీకరింపబడియున్నవి. ఎలాగో గమనిస్తూ ఈ పుస్తకాన్ని చదవాలనేదే నా సలహా...

ఒక మార్క్సిస్టు.

# ప్రకాశకుల మనవి.

పీఠికలో మా ' అజ్ఞాత ' మిత్రుడు చెప్పినట్లుగా ఈ పుస్తకములోని సంగతులు మనం ' సరిక్రొత్త ' గా నేర్చుకొనబోయే అద్భుత నిరూపణలూ లేక " వింతలూ, విశేషాలు " కాక సర్వసాధారణంగా మనం అనుకుంటూఉండే విషయాలే. మనకు నిత్యజీవితంలో—అనుభవరంగంలో—ఎన్నెన్నో భావాలు కల్గుతుంటాయి. కాని, వివిధమైన అట్టి మన " విడివిడి " భావాలకు విస్పష్టాకృతులీయటమూ, వాటిని అన్యోన్య సమన్వయరూపకంగా క్రమీకరించటమూ, తులనాత్మకంగా పరిశీలించటమూ, నిష్కర్షలు చేయుటమూమాత్రం జరుగక అవి అర్థలోనే అంతరిస్తుంటాయి. మనం సాధారణంగా మనభావాలను క్రమీకరింప ప్రయత్నించంకూడ. ఇక ఈ పుస్తకం. ఇది అందుకు ప్రయత్నిస్తూఉన్నది. అలాంటి ప్రయత్నమును లేక జిజ్ఞాసను మనలో పురిగొల్ప ఉద్దేశిస్తున్నది. ఇలా ఈ పుస్తకం మన " చైతన్యాన్ని " పెంపొందించుటకు ఉపకరిస్తుంది. దీని ప్రాధాన్యతను మనం ఈరూపంలోగుర్తించుటకు ప్రయత్నిస్తూచదవాలి.

ఈ పుస్తకం మృతజీవి పొలిట్జర్ అను ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ ప్రచారకుడు ఫ్రెంచి ' కార్యకర్తల తరగతులలో ' ఇచ్చిన తాత్వికోపన్యాసాల సంకలనం. పొలిట్జర్ రెండవ ప్రపంచ యుద్ధంలో నాజిలచే ఖైదీగాపట్టుబడి కాల్చివేయబడ్డాడు. పిదప ఆయన ఉపన్యాసాలు ఆస్ట్రేలియా దేశంలోని ' కరెంట్ ప్రచురణల ' చే అచ్చువేయబడి ప్రకటింపబడినవి. దాని ఛాయానువాదమే మన ఈ తెలుగుభాషాప్రతి.

ఈ పుస్తకాన్ని అనువదించటంలో కొన్ని క్రొత్త పారి

భాషికపదాలను కల్పించటం జరిగినది. భారతీయ తత్వశాస్త్ర గ్రంథాలలో వాడబడే కొన్నిపదాలను అలాగే తీసికొనటంకూడ జరిగినది. ఉదాహరణకు process అంటే ' అనుక్రమం ' అనీ, subjective truth అంటే ' వ్యావహారికసత్యం ' అనీ వాడబడి నది. ఐతే, ఒకే పారిభాషికపదాన్ని ప్రతిసారీ, ప్రతిచోటా, అదేరూపంలో వాడాలన్న నియమం పాటింపబడలేదు. యథా వసరంగా పర్యాయపదాలుకూడ వాడబడినవి. ఉదాహరణకు subjective truth అనుటకు జ్ఞాతమూలక వాస్తవంఅనీ, వ్యక్తి గతసత్యం అనికూడా వాడబడినది. ఇలాగే ఇతరపదాలు. ఇందువల్ల పాఠకులకు ఎక్కువపదాలు తెలియుటమూ, ఇంతేకాక విషయంయొక్క అర్థస్ఫురణలో సౌలభ్యమూ, సహజతా పెర గటమూ జరుగుతుందని ఆశింపబడినది. కొన్నిచోట్ల మూలం లోని ఇంగ్లీషుపదాలు బ్రాకెట్‌లో పొందుపరుపబడినవి. కాని అనేకచోట్ల తెలుగుపదాలతోనే నేరుగా ముందుకుపోవుట జరిగి నది. ఇంగ్లీషు తెలిసినపాఠకులు మూలాన్నే చదువుకోగలరు... ఈ పుస్తకం అట్టే ఇంగ్లీషురాని పాఠకులకొఅకని ఉద్దేశింపబడుతున్న దనేభావంతోనే, బ్రాకెట్‌లో సర్వసాధారణంగా ఇంగ్లీషుపదాలు పొందుపరుపలేదు.

ఇక ఈ పుస్తకం ' కఠినంగా ' ఉందా ? లేక ' సులభం ' గానా అన్నవిషయం. ఈ విషయంలో స్వయంగా మృతజీవి పొలిట్జరే అనుమానించాడు. అలాగే అనువాదకుడూ. ప్రకాశ కులమైన మేముకూడా ఇది అత్యంత ద్రాక్షాపాకంలో ఉందని తృప్తిపడటంలేదు. ఈ పుస్తకాన్ని మఱికొంత సుబోధకం (Made easy) గా తిరిగి వ్రాసే అవకాశం లేకపోలేదు. అందు కెవరైనా సమర్థులు లేక ఈ అనువాదకుడే పూనుకుంటే మరీ మంచిదే. ఇక ఈ పుస్తకంలోని విషయం—

# విషయసూచిక.

## ప్రథమభాగం:— ఆదర్శవాద ఖండన.

1 వ ప్రకరణంలో తత్వశాస్త్రాన్ని చదవవలిసిన ఆవశ్యకత, ముఖ్యంగా కార్యకర్తలకు గతితార్కిక భౌతికవాద సిద్ధాంతాల పరిశీలన అగత్యం — 2 వ ప్రకరణంలో తత్వశాస్త్ర మూలసూత్రం: దాన్నిగూర్చిన ఆదర్శవాద భౌతిక వాద దృక్పథాల విభిన్నతలు, 3 వ ప్రకరణంలో ఆదర్శవాద సిద్ధాంత నిరూపణలూ, 4 వ ప్రకరణంలో ఆ నిరూపణలకు సమాధానములూ, 5 వ ప్రకరణంలో అజ్ఞేయవాద నిరాకరణా ప్రధానాంశములు.

## ద్వితీయభాగం:— తాత్విక భౌతికవాద భూమిక.

1 వ ప్రకరణంలో ప్రయోగశాలలలో భౌతికవాదులుగానూ బయట ఆదర్శవాదులుగాను ఉంటూండే విజ్ఞానశాస్త్రజ్ఞుల అజ్ఞేయవాద ధోరణిమూలకీ దౌర్బల్యమూ, 2 వ ప్రకరణంలో సిద్ధాంత పరిచయావశ్యకతా, ఆచరణతో సమన్వయంకానిపక్షంలో దాని అసమగ్రతా, 3 వ ప్రకరణంలో ప్రాచీన భౌతికవాదుల వివిధ విభిన్న తాత్వికధోరణులూ, 18 వ శతాబ్దపు యాంత్రిక భౌతికవాద దృక్పథమూ, ఈ రెంటీ అసమగ్రవీక్షణమూ ప్రధానాంశములు.

## తృతీయభాగం:— తాత్విక జిజ్ఞాస లేక ఆలోచనయొక్క పాతవిధానం.

ఆధిభౌతికవిధానంలోని అచల "అవికల్ప" మూలసూత్రమూ, యాంత్రికవాదంలోని స్థిరశాశ్వత వర్గీకరణవిధానమూ, ఈ రెంటి సారూప్యమూ, తర్కశాస్త్ర విశ్లేషణా, ఈ దృక్పథాలలోని అసమగ్రతా ప్రధానాంశములు.

## చతుర్థభాగం;— గతితార్కిక భౌతికవాద నిరూపణ.

1 వ ప్రకరణంలో గతితర్కం లేక చలనవాద సిద్ధాంతావిష్కరణా, నూతన శాస్త్రపరిశోధనలతో నూతన ఆలోచనావిధానపు సమన్వయం...

హేగెల్ భావవాద గతితర్కమూ, దానికి మార్క్సు ఎంగెల్సులిచ్చిన భౌతికవాద నూతనస్వరూపమూ, నిరూపింపబడినవి. 2వ ప్రకరణంలో యాంత్రిక చలనమూ, గతితార్కిక చలనముల విభేదమూ, గతితార్కిక చలన నిర్వచన నిరూపణలూ వివరింపబడినవి. 3వ ప్రకరణంలో గతితార్కికచలనపు ఆధారమూ, స్వభావమూ; చారిత్రిక అభివృద్ధియొక్క క్రమమూ; వస్తువులోని మార్పూ, దాని నూతన స్వరూపావిష్కరణక్రమం విశ్లేషింపబడినవి. 4వ ప్రకరణంలో గతితార్కికసూత్రముల అనుసంధానవిధానం నిరూపింపబడినది. 5వ ప్రకరణంలో గతితార్కికసూత్రముల స్వభావమూ, ప్రకృతికీ చరిత్రకూ వాని సమన్వయమూ వివరింపబడినది.

## పంచమభాగం;— చారిత్రిక భౌతికవాదం.

1వ ప్రకరణంలో చరిత్రకు ఆదర్శవాదపు సమన్వయరీతీ, భౌతికవాద సమన్వయవిధానమూ చర్చింపబడినవి. 2వ ప్రకరణంలో వర్గముల ఆవిష్కరణ క్రమమూ, చరిత్ర నిర్మాణంలోని వాటిపాత్ర విశ్లేషించి చూపబడినది.

## షష్ఠమభాగం;— సిద్ధాంతాలతో మార్క్సిజం సమన్వయం.

ఈ ప్రకరణంలో సిద్ధాంతాల పాత్రను మార్క్సిజం ఎలా గుర్తిస్తుందో, సిద్ధాంతభాగపు చర్యనూ ప్రతిచర్యనూ ఎలా గమనిస్తుందో, తప్పుడు చైతన్యాన్నీ చైతన్యాన్నీ ఎలా విభజిస్తుందో-సిద్ధాంతానికి గతితార్కిక భౌతికవాదపు పరిశీలనాక్రమమెలా ఉండాలో, సిద్ధాంతిపోరాటం ఎందుకవసరమో సూచింపబడినది.

× × ×

పాఠకులు ముందు నేరుగా ఒక్కొక్క ప్రకరణాన్ని చదువుకోవాలి. ఆపైన ఈ విషయసూచికలోని పరిచయవాక్యాలతో పోల్చిచూచుకోవాలి. ఒకవేళ విషయాన్ని సరిగా ఆకళింపు చేసికోనట్లయితే— ముందు చదివియున్న ప్రకరణాన్ని మరొకమారు చదువుకోవాలి. విద్యార్థులు ముఖ్యంగా ఈ విధానాన్ననుసరించటం విషయాన్ని సరిగా గ్రహించుటకు ఉపకరింపగలదని నమ్ముతున్నాము.

ఈ పుస్తకంలో అనేక ఉదాహరణ లీయబడియున్నవి. అవి తరుచు గతితార్కిక సూత్రాలను (1) సృష్టి లేక వస్తువుకూ, (2) సమాజం లేక మానవునికీ, (3) విజ్ఞానశాస్త్రం లేక భావమునకూ సమన్వయించేవిగా పొందుపరుపబడియున్నవి. తత్వశాస్త్రపు ధ్యేయం సువిశాలమైన ఈ మూడు సమస్యలకూ సమాధానాలీయటం. ఈదృష్ట్యా పొలిట్జర్ ఉదాహరణలను స్వీకరించాడు.

ఈ పుస్తకం గతితార్కికవిధానంలో వ్రాయబడియున్నది. పుస్తకాన్ని పూర్తిగా చదివినపిదప విషయసూచికను గమనిస్తూ ఒక్కొకవిషయం క్రమంగా ఎలా ఆవిష్కరింపబడ్డదో చూస్తే ఈవిషయాన్ని పాఠకులు స్వయంగా గుర్తింపగలరు. ఇంతచిన్న పుస్తకంలో, కొద్ది అవకాశంలో, ఇంతగంభీరమైన సమస్యలను వివరిస్తూకూడ పొలిట్జర్ యథావసరంగా మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ల ఉద్ధరణలను విరివిగా పొందుపరచాడు. ఇది ఆయన ప్రతిభకూ, శ్రద్ధకూ ఒక నిదర్శనం.

ఈ పుస్తకం చదువుతుంటే మనం అతివేగంగా రైలుప్రయాణం చేస్తూ కిటికీగుండా క్షణక్షణానికి ఒక్కొక్క ప్రకృతి దృశ్యాన్ని వరుసగా చూస్తూ ముందుకుసాగిపోతున్నట్లుంది. ఐనా పొలిట్జర్ 'ప్రతి దృశ్యాన్నీ' మన మస్తిష్కంలో వీలైనంత స్పష్టంగా చిత్రించుటకు ప్రయత్నించాడు. మనకు వివరింపబూనిన ప్రతి విషయపు కీలకస్వరూపాన్ని మనముందుకు తెచ్చాడు. అతి సంక్షేపంగా, ఐనా స్పష్టంగా, దాన్ని మనకు పరిచయంచేశాడు. కాని ఆ వెంటనే మరొకవిషయం ప్రారంభమైపోతుంటుంది...కాబట్టి... ఈ పుస్తకాన్ని చదువునప్పుడు సామాన్యపాఠకుడు వీలైనంత ప్రమత్తతతో విషయాన్ని సరిగా అవగాహనచేసికొన ప్రయత్నించటం అవసరమౌతుంది. లేకపోతే అతడు అపోహాలకు గురికానూవచ్చు...

ఇందలి తెనుగు అనువాదంలో కొన్ని కఠినపదాలు ఉన్నాయి. వాటి స్థూలమైన అర్థం పుస్తకం చదువుతూపోతే కొంతవరకు విడిపోతుంది. కాని అనుమానంకల్గించే ప్రతి పదాన్నీ — తెలుగుభాష తెలిసినవారినుండియైనా లేక నిఘంటువుద్వారానైనా స్పష్టంగా తెలిసికొనటం మంచిది. ఇలాంటి పుస్తకాల రచనలో సాభిప్రాయంగా కొన్ని నిర్దిష్టపదాలను వాడకతప్పదు. అందుకని అసంతృప్తిపడి ప్రయోజనంలేదు...ఒక్కొక్కప్పుడు విషయాన్ని గురించి కూడా పెద్దలనుండి వివరణను కోరవలసిన అగత్యం కల్గవచ్చు. అందుకు విద్యార్థులు సంకోచింపకూడదు.

× × ×

ఇక ఈపుస్తకాన్ని ఎందుకు ప్రచురిస్తున్నారనే ప్రశ్న... లేక మరోవిధంగా దీన్నెందుకని చదవాలన్నప్రశ్న... ఈ ప్రశ్నను మొదలే వేయటంకంటే పుస్తకాన్ని పూర్తిగా చదివి వేయటం మంచిది.

"మన సమాజం 'ఎవరికోసం వారు' విడిగా వ్యక్తిగా బ్రతికియుండాలన్న సూత్రంపై నిర్మాణమైయుంది. మన తత్వశాస్త్రంకూడా "నిన్ను నీవు నీలోచూపుద్వారా తెలిసికో" అంటుందేకాని, బయటి ప్రపంచాన్ని పరిశీలించటంద్వారా విజ్ఞానాన్ని గడించాలని చెప్పదు. మన కర్మసిద్ధాంతం పుట్టుకలలో సంక్రమించే దారిద్ర్య, సౌభాగ్యాలతోబాటు కులవృత్తి ధర్మాలనుకూడా శాశ్వతీకరించేధోరణిని కల్గియుంది. ఇవ్వన్నీ అనిర్వాచ్యుడైన దేవునిచే అనిర్వాచ్యమైన మాయద్వారా ఇలాగే కల్పింపబడినవని మన మతం నూరిపోస్తుంది. ఈ సిద్ధాంతాలు సంస్కృతిపేర, సాంప్రదాయంపేర ధనికవర్గానికి పెట్టనికోటగానూ, శ్రామికప్రజలకు దారిద్ర్యశృంఖలంగానూ చలామణిలో నున్నాయి. "వ్యక్తి లేక వ్యాపార" స్వేచ్ఛ సాకుతో కొద్దిమంది గుత్తపెట్టుబడీదార్లు కోట్లకోలది పేదప్రజల నోటిముందరి కబళాలను దోపిడీచేసి "గగనచుంబిత హర్మ్యాల" నాగరికతకు నిర్మాతలుగా భావింపబడ్తున్నారు. ఇలా కేవలం డబ్బు-లేక దానిమూలంగా సంక్రమించే అధికారంతోనే-మానవత్వపు విలువలు కట్టబడ్తున్నాయి. ఇట్టి బ్రహ్మాండమైన భావదాస్యంలో, ఆత్మవంచనలో, నిరాశాంధకారంలో మునిగి తేలుతూ ఇదే 'మానవజీవితం' కాబోలునని మనం భ్రమపడ్తున్నాము. "ప్రకృతీ, మానవుడూ, భావమూ" ఈ మూడూ ఘనోత్పత్తి స్వాముల దయా దాక్షిణ్యముపై ఆధారపడే 'దాస్య' స్థితిలో బంధింపబడియున్నాయి. దీన్ని పాలకవర్గాలు "వ్యక్తి స్వేచ్ఛ"

గా శ్లాఘిస్తుంటే–సామాన్య ప్రజలు “సంసారం సాగరం దుఃఖం” అని విధిలేక ఊరడిల్లుతున్నారు...”

దీనికి మతం లేక మన తత్వశాస్త్రం చూపే తరణోపాయ మేమిటి? వైరాగ్యం, హఠయోగం, సన్యాసం, లేక తపం అనే మార్గం...దరిద్రులకూ, లేక “ఆకలిచావుల” భయంలో అనుదినమూ మునిగితేలే నిరుద్యోగులకు, చూపబడే వ్యక్తి స్వేచ్ఛ ఇదే...ఇది జీవన్మృతి స్వేచ్ఛఅన్నమాట! మనిషి బ్రతికినన్నాళ్ళూ ఇలాంటి స్వేచ్ఛ ననుభవించాలట! అలా కిక్కురుమనకుండా, బుద్ధిమంతుడిలాగా అనుభవిస్తేనే చచ్చినపిదప స్వర్గం లేక కైలాసం లేక వైకుంఠం దొరుకుతుందని తృప్తిపడాలట...

సమాజజీవనపు ఈ అంధకారస్థితిలో మనముందుకువచ్చే అతి ప్రధానమైనప్రశ్న యేమిటి? ఈ దుస్థితి ఎల్లకాలం ఇలాగే ఉంటుందా? మానవుని జీవితం ఇలా “సాగరం దుఃఖం” గా దిక్కులేని ఏకాకిగా గడపవలసిందేనా? ఇంతకూ ఇదే దేవుని అటలనిర్ణయమా?

ఈ ప్రశ్నలకీ తత్వశాస్త్రం సరియైన సమాధానాలిస్తుంది. నేటి మానవ సమాజస్థితి ఈ పైఘోరవిధానంలో ఎందుకని యేర్పడియుందో...ఎలా యేర్పడిందో...అది యెలా అంతరిస్తుందో, ఎందుకని అంతరిస్తుందో వివరిస్తుంది. అంతేకాకుండా మానవుని ఏకాకిత్వ నిస్సహాయతను నిర్మూలిస్తూ అతనికి వర్గ చైతన్యపు దారిచూపి ధైర్యం కల్గిస్తుంది. పై స్థితిగతులలో వర్గగతుడైన మానవునిపాత్ర ఎలా ఉండాలో నిర్దేశిస్తుంది. అంటే ఈస్థితిలో మానవుడు ఎలా ఆలోచిస్తున్నాడు—ఏంచేస్తున్నాడు—ఏంచేయాలి? ఎలా ఆలోచించాలి? అన్న కీలకప్రశ్నను విడమరచి సమాధానం చెప్తుంది. ఆ సమాధానం ఊహాగానం కాదు. అది చరిత్రప్రమాణాల, పరిస్థితుల ప్రత్యక్షసాదృశ్యాల, విజ్ఞానశాస్త్రపు ఆధారాలపైన నిర్మాణమై ఆచరణక్షేత్రంలో క్షణక్షణం పురోగమిస్తూ కనులముందు కన్పిస్తున్న సమాధానము...ఇదీ ఈ చిన్న పుస్తకపు పెద్దప్రాధాన్యత.

ఈ పుస్తకప్రధ్యేయం వైస్థితిలో క్రగ్గుతున్న శ్రామికవర్గం వర్గచైతన్యాన్ని చేకూర్చుకోవాలని, అశేష కార్మిక ప్రజానీకం ఏకమై కదలి వర్గపోరాటం సాగించాలని... శ్రామికరాజ్యం స్థాపించి వర్గరహితసమాజాన్ని నిర్మించాలని. ఆ సమాజంలో ఘనోత్పత్తి ద్వారా వేలరెట్లు పెంచబడే వస్తుసామగ్రి యంతా విరివిగా ప్రజావసరాలను తీర్చుటకు ఉపయోగం కావాలని... అందుకు తరుణ మాసన్నమైనదనీ, ఇలా జరగటం సహజమనీ, అనివార్యమనీ, నేటి యుగధర్మమనీ ఈ పుస్తకం సైద్ధాంతికంగా నిరూపిస్తుంది. ఇదే గతితార్కిక భౌతికవాదపు ఆశాపూరిత అభ్యుదయమార్గం...

కాబట్టి మేమీపుస్తకాన్ని ప్రచురిస్తున్నాము. అందుకనే మీరు దీన్ని చదవాలి. అన్ని సమస్యలనూ ఆవరించి వాటి కన్నిటికీ సమాధానాలిచ్చే ఈ చిన్న సర్వతోముఖగ్రంథం ముఖ్యంగా యువకశక్తులకూ, కార్యకర్తలకూ—కొందరికైనా, కొంతవరకైనా—తప్పక ఉపకరిస్తుంది. ఈనాటి తెలుగు సారస్వతంలో ఇలాంటి మరికొన్ని శాస్త్రీయగ్రంథాలు వెలువడటం కూడ అవసరం. అందుకు పూనుకొనుఅవకాశాలు చేకూరితే వాటిని చేజార్చుకోమనిమాత్రం ఇక్కడ మనవిచేయగోరుతున్నాము. రానున్న పుస్తకం "మన సాహిత్యచరిత్రలో మార్క్సిజం" అని అనుకుంటున్నాము...అవకాశాలూ, పరిస్థితులూ అనుమతిస్తేమాత్రమే. ఇక సెలవు.

అక్టోబర్ 1954. ప్రకాశకులు.

---

ఈ పుస్తకంలో కొన్ని అచ్చుతప్పులు దొరలియున్నవి. కాని అంత ప్రమాదకరమైన తప్పులు కానందున తప్పొప్పులపట్టిక నీయలేదు. ఒక ఇండెక్సును జతపరచాలనికూడా అనుకున్నాం. కాని అలా చేయలేకపోయాం. ఇందుకు క్షంతవ్యులము.

# 1 తాత్త్విక సమస్యలు.

## (1) మనం తత్వశాస్త్రాన్ని ఎందుకు చదవాలి?

ఈ పుస్తకంలో భౌతికవాద తత్వశాస్త్ర ప్రాథమిక సూత్రాలను పరిచయం చేస్తాము ... ఎందుకని?... ఎందుకంటే మార్క్సిజం ఒక తాత్త్విక దృక్పథానికీ విధానానికీ సన్నిహిత సంబంధాన్ని కల్గియున్నది. మార్క్సిస్టు తత్వశాస్త్రం "గతి తార్కిక భౌతికవాద" మనబడుతుందని మీరు తెలిసియే యుంటుంది. ఈ తత్వశాస్త్ర సూత్రాలను సూక్ష్మంగా తెలిసికొనుటవల్లనే భౌతికవాద విద్యార్థులు వివిధ శంకలను నివారించుకొనటం సాధ్యమౌతుంది. అప్పుడే దృఢనిశ్చయ మేర్పడగల్గుతుంది.

నిష్కర్ష లేక దృఢనిశ్చయం కార్యక్షేత్రంలో పటిష్టమైన ఆచరణకు దారితీయగలదు... స్థిర దృక్పథ మేర్పడుటకు సూక్ష్మమైన శాస్త్రీయ వివేచన అవసరం. అట్టి వివేచనవలన కలుగు చైతన్యం ఆచరణకు మూలశక్తిగా పని చేస్తుంది. కావున 'సిద్ధాంతం, ఆచరణ' ఈ రెండూ సమన్వయం పొందుటకు భౌతికవాద విద్యార్థులకీ తత్వశాస్త్ర పరిచయం అవకాశం కల్గిస్తుంది.

### ఆచరణ అనగానేమి?

చైతన్యయుతమైన చర్యయే ఆచరణ. ఉదాహరణకు పరిశ్రమలూ వ్యవసాయం తీసుకుందాం. ఇవి కొన్ని రసాయనిక, భౌతిక, లేక జీవశాస్త్ర సూత్రాల ప్రయోగాత్మక రూపాలన్నమాట.

### సిద్ధాంతం అనగా?

మనం తెలిసికొనగోరు వస్తువునుగూర్చిన వివేకమే సిద్ధాంతం. ఒకడు కేవలం అభ్యాసగతంగా పరిశ్రమ (పని) చేయవచ్చు. అతడు తన వ్యవహారంవల్ల కార్యక్షేత్రంలో అనుభవపూర్వకంగా మాత్రమే తెలిసికోగలడు. మరొకడు

కేవలం సిద్ధాంతాలను చదువుకోవచ్చు. కాని ఆ సిద్ధాంతాలు ఆచరణలో అనుభవానికిరావు. ఐతే, ఆచరణకూ, సిద్ధాంతానికీ అన్యోన్య సమన్వయం ఏర్పరచుకోబడాలి. అసలు "సిద్ధాంతం" ఎలాంటిది? దానికి "ఆచరణ"తో గల సమన్వయం ఎలాంటిది? అనే వివేచన ఒక వివేకశీలికి ఎంతైనా వాంఛనీయము. ఈ వివేకమే సరియైన ఆచరణకు దారితీస్తుంది.

కార్యక్షేత్రంలో కచ్చితమైన "ఆచరణ" ఏర్పడాలంటే సక్రమమైన విశ్లేషణ, నిర్దుష్టమైన వివేచన అవసరమౌతవి. అట్టి వివేచన "మూఢ విశ్వాసం" లేక "శరవాదం"పై ఆధారపడకూడదు క్రమంగా పరిణత రూపంలో మార్పుచెందే వాస్తవాలనుండీ, పరిస్థితులనుండీ, అనగా "జీవితం" నుండీ, చరిత్రనుండీ సాలోచనపూర్వకమైన గుణపాఠాలు తీసుకోబడాలి. ఈ విధానమే గతితార్కిక భౌతికవాద తత్వశాస్త్రంలో అవలంబింపబడుతుంది... ఏవిధంగా?... ఆ విషయాన్ని మనమీ చిన్న పుస్తకంలో చర్చకు తెచ్చుకుంటాము...

## (2) తత్వశాస్త్రాన్ని చదువుకోవటం కష్టమా?

సర్వసాధారణంగా తత్వశాస్త్రం సామాన్య విద్యార్థులకు అందుబాటులో ఉండని ఏ "బ్రహ్మవిద్య"గానో భావింపబడుతుంటుంది. మన సనాతన పండితులు తత్వశాస్త్రం పండితస్థాయివారికి మాత్రమే చెందే అతి క్లిష్టమూ, కష్టమైనవిద్యగా ప్రచారం చేస్తుంటారు. యువకులకూ, సామాన్య ప్రజానీకానికీ అది అసలే బోధపడని అతీతవస్తువనే ధోరణి నవలంబించి విద్యార్థులను సర్వసాధారణంగా బెదరగొడ్తుంటారు. నిజానికికూడ తత్వశాస్త్ర అధ్యయనం కొంత కష్టమైనదే. కాని, అందులో అసంభవమేమీ లేదు. అతీతత్వం అసలేలేదు. ఏ క్రొత్త అంశమైనా మొదట కష్టంగానే కనపడ్తుంది. అలాగే తత్వశాస్త్రంకూడా. కాని, చదువుకోదలచిన ఒక సామాన్యపాఠకుని సామాన్యబుద్ధికి అది అసాధ్యమైనదిమాత్రం కాదు. కాబట్టి మనం తత్వశాస్త్ర మనగానే బెదరిపోయే అగత్యంలేదు....

ఇక సామాన్యంగా వాడుకలో క్లిష్టంగా అయోమయంగా కనపడే కొన్ని నిర్వచనాలను మనమిప్పుడు తెలిసికొందాంగాక!

## (3) తత్వశాస్త్రమంటే ఏమి ?

సాధారణంగా తత్వశాస్త్రజ్ఞుడంటే ఏ ఆకాశవీధుల్లోనో విహరించేవాడనీ, లేక ఏ ఋషి, ముని, మహాత్ముడోననీ, ప్రపంచంలోని మంచితో గాని, చెడుతోగాని ప్రమేయం లేనివాడనీ (ప్రపంచాతీతుడనీ) భావింపబడ్తుంది. ఇదంతా వట్టి బూటకం! వాస్తవంలో తాత్వికునకుకూడ కొన్ని ప్రశ్నలకు స్పష్టమైన సమాధానాలివ్వాలి. తత్వశాస్త్రం సృష్టి క్రమానికి చెందినది. కాబట్టి ప్రపంచం ఎక్కడినుండి పుట్టింది? మనం ఏవంకకు పోతున్నాం? అనేసమస్యలనుగురించి తాత్వికుడు ఆలోచిస్తాడు. అంతేకాని, అతడేదో అర్థంకాని అయోమయపు పటాటోపం చేస్తాడని భావింపబడకూడదు.

తత్వశాస్త్రం సృష్టిని ప్రపంచాన్ని — దానికిచెందే సువిశాలసమస్యలను బోధిస్తుంది. ఆయా ప్రత్యేక సమస్యలను ఆయా విజ్ఞానశాస్త్రాలు నిరూపిస్తాయి. కాబట్టి తత్వశాస్త్రం ఆయా విజ్ఞాన శాస్త్రాల సమన్వయరూపమై యుండాలి. అలాగే 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' అన్ని సమస్యలనూ ఆదరించి వాటికి శాస్త్రీయ సమాధానాలను కల్గియుంటుంది. మార్క్సిస్టులు ఈ సమాధానాలన్నీ "భౌతికవాదం"నుండి ఆవిర్భవిస్తవని గతితార్కిక భౌతికవాదాన్ని నిర్వచిస్తారు.

## భౌతికవాద తత్వశాస్త్రమంటే ?...

'భౌతికవాది' అనగానే సర్వసాధారణంగా "తన ఐహికసుఖాలు" తప్ప మరేమీ ఆలోచింపలేనివాడుగా భావింపబడ్తుంది. భౌతికవాదికి నీతి, నియమం ఉండదనికూడా ప్రచారం చేయబడ్తుంది. ఒక భౌతికవాదికికూడా "ఆదర్శాలూ" వాటి సాధనకొరకు "పోరాటాలూ" వర్తిస్తాయని గమనింపబడదు... ఐతే, ఇదంతా బుద్ధిపూర్వకమైన ప్రచారమేనని మనం ముస్ముందు తెలిసికోగలము.

తత్వశాస్త్రం ప్రపంచపు అతి విస్తృత లేక వ్యాపక సమస్యలకు సమాధానాలిస్తుందని మనమిదివరకే గమనించాము. ఐతే చరిత్రయొక్క సుదీర్ఘ కాలక్రమంలో ఈ సమాధానాలు ఎల్లప్పుడూ ఒకేవిధంగా లేవు. అనేక

యుగపు మనుష్యులు ప్రకృతిని నిర్వచింప ప్రయత్నించారు. కాని అప్పుడు ప్రకృతికి చెందిన విజ్ఞానశాస్త్రాలు వికసించినదశలో లేవు. కావున వారు ప్రకృతిని స్పష్టంగా నిర్వచింపలేకపోయారు.

విజ్ఞానశాస్త్రాలు ఇటీవలనే వికసించినవి. కాబట్టి పూర్వకాలపు మానవునికి తత్వశాస్త్ర పరిశోధనకు అవకాశాలు కొరవడినవి. అందువలన అతను 'మతాలను' సృష్టించుకోవలసివచ్చింది. ఈ మతాలు 'ఆధ్యాత్మిక' లేక ప్రకృత్యతీతశక్తులను ఆశ్రయించవలసివచ్చింది. అంటే విజ్ఞాన శాస్త్ర ధారానికి వ్యతిరేకమైన మార్గం త్రొక్కబడినదన్నమాట. కాని వివిధశాస్త్ర సంశోధనలవల్ల క్రమంగా విజ్ఞానం పెరుగసాగింది. విజ్ఞానం పెరిగినకొద్దీ, వాని ఆధారంపై తత్వశాస్త్రాన్ని నిర్మాణంచేసే ప్రయత్నంకూడా క్రమంగా గత కొన్ని శతాబ్దాలుగా వికసించసాగింది. ఆయా శాస్త్ర ప్రయోగాల అనుభవ పరంపరల ఆధారంపై సృష్టినీ, దాని క్రమాన్ని నిరూపించు ఉద్యమం క్రమ క్రమంగా వికసించింది. ఇదే భౌతికవాదం. భౌతికవాదమంటే సృష్టి క్రమం యొక్క శాస్త్రీయ అనుసంధానమేనన్నమాట.

ఐతే, అజ్ఞాన వ్యతిరేక పోరాటం చాలా క్లిష్టమైనది. అందలి సాధక బాధకాలను మనం భౌతికవాద తత్వశాస్త్ర చరిత్రను పరిశీలించు సందర్భమున గమనించగలము. కాని నేటికికూడా విజ్ఞానానికీ, అజ్ఞానికీ జరుగుతున్న పోరాటమింకా ముగియలేదు. ఈనాడు కూడా భౌతికవాద విజ్ఞానమూ అజ్ఞానమూ రెండూ ఒకదానిప్రక్కనే మరొకటి, నిల్చియేయున్నవి.

...19వ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రం బ్రహ్మాండమైన వికాసాన్ని సాధించుకుంది. తదనుగుణ్యంగా భౌతికవాద తత్వశాస్త్రం విశ్వ క్రమాన్ని విజ్ఞానశాస్త్రాల ఆధారంపైన నిరూపించుటకు అతి సూక్ష్మమైన ప్రయత్నం సాగించింది. ఈ కృషికి పర్యవసానంగా మార్క్స్, ఎంగెల్స్‌ల పరిశోధనల ద్వారా గతితార్కిక భౌతికవాదం జన్మించింది. దీనిద్వారా ప్రపంచాన్ని శాసించే శాస్త్రీయ సూత్రాలు (మానవ) సమాజ పురోగతినికూడ బోధపరచ గలవను విషయం తొలిసారి గమనింపబడినది. ఈ కృషిఫలితమే చారిత్రక భౌతికవాద సిద్ధాంతంగా ఆవిష్కరణైనది.

ఈ పుస్తకంలో క్రమంగా భౌతికవాదాన్ని, గతితార్కిక భౌతికవాదాన్ని, ఆపై చారిత్రక భౌతికవాదాన్ని మనం పరిశీలించగలము. ఈ లోగా భౌతికవాదానికీ, మార్క్సిజానికీ గల సంబంధాలను ప్రస్తుత మిక్కడ తెలుసుకొందాం.



## భౌతికవాదానికీ మార్క్సిజానికీ సంబంధాలేమిటి ?

ఆ సంబంధాలను మనమీ క్రిందివిధంగా ఉదహరింపవచ్చు —

(1) భౌతికవాద తత్వశాస్త్రం మార్క్సిజానికి మూలసూత్రం.

(2) ప్రపంచసమస్యలకు శాస్త్రీయములగు సమాధానాలిచ్చే భౌతికవాద తత్వశాస్త్రం, చారిత్రగతిలో విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధి క్రమంతో సమకాలికమైన వికాస సమన్వయాన్ని కల్గియుంటుంది. అంటే, మార్క్సిజం విజ్ఞానశాస్త్రాలనుండి ఉదయించింది కాబట్టి విజ్ఞానశాస్త్రాల వికసనక్రమం ఆధారంనైన, వాటి వికసనతోబాటుగా మార్క్సిజంకూడా వికాసాన్ని చేకూర్చుకున్నదన్న మాట.

(3) మార్క్సు, ఎంగెల్సులకు పూర్వంకూడా చరిత్రలో ఎందరో భౌతికవాదులు కనిపిస్తారు. కాని 19వ శతాబ్దపు విజ్ఞానశాస్త్రాల ఘనమైన ముందంజతో మార్క్సు, ఎంగెల్సులు భౌతికవాదానికి నూతన స్వరూపాన్ని చేకూర్చగల్గారు. వారు ఆధునిక విజ్ఞానశాస్త్ర ఆధారంపై, అనుగుణ భౌతిక వాదాన్ని ఆవిష్కరించారు. ఇదే మార్క్సిస్టు భూమికకు ఆధారమగు 'గతితార్కిక భౌతికవాద' మనబడుతుంది.

పై వివరాలవల్ల భౌతికవాద తత్వశాస్త్రం ఒక చారిత్రకక్రమాన్ని కలిగి యున్నట్లు స్పష్టపడ్తుంది. ఈ చరిత్రక్రమం విజ్ఞానశాస్త్ర క్రమానికి సన్నిహిత సమన్వయాన్ని కల్గియున్నట్లు స్పష్టం. భౌతికవాదంపై ఆధారపడ్డ మార్క్సిజం ఒక వ్యక్తి "మెదడు లేక మస్తిష్కం" నుండి అటూఇటూ ఊడి పడలేదు. "డిమాక్రాట్" కాలానికే ఎంతో వికసనను చేకూర్చుకున్న తత్పూర్వపు భౌతికవాదం, మార్క్సుద్వారా మరొక ముందంజ వేసింది. 18వ శతాబ్దపు విజ్ఞానకోశకారుల నూతనపరిశోధనలును, వాటికి 19వ శతాబ్దపు శాస్త్ర

కారులు పెట్టిన మెరుగులును సమన్వయమై మార్క్సిజం ఫ్రష్పించింది. ఇది సజీవ సిద్ధాంతం. ఇది సమస్యలను ఎలా అవలోకిస్తుందో చూపుటకు మన మొక ఉదాహరణను తీసికొందాం. ఉ దా హ ర ణ: అందరికీ తెలిసిన

'వర్గపోరాటం'...

వర్గపోరాటన్ని సామాన్యంగా ఒకరు ఎలా అర్థం చేసికొంటారు? కొందరు ప్రాథమికావసరాలే ఈ సమస్యగా భావిస్తారు. కొట్టెదొక్కితే చాలు; రాజకీయాలెందుకని వాదిస్తారు... మరికొందరు బజార్లలో అల్లరిచేస్తే చాలు; పెద్ద నిర్మాణ వ్యవస్థ ఎందుకని అనుకుంటారు. మరికొందరు రాజకీయ పోరాటమే ఈ సమస్యకు ఏకైక తరణోపాయమని భావిస్తారు. ఐతే, మార్క్సిస్టు దృష్టిపథంతో వర్గపోరాటమంటే ఏమి?

(1) ఆర్థిక పోరాటం (2) రాజకీయ పోరాటం (3) సైద్ధాంతిక పోరాటం...వర్గపోరాటం ఈ మూడు దృక్పథాల ఆధారంపై ఒకే సమయంలో సమన్వయింపబడి అర్థం చేసికోబడాలి.

(1) ఒకడు " శాంతి " కొరకు పోరాడకుండానే (రాజకీయపోరాటం) కొట్టెకోసం పోరాడలేడు. (ఆర్థికపోరాటం). ఒకడు స్వేచ్ఛకోసం పోరాడకుండా (సైద్ధాంతికపోరాటం) కూడా కొట్టెకోసం పోరాడలేడు. కాబట్టి శ్రామికపోరాటం ఈ మూడు దృక్పథాలతో ఏకకాలంలో గర్భితమైయుంది.

(2) అట్లాగే రాజకీయ పోరాటంకూడా. మార్క్స్ కాలంనుండి అది ఒక ప్రత్యేక శాస్త్రీయ స్వరూపాన్నే చేకూర్చుకుంది. రాజకీయపోరాటంలో ఒక మార్క్సిస్టు ఆర్థిక స్థితిగతులయు, సైద్ధాంతిక ధోరణులయు, ఆధారాలను విస్మరింపజాలడు.

(3) అట్లాగే సైద్ధాంతికపోరాటం. సైద్ధాంతికపోరాటం పరిభావవంతం కాలేకపోవటమంటే, అది రాజకీయ పరిస్థితులకూ, ఆర్థిక సమస్యలకూ సరియైన అన్వయాన్ని చేకూర్చుకో లేవందువల్లనేనన్న మాట...

వర్గపోరాటంలో ఈ సమస్యలన్నీ అన్యోన్యాశ్రయాధారంపై ఏకీభావమై యున్నవన్నమాట. కాబట్టి ఒక్కొక్క దృక్కోణంతో ఒక్కొక్క సమస్య

చెప్పిన విడిగాను, ఆపైన సంయుక్తంగాను సమస్య స్వరూపాన్ని — వర్గ పోరాటాన్ని – పరిశీలించనిదే ఏ ఒక్క ప్రత్యేకరూపాన్ని గూర్చి ఒక నిర్ణయానికి వచ్చే అవకాశం లేదన్నమాట. కాబట్టి అన్నిరంగాలతోను సమన్వయరూపకంగా పోరాటం సాగించగల్గినవాడు మాత్రమే ఉద్యమానికి సరియైన నాయకత్వాన్ని చేకూర్చగలడు. 'వర్గపోరాటాన్ని' ఒక మార్క్సిస్టు వైవిధంగా అర్థంచేసికొంటాడు.

మన అనుదిన సైద్ధాంతికపోరాటంలో కొన్ని క్లిష్టమైనసమస్యలు ఎదురు పడుతుంటాయి. ఉదాహరణ: జననమరణాతీతమైన ఆత్మ, దేవుని అస్తిత్వం, సృష్టియొక్క మూలం మొదలైనవి. వీటన్నిటికీ సరియైన సమాధానాలిచ్చే వివేచనా సరణిని గతితార్కిక భౌతికవాదం కల్గియున్నది. అంతేకాక, మార్క్సిస్టు సూత్రాల దురన్వయాలనూ లేక అనధికార వ్యాఖ్యానాలనూ బట్టబయలొనర్చే విచారధారనుకూడా కల్గియున్నది....

## మార్క్సిజానికి వ్యతిరేకంగా ధనికవాదుల దాడులు:-

మార్క్సిజానికి వ్యతిరేకంగా 'ధనికవాదులు' ఎన్నో కపటములతో దాడులుచేయ ప్రయత్నిస్తుంటారు. కొందరు మార్క్సిజాన్ని విమర్శిస్తున్నామంటూ కాల్పనికులగు వివిధ సామ్యవాద రచయితల వాదాలను ఉపయోగిస్తుంటారు. మార్క్సుకు వ్యతిరేకంగా ఆదర్శవాదులను నిల్పుతుంటారు. కొందరు 'ప్రౌధన్'ను ప్రయోగిస్తారు. మరికొందరు 1914 కు పూర్వపు రివిజనిస్టులను [మార్క్సువాద సంస్కర్తలు] ఉదాహరిస్తారు. ఇవి లెనిన్ చే తీవ్రంగా ఖండింపబడి బట్టబయలు చేయబడినవి. వీటన్నిటికంటే ప్రధానంగా ధనికవర్గాలు మార్క్సిజాన్ని "మూకీభావం" ద్వారా నిరోధింప ప్రయత్నిస్తుంటారు. మార్క్సిస్టు నిజరూపంలో భౌతికవాద తత్వశాస్త్రం ప్రపంచానికి తెలియకుండా నిరోధిస్తుంటారు. కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను పరోక్షమైన ఆంక్షను పాటిస్తుంటారు. తత్వశాస్త్ర విద్యార్థులకు మార్క్స్ ఎంగెల్సులచే విపులీకరింపబడిన భౌతికవాదం కంటపడకుండా జాగ్రతలు తీసుకుంటుంటారు. 'భౌతికవాదం వేరు, మార్క్సిజం వేరు' అను అపోహాలను ప్రాకిస్తారు. మార్క్సిజం ఒక రాజకీయవాదంమాత్రమేనని చెప్తుంటారు.

చారిత్రక భౌతికవాద ప్రసక్తిలో, భౌతికవాద తత్వశాస్త్ర ప్రసక్తి లేదంటారు. గతితార్కిక భౌతికవాదాన్ని అసలే విడిచిపుచ్చుతుంటారు. ఈ విధంగా మార్క్సిజాన్ని ఖండఖండాలు చేసి 'ప్రజాస్వామ్య' దేశాల విద్యార్థులను కూడా అపోహాలకు గురిచేస్తుంటారు. ఈవిధంగా అనేక దేశాల్లో తత్వశాస్త్ర పండితులకుకూడా మార్క్సిజం లేక గతితార్కిక భౌతికవాదం కంట పడనీయకుండా జాగ్రత తీసికోబడుతూ ఉన్నది.

కాబట్టి మార్క్సిజం అంటే, కేవలం ఒక్క రాజకీయాలే కాక, విశ్వ సమస్యలను వివరించే తత్వశాస్త్రంకూడానని ఈ చిన్న పుస్తకంద్వారా పరిచయం చేయబడుతుంది. "ఈ మార్క్సిజం అంతా బాగానే ఉంది. కాని అందులో తాత్విక దృక్పథంకూడా ఉంటే బాగుండేది" అని విమర్శించే అమాయకుల అనుమానాలను ఈ ప్రాథమిక పరిచయవాచకం నివృత్తి చేయ ప్రయత్నిస్తుంది.

ఐతే పాలకవర్గాలు ఎంత నిరోధింపబూనినా, అవరోధకములైన ఎన్ని అపవిమర్శలు చేసినా, ఎన్నెన్ని ఇనుపతెరలు కట్టినా, మార్క్సిజంమాత్రం బ్రహ్మాండమైన వేగంతో ప్రపంచ జనసామాన్యంలో వ్యాపిస్తూనే ఉంది.... వ్యాపిస్తుంది.

ఈ పరిచయ ప్రకరణంలో మనమీ విషయాలను గమనించాము—

1. మనం తత్వశాస్త్రాన్ని ఎందుకు చదవాలి?
2. తత్వశాస్త్ర అధ్యయనం కష్టసాధ్యమా?
3. తత్వశాస్త్ర మనగా నేమిటి?
4. భౌతికవాద తత్వశాస్త్రమంటే ఏమి?
5. భౌతికవాదమునకూ, మార్క్సిజానికీ సంబంధమేమి?
6. దోపిడివర్గాలచే మార్క్సిజంపై దాడులు...



# 2 తత్వశాస్త్రంయొక్క మౌలికసమస్య.

1. మనం తత్వశాస్త్ర అధ్యయనాన్ని ఎలా ప్రారంభించాలి?
2. ప్రపంచాన్ని బోధించే రెండుమార్గాలు.
3. పదార్థమూ ఆత్మా...
4. పదార్థమనగా?... ఆత్మ అనగా?
5. తత్వశాస్త్ర మౌలికసమస్య
6. ఆదర్శవాదమూ, భౌతికవాదమూ.

## (1) మనం తత్వశాస్త్ర పఠనాన్ని ఎలా ప్రారంభించాలి?

1వ పరిచయ ప్రకరణంలో గతితార్కిక భౌతికవాదమే మార్క్సిజానికి మూలసూత్రమని స్పష్టపరుపబడినది.

మన ఉద్దేశం ఈ తత్వశాస్త్రాన్ని చదవటం. ఐతే, అందుకై మనం కొన్ని దశలను దాటవలసియుంటుంది. గతితార్కిక భౌతికవాదమనటంలో మనముందు రెండు పదాలున్నాయి. 1. భౌతికవాదం; 2. గతితార్కికం. అంటే భౌతికవాదం గతితార్కికమైనదన్నమాట. భౌతికవాదం మార్క్స ఎంగెల్స్‌లకు పూర్వంనించీ ఉండియుండెను. కాని, 19వ శతాబ్దపు విజ్ఞాన శాస్త్రాల వికసన ఆధారంపై మార్క్స ఎంగెల్స్‌లు భౌతికవాదాన్ని గతితార్కిక భౌతికవాదంగా పరిణమింపజేసి సిద్ధాంతీకరించినారు. ఈ తత్వశాస్త్రరూపమే ఆధునిక భౌతికవాదము.

ఆధునిక తత్వశాస్త్రరూపమైన గతితార్కిక భౌతికవాదాన్ని పరిశీలించే ముందు, మనం మార్క్సుకు పూర్వపు భౌతికవాదాన్నీ అర్థం చేసికోవలసియుంటుంది. మార్క్సు ఎంగెల్సులకంటే ముందుకూడా భౌతికవాదు లున్నారు. ఉదాహరణకు 18వ శతాబ్దపు డిడ్రాట్... ఐతే, భౌతికవాదు లందరకూ కొన్ని సమాన ధర్మాలుంటాయి. అందుకని భౌతికవాద చరిత్రను మనం మొదట పరిశీలించాలి. భౌతికవాద వ్యతిరేకుల భావాలనుకూడా గమనించాలి. ఆపిదప గతితార్కిక భౌతికవాదాన్ని మనం సులభంగా అర్థం చేసికోవచ్చు....

## (2) ప్రపంచాన్ని నిర్వచించే రెండుమార్గాలు.

తత్వశాస్త్రమంటే ప్రపంచపు సువిశాల సమస్యల పరిశీలననీ, దాని ధ్యేయం ప్రపంచాన్ని, సృష్టిని, మానవుణ్ణి వివరించుటనీ మనమిదివరకే గమనించాము.

ఒకవేళ మనం ధనికవర్గాల తత్వశాస్త్ర సూచిక లేక పట్టికను తెరచి చూస్తే అందలి వివిధములైన తత్వశాస్త్ర వాద ధోరణులవల్ల తబ్బిబ్బు కాక మానము. ప్రతి ధోరణీ, పెద్దపెద్దపదాలతో— ప్రతిదానిచివరా ఒక 'వాదం'తో కనపడుతుంది. ఉదాహరణకు తర్కవాదం పరిణామవాదం లేక విజ్ఞానవాదం మొదలైనవి. ఇవన్నీ చూడగా గాభరాయెత్తక తప్పదు. వీటన్నిటినీ క్రమీకరించుటకు ధనికవర్గాలు ప్రయత్నంకూడా చేయలేదు. పైగా ఈ వివిధత్వాన్ని మరింతపెంచి క్లిష్టతరం చేశారు. ఎలాగైనా ఈ వివిధవాదాలను మనం క్రమీకరింప ప్రయత్నించక తప్పదు— అప్పుడు మనకు రెండు ముఖ్యమైన విచారధారలు (ఒకదానికి పూర్తిగా వ్యతిరేకమైనది మరొకటి) స్పష్టంగా పొడకట్టగలవు....

[1] ప్రపంచంయొక్క శాస్త్రీయ దృక్పథం.
[2] ,, ,, అశాస్త్రీయమైన దృక్పథం.

## (3) పదార్థం లేక భూతం (Matter) మరియు ఆత్మ (Spirit.)

తాత్వికులు ప్రపంచాన్ని వివరింపబూనగానే మొదట సృష్టినీ, మాన

వృక్షీ, తదితర జడాజడములనూ ఒకటినుండి మరొకటిని ప్రత్యేకించే అవసరం కల్గినది. నిజానికి మనకుకూడా అంతే. కొన్నివస్తువులు తాకేవి, కనపడేవి మొదలగు భౌతికములు కన్పిస్తాయి. మరికొన్ని కనపడనివీ, స్పృశింప వీలులేనివీ, తోచేవీ అగు అమేయములు స్ఫురిస్తాయి.

కాబట్టి మనం పదార్థాలను రెండుతెగలక్రింద విభజిస్తాము. 1. తాకేవి, కనపడేవి మొదలగు భౌతికములు. 2. అమేయములై బుద్ధికి లేక ఆలోచనకు మాత్రం తోచేవగు ఆధ్యాత్మికములు. తాత్వికులుకూడా ఇదేవిధంగా భౌతికములనీ, ఆధ్యాత్మికములనీ ప్రపంచాన్ని విభజించారు.

## (4) పదార్థమంటే ఏమి ? ఆత్మ అనగా నేమి ?

మనం అన్ని తాత్విక విచారధారలనూ "పదార్థం" లేక 'భూతం' మరియు "ఆత్మ" ఆధారంపై రెండుశాఖలలో విభజించాము — ఈ విభజన అనేక రూపాలలోను, అనేక పదాలలో వాడుకలో ఉంది. 'ఆత్మ' అన్నప్పుడు మనం ఆలోచనను, భావాలను, చైతన్యమునూ జీవాన్నీ ఉద్దేశిస్తాము. అలా పదార్థ పరంగా ప్రపంచం, ప్రకృతి భూమి, స్థితి ఉద్దేశింపబడుతాయి.

"స్థితి పదార్థపరంగాను, భావం ఆత్మపరంగాను వాడుకలో ఉంది". (ఎంగెల్స్.)

ఇక భావం లేక ఆత్మ, మరియు స్థితి లేక పదార్థం వీటిని మనం నిర్వచించుకోవాలి. భావం అనగా ఒక విషయాన్ని గురించిన మన అభిప్రాయం. మన కొన్ని భావాలు భౌతిక వస్తుకోటికి చెందినవి. మరికొన్ని భావాలు [ఉదాహరణకు: దేవుడు, తత్వశాస్త్రం, నిత్యత్వం] భౌతిక వస్తుకోటికి కాక ఆధ్యాత్మికములకు చెందినట్టివి.

ఇక్కడ గమనింపదగ్గ మరొకవిషయం. మన భావాలు లేక ఆలోచనలు లేక అభిప్రాయాలు మన అనుభవంద్వారా [అనగా ఇంద్రియములవలన] కలుగులవి. పదార్థం లేక స్థితి మన ఇంద్రియములచే మనకు సాక్షాత్కరింపజేయబడుతుంటుంది—అంటే మన చుట్టూరాగల వస్తు సముదాయం లేక బాహ్య ప్రకృతి మనకు ఇంద్రియములద్వారా గోచరిస్తుందన్నమాట. ఉదా

హారణ: ఒక కాగితం తెల్లగా నున్నది. తెల్లగా నున్నట్లు తెలిసికొనుట ఒక భావం. ఈభావం చూపుద్వారా కల్గుతుంది. పోతే కాగిదమే మో పదార్థం.

అందుకనే తాత్వికులు స్థితినీ, భావాన్నిగురించి చెప్పునప్పుడు లేక ఆత్మనూ భూతమునూగురించి చెప్పునప్పుడు లేక చైతన్యమునూ మెదడునుగురించి చెప్పునప్పుడు ప్రతిచోటా ఒకేప్రశ్న యెదురుపడుతుంది. ఏది ప్రధానతర మైనది? లేక ఏది ముందువచ్చింది? భూతమా లేక ఆత్మా? స్థితియా లేక భావమా? ఈ ప్రశ్నయే తత్వశాస్త్ర మూలసూత్రమన్నమాట.

## (౫) అసలు ప్రశ్న; లేక తత్వశాస్త్ర మూలసమస్య.

మనలో ప్రతివారూ మృతికిపిదప ఏమౌతుందో, ఈ ప్రపంచం ఎక్కడి నుంచివచ్చిందో, భూమి ఎలా యేర్పడ్డదో అని ఆశ్చర్యపడ్డవారే... ఏదోఒకటి ఎల్లకాలమూ ఉంటూవచ్చిందని మనం అంగీకరించటం కష్టం. ఎప్పుడో ఒక ప్పుడు ఏదీలేని (శూన్య) స్థితి ఉండేదని తోచటం సహజం. అందుకే మతం బోధించేది నమ్మటం చాలా తేలిక. మతం అంధకారంలో ఆత్మ సంచలించిం దనీ, ఆపిదప ప్రకృతి యేర్పడిందనీ చెప్తుంది. అదేవిధంగా మనమూ, "మన భావాలు ఎక్కడుంటాయి?" అని ఆశ్చర్యపూర్వకంగా ప్రశ్నించుకుంటాము. ఈ ప్రశ్నకు సమాధానంగానే, మనముందుకు 'ఆత్మ, భూతం, లేక మనస్సూ భావం వాటి పరస్పరసంబంధం అన్నసమస్య వస్తుంది. ఇంకా, ఈ ప్రశ్నను వేయటానికి మరెన్నో మార్గాలున్నాయి. ఉదాహరణకు: ఇచ్ఛకూ సత్తాకూగల సంబంధం ఎలాంటిది? ఇక్కడ ఇచ్ఛఅనగా ఆత్మ లేక భావం; సత్తా అనగా సాధనశక్తి (ఉండునట్టిది) లేక స్థితిఅని ఉద్దేశం. ఇదేవిధంగా మనముందుకు సాంఘిక చైతన్యం, సాంఘిక అస్తిత్వం, వాటి సంబంధాన్ని గూర్చిన సమస్యకూడా వస్తుంది.

ఈవిధంగా తత్వశాస్త్ర మూలసూత్రం వివిధరూపాలలో మనముందుకు వస్తుంది. ఈ "భూతం, ఆత్మల" సమస్య ఎన్నిరూపాలలో ఎదుటపడినా మొత్తానికి అసలు సమస్య స్వరూపాన్ని గుర్తించటం చాలా ముఖ్యము. అసలు రెండేరెండు సమాధానాలుంటాయని మనకు తెలుసు.

1 శాస్త్రీయమైన సమాధానం 2 అశాస్త్రీయమైనసమాధానం.

ఆదర్శవాదం లేదా భౌతికవాదం:—

పై ప్రధాన ప్రశ్నకు సమాధానంగా ఆయా తాత్వికులు తమ తమ ఆయా దృక్పథాలను నిర్మాణంచేసి మనముందుకు తెస్తుంటారు.

ఆదికాలపు మానవులు తమ అల్పవిజ్ఞానంవల్ల - ప్రపంచం యొక్క శాస్త్రీయ విజ్ఞానం వారికానాడింకా చేకూరియుండనందువల్ల - తమకు సుబోధంకాని వివిధ విషయాలను అతీత ప్రాకృతికశక్తులకు ఆరోపించేవారు. తమ కలల్లో వారికి తామూ తమ మిత్రులూ పరిసరాలూ కన్పించగా ఆశ్చర్యపోయి, వారు ప్రతిపదార్థానికీ రెండు అస్తిత్వాలుంటాయని ఊహించుకున్నారు. ఈ ద్వైతాస్తికభావనవల్ల వారు తమ భావాలనూ అనుభూతులనూ తమ శరీరాలకు చెందేవిమాత్రమే కావనీ, ఈ దేహంలో వేరుగా అస్తిత్వం కల్గియున్న ఆత్మకుకూడ చెందేవనీ — శరీరం మరణాన్ని పొందినపిదప ఈ ఆత్మ దాన్ని విడిచివేసి వెళ్ళిపోతుందనీ ఊహించుకున్నారు. ఈవిధంగా ఆత్మ నాశరహితత్వగుణంలోకూడి ప్రత్యేక అస్తిత్వాన్నికల్గియుంటుందన్న ఒక 'ఆధ్యాత్మిక' సిద్ధాంతం ఆవిష్కరణైనది.

ఈవిధంగా ఆధ్యాత్మికవాదం తన స్వరూపాన్ని చేకూర్చుకొనుటకు అనేక శతాబ్దాలకాలం పట్టినది. తుదకు ఆత్మనూ, పదార్థమునూ (ఆధ్యాత్మికములనూ, భౌతికములనూ) విడివిడిగా ఒకటికొకటి వ్యతిరేకంగా నిర్ణయించటం జరిగినది.

నేటికి 25 శతాబ్దాల పూర్వపు గ్రీకు తాత్వికుడు ప్లేటో కాలంలో "మనిషికి" చావుకు పిదపకూడా చాలాకాలం ఆత్మరూపంలో బ్రతుకు ఉంటుందనీ, ఈ ఆత్మ ఒకవిధమైన తేజోద్రవ్యమనీ, కేవలం భావపు (నిరాకార) స్వరూపంలో ఉండదనీ చిత్రింపబడేది. అప్పటి ప్రజలు దేవుళ్ళి నమ్మేవారు. మనిషికంటే శక్తివంతమైన అనేక వస్తువులనూ, శక్తులనూకూడ దేవతలుగా కొల్చేవారు. ముందు దేవతలు భౌతిక స్వరూపాదికంతో చిత్రింపబడేవారు. ఆపై కొన్నివేల యేండ్లకాలానికిగాని ఈ ఆత్మలన్నీ భౌతికసృష్టి ఆధారాన్ని

సమగ్రంగా విడిచివేసి భౌతికాధారానికి అతీతములైన నిరాకారాత్మలు లేక ఒకేఒక్క పరమాత్మ స్వరూపాన్ని చేకూర్చుకొనుట జరుగలేదు. మొత్తం మీద ఆత్మలు పదార్థాలనుండి విడిపడి తమ అస్తిత్వాన్ని చేకూర్చుకున్నవి— ఇలా, "దేహం ఉన్నా లేకున్నా సరే ఆత్మమాత్రం ఉంటుంది; ఉండితీరుతుంది" న్న ఆధ్యాత్మిక సిద్ధాంతం నిష్కర్షను చేకూర్చుకున్నది. ఇందు మూలంగా పదార్థాలకూ, ప్రకృతికీ మూలం ఆత్మలు లేక పరమాత్మ అనే తాత్త్వికవాదం ఆవిష్కరణైనది. (మన ఉపనిషద్వాఙ్మయంలోకూడా ఇలాంటి సైద్ధాంతిక పరిణామక్రమం అనేకపేండ్లుగా కొనసాగినట్లు కనపడుతుంది.)

"ఈ విధంగా, ఈ ప్రపంచం దేవునిచేత సృష్టింపబడినదా? లేక అది నించీ ఉంటున్నదా? అనే ప్రశ్నలు తాత్త్వికులను రెండు స్పష్టమైన తెగల క్రింద విడదీసినవి". [ఎంగెల్స్.]

అశాస్త్రీయ ధోరణిలో తమ వాదనను నిలబెట్టేవారు దేవుడు ప్రపంచాన్ని సృష్టించాడని అంగీకరించారు. అంటే, 'ఆత్మ' 'పదార్థాన్ని' సృష్టించిందనే ఆదర్శవాదుల తెగకు చెందారు. పోతే, శాస్త్రీయ లేక (వాస్తవ) ప్రమాణంపై నిల్చేవారలు. ప్రకృతి లేక పదార్థమే మూలవస్తువని వాదించే భౌతికవాదంయొక్క వివిధశాఖల తెగకు చెందారు. ఆకాలంలో భావవాదమన్నా లేక భౌతికవాదమన్నా ఇంతకుమించిన తేడా లేకుండెను. కాని, రెండూ వేరువేరు మార్గములైనవి. ఇలా ఆదర్శవాదం మరియు భౌతికవాదం తత్వశాస్త్రమూలికసమస్యకు పరస్పర వ్యతిరేకమైన రెండుసమాధానాలు. ఆదర్శవాదం ప్రపంచంయొక్క అశాస్త్రీయమైన నిరూపణయూ, భౌతికవాదం శాస్త్రీయమైన నిరూపణయూ నన్నమాట. ఎలాగ?

ఒక భౌతికవస్తువు ఉండికూడా దానికి భావం లేకపోవచ్చు. ఉదాహరణకు రాయి, లోహములు, భూమి మొదలైనవి. కాని, ఒక భౌతిక పదార్థం లేకుండా భావం ఉండటమనేది అసంగతం. కాబట్టి... ఈ విషయాన్ని నిరూపించుటకు ముందుముందు మనం మరికొన్ని ఆధారాలనుకూడా పరిశీలింప వలసియుంటుంది....

పై విషయాల పరిశీలనను ముగించేముందు మనం మరొక ఉదాహరణను కూడా గమనిద్దాము. మనిషి ఆలోచించటం ఎలా జరుగుతుంది? దీనికి

ఆదర్శవాది సమాధానం "మనిషికి ఆత్మ ఉండబట్టి" అని. ఒక భౌతికవాది సమాధానం "మనిషికి వస్తువును గ్రహించే వేదడు ఉన్నందువల్ల" అని.

ఈ మూటిప్రశ్న కీయబడే ఆయా స... వాన్నిబట్టి – ఆ ఆధారంపై ఆయా వివిధసమస్యల ఆయా వివిధసమా... న్నీ నిర్మాణమౌతుంటాయి. కాబట్టి ఈ మౌలిక ప్రశ్నకు మనమిచ్చే ... సాధానమే మనం భౌతికవాదుల మైనదీ లేక ఆదర్శవాదులమైనదీ ... స్తుంది.



# 3 ఆదర్శ లేక భావవాదం.



1. నైతిక ఆదర్శవాదం; తాత్విక ఆదర్శవాదం
2. బర్క్లీ సిద్ధాంతమును మనమెందుకు చదవాలి?
3. బర్క్లీ అద్వైతంలో యుక్తివాదం.
4. ఆదర్శవాదపు పడికట్లు. "ఆత్మ పదార్థాన్ని కల్పిస్తుంది; మనభావాలే వస్తువులను నిర్మాణంచేస్తవి; ప్రపంచం మనభావానికి వెలుపలలేదు."

భౌతికవాదాన్ని గూర్చి తరుచు ఎలాంటి సందిగ్ధత ఆరోపింపబడుతుందో మనమిదివరకు గమనించాము. అలాగే ఆదర్శవాదాన్ని గురించికూడా సందిగ్ధత ఆరోపితమౌతుంటుంది.

నైతిక ఆదర్శవాదమూ, తాత్విక ఆదర్శవాదమూ ఈ రెండూ విడివిడిగా

గమనింపబడాలి. నైతికంగా ఆదర్శవాదమంటే నీతికి కట్టుబడటమన్న మాట. (హరిశ్చంద్రుడు సత్యమునవలె) ఐతే, ప్రపంచ కార్మికోద్యమ చరిత్రలోను విప్లవవాదులగు మార్క్సిస్టులుకూడా నీతికొరకై (సిద్ధాంతంకొరకు) ప్రాణాలను బలిచేశారు. ఐతే, ఇది తాత్వికదృష్ట్యా ఆదర్శవాదంవల్ల కాదుగదా! కాబట్టి ఇక్కడ నైతికాదర్శవాదం మనకు అప్రస్తుతం.

## (1) తాత్విక ఆదర్శవాదం.

తాత్విక ఆదర్శవాదం భౌతికములను "ఆత్మ" ద్వారా సమన్వయించే సూత్రం. ఈ ఆదర్శవాదంలో తత్వశాస్త్ర మూలసూత్రం "భావం" ప్రాథమికముమనూ ప్రధానమైనదిగా భావింపబడ్తుంది. "యద్భావం తద్భవతి" అంటే భావమే స్థితికి హేతువని, భౌతికములను భావమే పుట్టిస్తుందనీ ఇందులో చెప్పబడ్తుందన్న మాట.

మతాలు సర్వసాధారణంగా ఈ దృష్టితోనే వచ్చాయి. దేవుడు లేక (ఆత్మయొక్క మూలస్వరూపమైన) పరమాత్మయే సృష్టికి కారకుడుగా మతాలలో చెప్పబడ్తుంది.

ఐతే శాస్త్ర విజ్ఞానం పెరిగినకొద్దీ సృష్టిని ప్రపంచాన్ని కేవలం "పరమాత్మ" ద్వారా బోధపరచే ఈ విధానం సరిపోలేదు. ఇతర హేతువాదాలు అవసరమైనవి. 16 వ శతాబ్దంనుండి విజ్ఞానశాస్త్రం దేవుని భూమికను విడిచివేసి, ప్రత్యేకంగా సృష్టిని బోధపరచే విధానాన్ని అవలంబించింది.

ఆ కాలంలో దైవవిశ్వాసం సన్నగిల్లసాగినందున మతాచార్యులకు విధిగా తమ ఆదర్శవాదాన్ని మరికొంత సాగదీయవలసి వచ్చింది. వారు అసలు భౌతికపదార్థాలఉనికినే ఖండించ ప్రారంభించారు. మన శ్రీ శంకరాచార్యుడు ఇంగ్లండులో 18 వ శతాబ్దంలో బర్కిలీ బిషప్పుల అద్వైతిక భావవాదం ఈ ధోరణికి చెందినదే.

## (2) మనం బర్కిలీ భావవాదాన్నెందుకు చదవాలి ?

ఈవాదంయొక్క ప్రాథమికోద్దేశం భౌతికవాదాన్ని నిర్మూలించటమే.

అసలు భౌతిక వస్తువులకు అస్తిత్వమేలేదని బర్క్లీ వాదం... ఈ వాదాన్ని "నిరూపించుటకు" ఎన్నెన్నో సూక్ష్మమైన యుక్తులు ప్రయోగింపబడినవి. కాబట్టి బర్క్లీ విచారధారను తెలిసికొనటం తాత్విక విద్యార్థులకు చాలా అవసరం.

ఈనాడు, ఈ 20 వ శతాబ్దంలో, "భౌతికవస్తువులు" లేనేలేవను బర్క్లీ మిథ్యావాదాన్ని మనం నవ్వుకుంటాము. కాని, ఒకవిషయంమాత్రం గమనింపదగింది. పూర్వకాలపు భౌతికవాదుల్లోకూడ అనేకులు సందిగ్ధమైన వైఖర్లనే ప్రదర్శించారు. ఉదాహరణకు బర్క్లీ విషయంలో 18వ శతాబ్దపు డిడ్రాట్ ఇలా అన్నాడు. "బర్క్లీ సిద్ధాంతం ఎంత హాస్యాస్పదమైనదో, ఎంత అనర్థకమైనదో ఖండించుటకు అంత అసాధ్యమైనది"...

బర్క్లీవాదానికి తత్వశాస్త్రసూచికలు నేడుకూడా అనితర ప్రాధాన్యత నిస్తూనే ఉన్నవి. లెనిన్ తన తత్వశాస్త్ర సమస్యలనే వ్యాసాలలో బర్క్లీవాదానికి ఖండనగా ఎన్నో పుటలు వ్రాశాడు.

## (3) బర్క్లీ ఆదర్శవాదం:-

బర్క్లీ దృక్పథంలో భౌతికవస్తువులకు అస్తిత్వం అసలేలేదు. బర్క్లీ ఇలా అంటాడు. "మన బుద్ధీంద్రియాలకు అతీతములైన భౌతికములు లేవు. మనం చూసినప్పుడే వస్తువు కనపడటం, మనం తాకినప్పుడేకదా తెలియటం.... కాబట్టి మన ఇంద్రియములు పొందుతున్న అనుభూతులవల్లనే బాహ్యప్రపంచం యేర్పడుతుంది. అది ఉంటని మనం అనుకుంటాము...

కాని మన ఇంద్రియానుభూతులు మన బుద్ధీంద్రియానికి (మెదడు) చెందినవి. కాబట్టి ఇంద్రియానుభూతిద్వారా మనం ఉన్నవనుకుంటున్న భౌతికములన్నీ బుద్ధీంద్రియంచేత యేర్పడినవే. అనగా మన భావములే నన్నమాట. కాబట్టి ఇవన్నీ మన బుద్ధీంద్రియానికి అతీతమగు అస్తిత్వాన్ని కల్గిలేవు." ఐతే, ఏమన్నట్లు?... బర్క్లీ దృక్పథంలోను భౌతికములు 'ఉన్నవి'... వాటి ఉనికికి బర్క్లీ మొదటికేమోసం తేలేదుకదా! కాని, బర్క్లీ వాటిని ఇంద్రియాల అనుభూతులద్వారా మాత్రమే ఉన్నట్లు తెలిసికొ

బతుకుతున్నవంటాడు. ఐతే, మన (అనుభూతి) భావాలూ, పదార్థాల అస్తిత్వమూ రెండూ ఒకటేనంటాడు బర్క్లీ. కాబట్టి పదార్థాలు ఉంటాయి కాని వాటిస్థానం మన మెదడేనంటాడు (వెలుపలకాదు.) వెలుపల వాటికి స్వరూపం శూన్యమంటాడు.

మనం కండ్లతో రూపం చూస్తాము. చెవులతో శబ్దం వింటాము. దేహంతో ఆకృతిని తాకుతాము. ముక్కుతో వాసన చూస్తాము. నాలుకతో రుచి చూస్తాము — ఇవన్నీ బుద్ధీంద్రియంద్వారా సమిష్టిగా వ్యవహరించటంవల్ల బాహ్యప్రపంచపు నామ-రూపాలేర్పడుతవి. కాబట్టి ఈ నామ రూప ప్రపంచమంతా మన భావనకు పరంగా (వెలుపల) ఉండియున్నదనుకోవటం 'భ్రమ' లేక 'మిథ్య' మాత్రమే అంటాడు బర్క్లీ.

ఒక యుక్తివాదం చూడండి. మనం ఒకపాత్రలో గోరువెచ్చని నీళ్ళు పోద్దాం. కుడిచేతిని చాలా వేడినీటిలోను, ఎడమచేతిని చాలా చల్లని నీళ్ళలోను ముంచి కొంతసేపు ఉంచుదాం... పిదప ఆ రెండుచేతులూ ఈ గోరువెచ్చ నీళ్ళపాత్రలో ముంచుదాం. అప్పుడు చన్నీళ్ళలో ముంచియున్న చేతికి గోరువెచ్చనీళ్ళు ఎక్కువ వేడిగానూ, వేడినీళ్ళలో ముంచినచేతికి తక్కువవేడిగాను ఉంటవికదా! ఐతే, ఒకేవస్తువు ఒకేసమయంలో రెండువిధాల ఎలా ఉండగలదు? ఇది తర్కశాస్త్రరీత్యా అసంభవంకదా?... కాబట్టి దీనివల్ల తేలేదేమిటి? అసలు గోరువెచ్చనీళ్ళకు మన మెదడుకు వెలుపల ప్రత్యేకమైన అస్తిత్వం లేదనే... కాబట్టి భావాస్తిత్వమే రూఢి. అందుకు పరమైన అస్తిత్వం లేదు— [సరిగ్గా పై ఉదాహరణవంటిదే మన శంకరాచార్యుని రజ్జుసర్ప భ్రాంతి ఉదాహరణకూడా]— బర్క్లీవాదం ఇలాంటి యుక్తులమీద ఆధారపడియుంది. ఈ వాదంతో బర్క్లీ పదార్థాల గుణధర్మాలనన్నీ తారుమారుచేస్తూ వాదిస్తాడు .. మరికొన్ని యుక్తులుచూడండి.

ఒక ఎఱ్ఱనిగుడ్డ ఉందనుకోండి. అది మీకంటికి ఎఱ్ఱగా కనపడ్తుంది. ఒక పచ్చద్దాలు పెట్టుకున్నవానికో? మరోరంగులో కనపడ్తుంది. అలాగే కామిలారోగికికూడా. కాబట్టి గుడ్డయొక్క 'రంగు' ఎక్కడుంది? మన చూపులలోనా లేక మన బుద్ధీంద్రియానికి వెలుపలా?...

మనం ఒక గులకరాయి తేలికగా ఉందనుకుంటాము. అదే ఒక చీమ

పైన పడనీయండి. దాని బరువుకిది వనిపోతుంది. కాబట్టి రాయి తేలిక ఉన్నట్లా? బరువుగా ఉన్నట్లా?

కాబట్టి రంగూ, బరువును గూర్చిన ఎవరి వారి అనుభవం, వారి భావం మాత్రమే. ఒకేవస్తువు ఒకేకాలంలో రెండువిధాల ఉండనికారణాన ఈ వస్తువులూ, వాటినిగూర్చిన భ్రిమలూ అన్నీ బుద్ధీంద్రియం [మెదడు] లో మాత్రమే యేర్పడియున్నవని తేలుంతుంది.

ఈవిధంగా వస్తుధర్మలను ఖండించి బర్క్లీ అసలు భౌతికవస్తువులన్నీ మన మనస్సులో భ్రాంతిరూపకంగా ఉన్న వేనని నిరూపిస్తాడు.

ఇక్కడొకవిషయం గమనింపదగినది. గ్రీకు తాత్త్వికులు బర్క్లీకి పూర్వం కొన్ని గుణధర్మాలు (ఉదాహరణకు రుచి, గంధం, ఉష్ణం మొదలగునవి) మన ఇంద్రియాదులలోను మరికొన్ని గుణధర్మాలు (ఉదాహరణకు బరువు, దార్ఢ్యం, పరిమాణం) వస్తువులలోను నిహితమైయున్నట్లు భావించే వారు. దీన్ని సాగదీసి బర్క్లీ అన్ని నామరూప గుణధర్మాలూ మన "భావం" లో మాత్రమే ఉన్నవని వాదించాడు.

మనకు చంద్రబింబం గుండ్రగాను, చదునుగా, నున్నగా నున్నట్లు కనపడ్తుంది. కాని విజ్ఞానశాస్త్రం దీన్ని మరోవిధంగా చెప్తుంది. చంద్రబింబం చదునుగా లేదు. నున్నగానూ లేదు–కాబట్టి మన చూపుద్వారా చంద్రబింబం విషయంలో యేర్పడిన అపోహలను సరిదిద్దుకుంటాము. కాని, 'రెండువిధాలుగా కనపడే ఒకేవస్తువు' అనే కుతర్కంలో అసలు చంద్రబింబమే లేదని మాత్రం చెప్పము–ఐతే అలా చెప్పటమే బర్క్లీ సాధించిన బ్రహ్మజ్ఞానం!

ఇక్కడ బర్క్లీచేసిన ప్రమాద మేమిటి?—మనం కేవలం పంచేంద్రియాలద్వారా తెలిసికొనువవన్నీ శాస్త్రీయ సత్యములుగా ఉండ నక్కర్లేదన్న విషయాన్ని బర్క్లీ గమనించాడు. ఇంతవరకు బాగానే ఉంది. దీనికి అతివ్యాప్తి (Sophism) దోషం పట్టించి తప్పుడు హేతువాదంద్వారా తప్పుడు నిష్కర్షలు తీశాడు. మన ఇంద్రియాల సామాన్యానుభూతులు తప్పులుగా ఉన్నంతమాత్రంచేత బాహ్యప్రకృతి అసలే లేనిది ఎట్లా ఔతుంది?

## భావవాద తర్కం ఫలితాలు:—

సమస్త చరాచరమూ మన "భావం" లోనే ఉందన్న వాదం అసలు చరాచర ప్రపంచమే మిథ్య అనుటకు దారితీసింది దీనివల్ల "అహం" వాదం తలచూపింది. అంటే ఇంద్రియాదులద్వారా అనుభవించేవాడగు కర్త ఎప్పుడూ ఒక్క 'నేను' మాత్రమేనని తేలింది. ఈ ప్రపంచంలో నేనుతప్ప మిగిలిన వారంతా [వస్తువులతోపాటు] నా భావనవల్ల యేర్పడినవారేకదా కాబట్టి నేనే సర్వస్వం అన్నమాట. [ప్రతి మనిషి అలాగే అనుకోవలసివస్తుంది!] అద్వైతంఅంటే ఇదే దీన్ని ఆంగ్లంలో Solipsism అంటారు. నేను మినహా మిగతాదంతా మిథ్య అనేదే ఈ అద్వైతం.

ఇలా ప్రపంచంలోని భౌతిక వస్తుసముదాయాన్ని వాస్తవం కాదని నిరూపించే ప్రయత్నం తుదకు తానొక్కడుమాత్రమే మిగిలేదశవరకూ దిగజారుతుంది! పోనుపోను ఈవాదం అద్వైతంలో పడకుండా ఉండజాలదు. కాగా తమ భావవాదాన్ని భావవాద తాత్వికులే జీర్ణం చేసికోలేరు. ఆచరణ క్షేత్రంలో ఈ వాదం అడుగడుగునా ఘటాపంచలై పోవలసివస్తుందికదా!

## భావవాద నిరూపణలు:—

మనం బర్క్లీ భావవాద ధోరణిని పైన పరిశీలించాము. ఇది తాత్విక ఆదర్శవాదమన్న మాట. (నైతిక ఆదర్శవాదం కాదు.) కాని సాధారణంగా కొలది "పేర్ల", "పదాల" మార్పులు చేర్పులతో ఈ భావవాదాన్నే మరి కొందరు తాత్వికులు (రామానుజ-మధ్వాచార్యులవలె) మరికొన్ని రూపాలలో మనముందుకు తెస్తుంటారు. మతం, సాంప్రదాయం పేర మనపైరుద్ద ప్రయత్నిస్తుంటారు. కాబట్టి భావవాదపు ఆ నిరూపణలను మనం సూక్ష్మంగా గమనించి అర్థంచేసికోవలసియుంటుంది. అందుకై ఈ క్రింద సంగ్రహంగా ఈ ఆధ్యాత్మిక నిరూపణలను తిరుగ సింహావలోకన చేసుకుందాం.

### (1) ఆత్మ భౌతికములను సృష్టిస్తుంది.

తత్వశాస్త్ర మూలసమస్యకు సమాధానంగా ఆదర్శవాద ఆధారంపైనే దాదాపు అన్నిమతాలూ "ఆత్మ" (లేక పరమాత్మ) చేతనే ఈ భౌతికప్రపంచ

సృష్టి జరిగినట్లు శాసించియున్నవని మనమిదివరకే గమనించాము. ఐతే, ఇక్కడొక తేడాఉంది.

మామూలుగా మతాలు చెప్పేదేమిటి! దేవుడు ప్రపంచాన్ని సృష్టించాడు. ఐతే, ప్రపంచం మన 'భావన'కు అతీతంగాకూడా అస్తిత్వాన్ని కల్గియుంది అని. ఇది సామాన్యమైన మత భావవాదం.

కాని దేవుడు (పరమాత్మ) ఒక మిధ్య లేక మాయను సృష్టించి దాని ద్వారా మన "ఆత్మ"లో భావాన్ని కల్గింపజేసి దానిద్వారా అస్తిత్వంలేని ఈ ప్రపంచానికి భావనాత్మకమైన మిధ్యా అస్తిత్వాన్ని ఆరోపింపజేశాడనే ధోరణిని కల్గినది మన బర్క్లీ లేక శంకరాచార్యుని ఆత్మవాదం.

## (2) అద్వైతవాదం.

మన "ఊహ"లోనే కాని ప్రపంచం విడిగా లేనేలేదని ఆదర్శవాద తాత్వికులు వాదిస్తారు. మనం నామరూపాలులేని ప్రపంచానికి నామరూపాలు "భావం" ద్వారా ఆపాదిస్తామని వాదిస్తారు. ఉదాహరణకు పుస్తకమూ, కలమూ లేవనీ, అవి మన "భావం" వల్ల కల్పింపబడినవేకాని వాస్తవాలు కావనీ, అసలు వాస్తవంలో వస్తువుకు అస్తిత్వమే లేదనీ అంటారు.

## (3) భావాలే భౌతికవస్తువులను కల్పిస్తాయి.

వస్తుసముదాయాల అస్తిత్వభ్రమను కల్పించేది మనభావమేకనుక, మన భావ ప్రతిబింబమే నిజంలో బాహ్య ప్రపంచంకనుక, మన భావమే నామ-రూప గుణధర్మాలను కల్పిస్తుందికనుక, ఈప్రపంచపు వ్యాపకమైన మిధ్యకు కారణం మన భావమేకనుక... ఈ మాయంతా మన భావంవల్లనేకనుక... ఇతరకూ ఏమిటి చెప్పేది?...

మన భావానికి (ఆత్మకు) కూడా తనంతతానే ఈ ప్రపంచ ప్రతిబింబాన్ని ఎలాబడితే అలా మార్చేసే స్వేచ్ఛ (గాడిదను గుఱ్ఱంగాను, గుఱ్ఱాన్ని గాడిదగానూ భావంకూడా మార్చివేయలేదుకదా!) లేదుగనుక, ఈ భావాన్ని (ఆత్మను) మించిన మరొక పరమభావం (పరమాత్మ) లేక దేవుడు ఉన్నాడని

మనం నమ్మాలి! అతడే మన భావాన్ని కల్పిస్తాడనీ, నడిపిస్తాడనీ విశ్వసించాలి. కల్పించి దానికొక రూఢమైన క్రమాన్ని కూడా ప్రచలితం చేస్తాడని అనుకోవాలి. ఈ క్రమానికి మనం బద్ధులమన్నమాట. అంటే ఈ వాదమంతా తుదకు ప్రజలనమ్మకం సడలిపోసాగిన మతాన్ని తిరుగ బలపరచుటకేనన్నమాట.

ప్రపంచసమస్యలకు, సృష్టిసమస్యలకు ఆదర్శవాదమిచ్చే మౌలిక సమాధానం పైవిధంగా ఉంది. ఇక భౌతికవాద తత్వశాస్త్రమిచ్చే సమాధానాలెలాంటివో మనం ముందు ప్రకరణంలో పరిశీలించగలము.



# 4 భౌతికవాదం.

1. మనం భౌతికవాదాన్నెందుకు చదవాలి?

2. భౌతికవాదం ఎక్కడనుండి?

3. భౌతికవాదం ఎందుకూ, ఎలా బలపడ్డది?

4. భౌతికవాదపు పడికట్లు: "వస్తువుభావాన్ని కల్పిస్తుంది... వస్తువు స్థితి మనభావం వెలుపల...ప్రయోగాత్మకమైన విజ్ఞాన శాస్త్రానుభవాలే భౌతికవాదాధారం."

## మనం భౌతికవాదాన్నెందుకు చదవాలి?

స్థితికీ భావానికీగల పరస్పర సంబంధాలేమిటి? అన్న ప్రశ్నకు రెండే సమాధానాలుంటాయని మనకు తెలుసు.

1 గత ప్రకరణంలో ఆదర్శవాదమీ ప్రశ్నకిచ్చే సమాధానాలను మనం

గమనించాము. ఇప్పుడిదే తత్వశాస్త్ర మౌలిక సమస్యకు మనం భౌతికవాదు లిచ్చే సమాధానాలను గమనించగలము. భౌతికవాదమే మార్క్సిజానికి మూలాధారం కాబట్టి దాన్ని మనం మరీ శ్రద్ధతో గమనించే అవసరమున్నది. కాబట్టి మనం భౌతికవాదాన్ని సరిగా పరిశీలించాలి. భౌతికవాదుల దృక్పథాలు విశేష ప్రచారాన్ని కల్గిలేవు. పైగా వివిధ అపోహాలకునూ గురిచేయబడియున్నవి. ఇంతేకాక మన పాఠశాలల్లో, కళాశాలల్లో లేక జీవితం యొక్క భిన్నభిన్నరంగాలలో మనకు భౌతికవాద సూత్రాలను తెలిసికొనే అవకాశంకూడా మృగ్యం. మనం బుద్ధిపూర్వకంగా, ప్రయత్నపూర్వకంగా తెలిసికొనగోరి తెలిసికొంటేనేతప్ప భౌతికవాద పరిచయం కల్గే అవకాశాలు లేవు. అంతేకాక ఇంతవరకు మనకు సమాజంద్వారా తెలియజేయబడినవన్నీ ఆదర్శవాదానికి చెందిన అంశములే. ఈ పరిస్థితిలో భౌతికవాద దృక్పథాన్ని మనం ప్రత్యేక శ్రద్ధతో చదవకతప్పదు—

### భౌతికవాదం ఎక్కడినుండి వచ్చింది?

తత్వశాస్త్ర మూలసూత్ర వివరణ సందర్భంలో మానవ చరిత్రలో "ప్రపంచ సమస్యల" సమాధానాలవిషయంలో రెండు పరస్పర వ్యతిరేక వాదాలున్నట్లు మనం తెలుసుకున్నాము. అందులో ఒకటి అశాస్త్రీయమైనదీ, మరొకటి శాస్త్రీయమైనదని ఇప్పుడు గుర్తుకు తెచ్చుకోవాలి. అశాస్త్రీయ ధోరణి ఆత్మ లేక పరమాత్మ [లేక అప్రాకృతిక (మాయా) శక్తుల, లేక శక్తి] ఆధారంపై వాదించే ఆదర్శవాదులది... కాగా శాస్త్రీయధోరణి వాస్తవం మరియు అనుభవం ఆధారంపైన నిరూపించే భౌతికవాదులది.

అందుకే విశ్వప్రకృతి (Universe) యొక్క శాస్త్రీయమైన నిరూపణయే భౌతికవాద తత్వశాస్త్రమని ఈ పుస్తకం తొలుతనుండీ ప్రత్యేకంగా చెప్పబడుతూ ఉన్నది.

ఆదర్శవాదం సమస్యల అజ్ఞానంనుండి జన్మించింది. ఈ అజ్ఞానం సాంఘికచరిత్రలో ఏవిధంగా ఆదర్శవాద ప్రతినిధులచే స్థిరీకరింపబడినదో, వృద్ధిపరుపబడినదో మనం ముమ్ముందు పరిశీలింపగలము... ఇక, భౌతికవాదం. అది అజ్ఞానంతో విజ్ఞానశాస్త్రపు ఘర్షణద్వారా జన్మించిందని మనం తెలిసికోవాలి.

ఈ తత్వశాస్త్రం తీవ్ర వ్యతిరేకతలకు గురియైనది. గతంలోనే కాదు; నేడు కూడా గతితార్కిక భౌతికవాదం నేటి విద్యా ప్రపంచంచే అపార్థం చేసికోబడుతూ నేఉన్నది. అణచబడుతూ నేఉన్నది. ఈ స్థితిని మనం మరచి పోకూడదు.

## ఎందుకూ ఎలా భౌతికవాదం వికసించింది?

భౌతికవాద వ్యతిరేకులీ సిద్ధాంతానికి గత 20 శతాబ్దాలలో నిర్మాణమే లేదంటారు. కాని భౌతికవాద చరిత్రమాత్రమీ సిద్ధాంతం అన్నికాలాల్లోను సజీవంగా నున్నట్లే నిరూపిస్తుంది.

శతాబ్దాల క్రమంలో మానవ విజ్ఞానచరిత్ర కొనసాగింది. ప్రాచీన గ్రీకు నాగరికత నాటికి మానవ విజ్ఞానం అత్యల్పము — ఆ కాలంలో విజ్ఞానశాస్త్రకారులే తాత్వికులునైయుండిరి. అప్పుడప్పుడే ఉదయిస్తున్న ఆనాటి విజ్ఞాన శాస్త్రమూ, తత్వశాస్త్రమూ అవినాభావము కల్గియుండెను. ఈ విధంగా ఆ కాలంలో తత్వశాస్త్రం విజ్ఞానశాస్త్రాల కూడలిగా నే ప్రచలితమైయుండెను.

ఐతే, విజ్ఞానశాస్త్ర పరిశోధనలు క్రమంగా వికసిస్తూ, ప్రపంచ వస్తు వివేకానికి స్పష్టమైన ఆకృతిని చేకూర్చుటకి వారి పరిశోధనలు ఆదర్శవాద తత్వశాస్త్ర సూత్రాలకు విరుద్ధములుగా పరిణమించసాగినవి. ఈవిధంగా విజ్ఞానశాస్త్రానికీ, తత్వశాస్త్రానికీ ఘర్షణ ప్రారంభమైనది.

విజ్ఞానశాస్త్రానికీ తత్వశాస్త్రానికీ ఇలా అసమన్వయ ధోరణు లేర్పడుటతో తత్వశాస్త్రంనుండి విడివిడి విజ్ఞానశాస్త్రాల ప్రత్యేక స్థాయిని చేకూర్చుకున్నది. విజ్ఞానశాస్త్రజ్ఞులు కేవలం కొన్ని సుదూర విషయాలనుమాత్రమే "తాత్విక లకు" విడిచి మిగిలిన ముఖ్యరంగాల నన్నిటినీ తత్వ శాస్త్ర ప్రతిబంధాలకు అతీతముగ స్వేచ్ఛతో స్వీకరించారు. ఇలా తత్వశాస్త్రమూ విజ్ఞానశాస్త్రమూ పూర్తిగా విడిపడి తత్వశాస్త్రం అశాస్త్రీయమార్గాన పడినది.

ఐతే, విజ్ఞానశాస్త్రాలు వికసించినకొద్దీ వాటితోపాటు భౌతికవాదం కూడా క్రమంగా వికసిస్తూవచ్చినది. ఈవికాసంయొక్క ఆధునికస్వరూపమే మార్క్స్ ఎంగెల్స్‌ల గతితార్కిక భౌతికవాద తత్వశాస్త్ర సమన్వయం.

నాగరికత అభివృద్ధికి చేయిగా సంబంధించియున్న భౌతికవాద చరిత్రను మనం మున్ముందు పరిచయం చేసికోగలము. ఐతే, విజ్ఞాన శాస్త్రమూ భౌతికవాదమూ అన్యోన్య సమన్వయం కలవనీ—భౌతికవాదం విజ్ఞానశాస్త్రాల ఆధారాన్ని ఆశ్రయించియుంటుందనీ మనం గుర్తుంచుకొనటం ముఖ్యము—

## భౌతికవాదుల సిద్ధాంతాలూ, వాదనలూ ఏమిటి ?

ఈ ప్రశ్న సమాధానకొరకు మనం మరొకమారు స్థితికీ భావమునకూగల సంబంధపు మౌలికసమస్యకు రాకతప్పదు. ఈ రెంటిలో ఏది ప్రధానం ?

భౌతికవాదులు వస్తువుయొక్క స్థితి లేక ఉనికి ప్రాథమికమని గుర్తిస్తారు. ఆపిదపనే భావం ప్రసక్తి. ముందు భౌతికవస్తువు ఉనికి—ఆపిదప మన ఇంద్రియాలూ, వస్తువునుగూర్చిన వాటి అనుభూతి. "భూతం" ముందు, దాన్నిగూర్చిన జ్ఞానం లేక భావం ఆపిదప. అంటే, భావం లేక జ్ఞానం భూతాన్ని లేక పదార్థాన్ని ఆశ్రయించియే యుంటుందన్నమాట.

కాబట్టి భౌతికవాదులదృష్ట్యా ఆత్మకాని, భావంకాని, దేవుడు లేక పరమాత్మకానీ ప్రపంచ భౌతికములను సృష్టిచేయదు. ఇక్కడ బాహ్యప్రపంచం లేక ప్రకృతి లేక పదార్థం బుద్ధీంద్రియ వివేకాన్ని లేక జ్ఞానాన్ని సృష్టిస్తుంది.

"పదార్థకోటిలో మానవుని 'బుద్ధీంద్రియం' అత్యున్నత శ్రేణికి చెందినది" అని ఎంగెల్స్...ఐతే, మనిషి ఆలోచించటం, విజ్ఞానాన్ని పొందటం ఏమూలకంగా ? అన్న ప్రశ్న వేసినప్పుడు, భౌతికవాదం "దేవుని" చమత్కారమూలకంగా నని అంగీకరించదు. మానవునకు మెదడున్నది. ఆ మెదడునుండి ఆలోచన ఏర్పడుతుంది అని భౌతికవాది సమాధానమిస్తాడు.

అందువల్ల భౌతికవాదులకు పదార్థం, దానిస్థితి అనునవి వాస్తవములు. [మిధ్యలుకావు.] వాటి అస్తిత్వంకొరకు భావం లేక జ్ఞానంయొక్క ఆరోపణ అవసరంలేదు. పదార్థం లేనిచో దానినిగూర్చిన జ్ఞానం ఉండదు. కాబట్టి పదార్థం ప్రధానం. ఇంతేకాదు మన శరీరానికి అతీతంగా మనలో ఉంటుందని చెప్పబడే జననమరణరహితమైన ఆత్మకూడా ఉండదు. [దానికి ప్రమాణం వృధ్యం.]

మన మెదడులో ఉండే భావాలే వెలుపలివస్తువులుగా ఆభాసిస్తున్నా యనే వాదాన్ని భౌతికవాదులు "తలక్రిందుల సత్యం" గా భావిస్తారు.

ఐతే, స్థితి, జ్ఞానం వీటి సంబంధాన్ని గూర్చిన [" ఈ ప్రపంచంలోగల వస్తుకోటినిగురించిన మనవివేకం ఆవస్తువుల స్థితికి సమన్వయించియుంటుందా ?" లేక " ప్రపంచంలోని వస్తుకోటినిగూర్చిన మన విజ్ఞానం వాని వాస్తవిక ప్రతిబింబంగా ఉంటుందా? లేక వస్తువునుగూర్చిన మన భావం వస్తుస్వరూపానికి సరిపోతుందా ? అను సారూప్య సిద్ధాంత ప్రశ్నకు " ] భౌతికవాదిచెప్పే సమాధాన మేమిటి ?...

ఈ ప్రశ్నకు భౌతికవాది సమాధానం ఇది. " ఔను. ప్రపంచాన్ని తెలుసుకోవచ్చు. విజ్ఞానశాస్త్రాలు వికసిస్తున్న కొద్దీ వాటి సహాయంతో మానవుడు తన ప్రపంచ వస్తు వివేకాన్ని పెంపొందింపజేసుకుంటాడు. విజ్ఞాన శాస్త్రాలు ప్రపంచ వస్తువుల స్థితిగతులను పరిశీలిస్తూ, అవి 'మన' చైతన్యంతో సంబంధం లేనట్టి స్వతంత్రమైన అస్తిత్వమును కలిగియున్నవని నిరూపిస్తాయి. మానవుడు వాటి వాస్తవిక స్థితిని ఇదివరకే కొంతవరకు తనభావంలో ఇమిడ్చుకొనగల్గుతున్నాడు. " అని.

ఇక, తత్వశాస్త్ర మౌలికసమస్యనుగూర్చి భౌతికవాదుల వివేచనను మనమీ దిగువ సింహావలోకన చేద్దాము—

1. పదార్థమే భావాన్ని కల్పిస్తుంది. "యద్భూతం తద్భావం" పదార్థం లేకుండా భావం లేదు—

2. భూతం (పదార్థం) భావానికి అతీతమైన స్థితిని లేక ఉనికిని కలిగియుంది. అది భావంలోఉండి బయటఉన్నట్లుగా కన్పిస్తుందనే మిథ్యావాదం నిరాధారం. భావ ప్రతిబింబమే పదార్థంగాక భూత ప్రతిబింబమే భావం.

3. మనం ప్రపంచాన్ని తెలిసికొనగలము. విజ్ఞానశాస్త్ర వికాసంతోబాటు మన ప్రపంచ జ్ఞానం తననుతాను సరిదిద్దుకొనుచు సమగ్రవస్తు వివేకాన్నేర్పరుస్తుంది. నేటి ప్రపంచ స్థితిలో మనకు తెలిసినవీ, మనచే తెలిసికోబడవలసి యున్నవీ ఏవోనను చైతన్యం మనకు లేకపోలేదు—కాబట్టి మనం క్రమక్రమంగా ప్రపంచ వస్తువివేకాన్ని సాధించగలము. వ్యావహారిక సత్యాన్ని వాస్తవికసత్యంగా పరిణమింపజేయుచు ముందంజ వేయగలము—

# ఏది సరియైనది?
# ఆదర్శవాదమా? భౌతికవాదమా?

## సమస్యను ఎలా ఆవిష్కరించాలి?

ఇప్పుడు మనకు ఆదర్శవాదుల సిద్ధాంతాలూ, భౌతికవాదుల సిద్ధాంతాలూ తెలుసు. కాబట్టి ఈ రెంటిలో ఏది సరియైనదో మనమిప్పుడు తెలిసికోవాలి. ఈ రెండు సిద్ధాంతాలు ఒకటికొకటి పూర్తిగా వ్యతిరేకమైనవి— ఈ రెంటిలో ఏదో ఒకటిమాత్రమే సరియైనది. ఐతే, యేది సరియైన నిష్కర్షలుచేసి, సరియైన ఫలితాలను, సాదృశ్యాలను చూపగల్గుతుందో అదే నిర్దుష్టమైనదిగా నిల్వగల్గుతుంది.

పైన మనం తెలిసికొన్న ప్రధానాంశాల నిక్కడ మరొకమారు గమనిస్తూ పోల్చిచూడాలి.

## ఆదర్శవాది సిద్ధాంతం.—

1. భావంలోనే ప్రపంచం ఏర్పడియుంది.

2. మన భావానికి అతీతంగా వస్తువుకు అస్తిత్వం లేదు. అట్టి అస్తిత్వం లేక ఉనికి మిథ్య.

3. మన భావాలే పదార్థాలను కల్పిస్తున్నవి. అని.

భౌతికవాది వీటన్నిటినీ "తల్లక్రిందు సత్యాలుగా" భావిస్తాడు.

పై సిద్ధాంతాలనిక మనం సామాన్యబుద్ధితో పరిశీలించి చూద్దాము. సామాన్యబుద్ధికి సమన్వయించేదేది? విపరీతంగా తోచేదేదో చూచుకుందాము.

1. ప్రపంచ భౌతికములు నిజంగా మనభావం (మెదడు) లోనే ఉన్నవా?

2. మన భావాలవల్లే నిజంగా పదార్థాల సృష్టి జరుగుతున్నదా?

3. నిజంలో మన మనస్సే పదార్థాన్ని సృష్టిస్తున్నదా?

ఈ ప్రశ్నలు తత్వశాస్త్ర మౌలికసూత్రానికి చెందినవగుటచేత చాలా ముఖ్యమైనవి. ఈ ప్రశ్నలను ఖండించుటలో అందరు భౌతికవాదులూ ఏక గ్రీవాభిప్రాయాన్ని కల్గియుంటారు. ఇక వారి పూర్వపక్ష వాదనలను మనం తెలుసుకుందాం.

## ప్రపంచం మన భావంలోనే యేర్పడియుందా?

ఈ సమస్యను పరిశీలించేముందు మనం రెండు తాత్విక 'పదాల' ను గమనించవలసియుంటుంది. ఈ పదాలు తరచు వాడబడుతుంటవి.

వ్యావహారిక సత్యం [అంటే మన ఆలోచనాపథంలో ఉండు అస్తిత్వం].

వాస్తవిక సత్యం [అంటే మన ఆలోచనకు అతీతమగు అస్తిత్వం]. ఆదర్శవాదులీ ప్రపంచాన్ని వ్యావహారికసత్యంగా భావిస్తారు. భౌతికవాదులు ప్రపంచాన్ని వాస్తవికసత్యమని చెప్తారు.

(ఆదర్శవాదులు ఈ ప్రపంచాన్ని 'పంచేంద్రియ' జ్ఞానమూలకమైనదనీ, మిథ్యయనీ బర్కిలీ యుక్తులసాయంతో వాదిస్తారు. వస్తువుయొక్క స్థితిని మిథ్య లేక భ్రాంతిగా నిరూపిస్తారు. అందువల్ల నామరూపాత్మకమైన ఈ ప్రపంచం వారి దృష్టిలో వ్యవహారికసత్యం లేక కల్పితసత్యం మాత్రమే. అంటే అది వాస్తవికంగా సత్యం కాదన్నమాట.)

(కాని భౌతికవాదికి మూలం వస్తువుయొక్క స్థితి. వస్తువుమూలంగానే భావమేర్పడుతుందని ఇతని వాదం. కాబట్టి ప్రపంచాన్ని భౌతికవాదులు వాస్తవికమైన సత్యం అంటే వస్తుమూలకమైన సత్యమని విశ్వసిస్తారు. అథవా

మన వస్తు వివేకం అసమగ్రమైనా, తప్పైనా అది భావంలోని దోషమే కాని వస్తువులోని మిథ్యాత్వం కాదని వాదిస్తారు. అంటే ప్రపంచం ఉట్టి వ్యవహార సత్యం కాక వాస్తవిక సత్యమన్నమాట )

వస్తువుల వ్యావహారిక వాస్తవికతను నిరూపించుటకు బర్క్లీ వాటిని నామరూప గుణధర్మాత్మకములుగా నిర్ధరించాడు. ఈ నామరూప గుణ ధర్మానుభూతి ఒక్కొక్క మనిషికి (కర్తకు) వేరువేరుగా ఉంటుందనీ, అది భౌతిక పదార్థాత్మకమైనది కాదనీ వాదించాడు. కాబట్టి ఈ చరాచర ప్రపంచమంతా వ్యావహారిక వాస్తవమనీ, వాస్తవికసత్యం కాదనీ నిర్ధరించాడు.

మనకు చంద్రగోళం నున్నని, తెల్లని పళ్ళెంవలె కనపడుతుంది. అది నిజంగా నున్నని, తెల్లని పళ్ళెంవలె లేదు. కాబట్టి చంద్రగోళపు అస్తిత్వం వాస్తవికసత్యం కాదు. వ్యావహారికవాస్తవం లేక మిథ్య అంటాడు. అంటే అది మన భావంలోనే అస్తిత్వాన్ని కల్గియున్నదని వాదిస్తాడు.

భౌతికవాదులు చంద్రబింబపు అస్తిత్వాన్ని అంగీకరిస్తారు.

ఐతే అది నున్నగా తెల్లగా పళ్ళెంవలె కన్పిస్తున్నందువల్ల కాదు. ఎందుకంటే దాని తెలుపు నునుపు చదును అసమగ్రమైన వాస్తవికత; అదిమమానవులూ పసిపిల్లలూ కేవలం తమచూపుపై ఆధారపడి నమ్మే వాస్తవికతమాత్రమే. కావున చంద్రబింబపు వాస్తవికతను నిర్ధరించుటకు భౌతికవాదులు విజ్ఞానశాస్త్రాధారాల సహాయం తీసికొంటారు. విజ్ఞానశాస్త్రం మన బాహ్యేంద్రియానుభూతుల అపరిపుష్టతను సరిదిద్దుతుందని నమ్ముతారు.

ఐతే ఆదర్శవాదులు చెప్పినట్లుగా చంద్రబింబం నున్నగా తెల్లగా పళ్ళెంవలె చదునుగా లేనిమాటను భౌతికవాదులు అంగీకరిస్తారు. కాని దాని వల్ల తీయబడ్డ " కాబట్టి చంద్రబింబపు అస్తిత్వం మన మెదడులోనే ఉందన్న " నిష్కర్షను ఖండిస్తారు. చంద్రబింబానికి మన 'భావం' తో సంబంధంలేని ప్రత్యేకమైన అస్తిత్వముందని గుర్తిస్తారు. చంద్రబింబం వాస్తవికసత్యం కాక కాదని అంగీకరించరు.

ఇక్కడ మన పక్తవ్యాంశం వస్తువుల గుణధర్మాలుకాదు; 'పదార్థాల' అస్తిత్వం. ఇక్కడ మన ఇంద్రియానుభూతి అపరిపుష్టత చర్చనీయాంశం కాదు. ఇక్కడ మన సమస్య అసలు పదార్థముల 'అస్తిత్వానికి' సంబంధించినదికదా !

కాబట్టి భౌతికవాదులు మన 'జ్ఞానం లేక భావపు' ఆధారానికి, అతీతంగా పదార్థపు అస్తిత్వాన్ని గుర్తిస్తూ, ఆ నిరూపణకు విజ్ఞానశాస్త్రంపై ఆధారపడుతారు.

భావవాదులు తమ సిద్ధాంతాన్ని వాస్తవమని ఎలా నిరూపిస్తారు? దీర్ఘోపన్యాసాలతో, పచాల తర్కవితర్కాలతో, సుదీర్ఘ వ్యాసాలతో, ఆడంబరాలతో, యుక్తులతో...

కొంతసేపు వారివాదం నిజమే అనుకుందాం. ఒకవేళ ప్రపంచం 'మానవ' భావనలోనే ఉండేటట్లయితే మానవసృష్టికి పూర్వం అదిలేదా? ప్రపంచ పరిణామంలో మానవసృష్టి ఇటీవలిదశలోనే జరిగిందని విజ్ఞానశాస్త్రం నిరూపిస్తున్నది. అంటే, దీనికి ఆదర్శవాదులు 'మానవసృష్టికి పూర్వం జంతువులు జీవించేవికదా! వాటికిమాత్రం భావం లేదా? ఆ భావంలోనే ప్రపంచం ఉండేద'ని సమాధానమీయవచ్చు. ఐతే, అంతకంటే పూర్వపు ఒకానొక పరిణామదశలో జంతువులేకాక, చెట్లు-చేమలు మొదలగు జీవకోటికి దేనికీ వాసయోగ్యంకాని స్థితిలో ఈ ప్రపంచం ఉండియుండేనని విజ్ఞానశాస్త్రం చెప్తుందే? దీనికి ఆదర్శవాదులేమంటారు?

"అసలీ ప్రపంచమింకా యేర్పడని ఖగోళదశలోకూడా భావం లేకపోలేదు. అది పరమాత్మలో ఉండేది" అని. అంటే, ఈ సమాధానంతో విజ్ఞానశాస్త్రాధారాన్ని దిగవిడిచివారు మతం, లేక అశాస్త్రీయ విశ్వాస మార్గాన్ని చేపట్టున్నారన్నమాట. దేవునికీ విజ్ఞానశాస్త్రానికీ (ఒకటి విశ్వాసం మరొకటి వాస్తవంకాబట్టి) అసలే పొసగదు. కాబట్టి ఈ రెండూ ఎలాగూ విడిపోక తప్పదు. ఐతే, ఆదర్శవాదంలో తుదిశరణ్యాం; దేవుడును ఆ దేవునికి తిరిగి శరణ్యం ఆదర్శవాదముగా, ఈ రెండూ విడదీయరాని లంకెను కలిగి యుంటాయన్నమాట.

ఐతే, ఇక్కడ మనముందుకు ప్రశ్న ఎలా వస్తుంది? మనం దేవుని ఆధారాన్ని నమ్ముతామా? లేక విజ్ఞానశాస్త్రాన్ని నమ్ముతున్నామా? ఈ రెంటిలో ఏది సరియైనది? అంటూ...

దేవుడు లేక పరమాత్మ లేక సృష్టికర్త అనేది ఆధ్యాత్మికం. అది నిరూపింప వీలులేని నమ్మకముమాత్రమే... అంటే గ్రుడ్డినమ్మకం! అలాకాక విజ్ఞానశాస్త్రం మనకు అనుభవంద్వారా, ఆచరణద్వారా ఈ ప్రపంచ మొక వాస్తవికసత్యమని చెప్తుంది. అలా చెప్పటకు ప్రత్యక్షాధారాలను మనముం దుంచుతుంది....

## మన భావాలే వస్తువులను సృష్టిస్తవనుట నిజమా!

శంకరాచార్యుని "గజం మిథ్య పలాయనం మిథ్య" అను హాస్యకథను మీరు వినియేయుంటారు.

ఒకప్పుడు శంకరాచార్యులు ఈ జగమంతా మిథ్య, మాయ అని ఉపన్య సించారట! ఉపన్యాసం ముగించి వారు తమ బసకు వెళ్ళుతున్నారు. ఇంత లో ఒక మదించిన ఏనుగు వీధిలో వారికి ఎదురుపడింది. వారు భయంతో వెనుదిరిగి పరుగెత్తసాగారు. ఏనుగుకూడా వారివెనుకనే పరుగెత్తసాగింది— పరుగెత్తీ పరుగెత్తీ తుదకెట్లాగో ఆచార్యులు తప్పుకున్నారు.—అప్పుడొక శిష్యుడు అడిగాడట. "ఏమండీ ఏనుగు తమపైకి పరుగెత్తిరావటం మిథ్యేకదా! ఐతే తామెందుకు భయపడిపోయారండీ?" అని...దానికి ఆచార్యులవారే మన్నారు? "అబ్బే! నేనెందుకు పారిపోయానూ? అదికూడా మిథ్యేకదా? కాబట్టి, నేను ఎక్కడున్నానో అక్కడే ఉన్నాను" అని.

పై ఉదాహరణవల్ల తేలేదేమిటి? ఉపన్యాసాల్లో ఎంత ఆత్మజ్ఞానా న్ని కనపరచినా, మన భావవాద తాత్వికులు తమ ఆ ఆత్మజ్ఞానాన్ని వాస్తవిక జీవితంలో అమలుకుమాత్రం తేలేరనేదే. పై కథలో తీరా ఏనుగు ఎదుట పడ్డ ప్పుడు ఇది మిథ్యాగజమేకాని, వాస్తవికసత్యమైన ఏనుగు కాదేఅన్న ఆత్మ జ్ఞానం ఎటుపోయింది? ఐతే, మాటల్లో భావవాదులగు తాత్వికులంతా చేత లలోమాత్రం భౌతికవాదులుగానే ఉండక తప్పదుకదా!

ఈ వాస్తవిక ప్రపంచాన్ని కేవలం వ్యావహారిక సత్యం లేక మిథ్యగా నిరూపించుటకు మన భావవాద ఆచార్యులూ, వారి శిష్యులూ ఆచరణలో వాస్తవంగా అతి నీచమైనచర్యలు జరుపుటకుకూడా వెనుదీయరని చరిత్ర ఎన్నో నిదర్శనాలను కల్గియున్నది. ఆదర్శవాదుల ఆచరణభాగం ఇంత బల హీనమైనది!... నిరాధారమైనది.

అంతా మిథ్యఅనే ఆదర్శవాదం ఆచరణతో అసలే సంబంధమైనది కాకపోగా—జీవితరంగంలో "అన్యాయాలనూ, అక్రమాలనూ" అవలంబించుటకు బాహాటంగా దారితీస్తుంది. మనిషి చేసే తప్పులు అసలు వాస్తవాలే కావనీ—కాగా ఆ తప్పులకు పరమాత్మ లేక దైవ ప్రేరణకూడా ఉందనే, సమర్థనవాదానికి అవకాశమేర్పరుస్తుంది....

ఇలా విజ్ఞానశాస్త్రధారానికీ, ఆచరణీయతకూ రెంటికినీ భావవాదం, లేక ఆత్మవాదం సరిపడని ధోరణిని కల్గియున్నది.

ఆదర్శవాద సిద్ధాంతాల విచారధార ఒకవంక; ఆచరణ మరోవంక పరస్పర వ్యతిరేకమై యున్నందువల్ల భావవాదులు సిద్ధాంతాన్నీ, ఆచరణనూ విడదీసి వాదిస్తుంటారు. ఈ రెండూ విడివిడి విషయాలని చెప్తుంటారు. ఇది విపరీతం. కాని, నిజంలో ఆచరణయే అనుభవంద్వారా సత్యాసత్యాల నిరూపణకు సరియైన గీటురాయిగా నిలుస్తుంది. ఆచరణద్వారానే నిజానిజాలు ప్రకటమౌతవి.

మనం "గజం మిథ్య పలాయనం మిథ్య" కథద్వారా భావవాదంలోని జగన్మిధ్యా సిద్ధాంతానికి ఆచరణ సమన్వయం లేదని తెలుసుకున్నాము. ప్రపంచ పరిణామక్రమ పరిశీలనద్వారా మానవుని భావం లేక జ్ఞానమే ఈ ప్రపంచంగా ప్రతిబింబిస్తుందనే భ్రమను ఖండించాము. ఆచరణా, విజ్ఞాన శాస్త్రమూ భావవాదాన్ని పూర్తిగా బట్టబయలు చేసినవి....

## జ్ఞానమే వస్తువును ఉత్పత్తి చేస్తుందా ?

"జ్ఞానం" అనే పదానికి ఆదర్శవాదం చెప్పేపరమార్థం "దేవుడనేది." సృష్టిసమస్య వచ్చినప్పుడు ఆదర్శవాదులు తమ భావానికి 'పరమాత్ముని' తుది

ఆధారంగా నిల్పుతుంటారు. ఐతే, ఆదర్శవాదం ఇక్కడే విజ్ఞానశాస్త్రం భూమికనుండి దిగజారుతుంది. కాబట్టి దేవుడునిజమా ? లేక విజ్ఞానశాస్త్రమా ? అన్న ప్రశ్నరూపంలో సమస్య శేషిస్తుంది.

ఆదర్శవాదులు దేవుణ్ణి లేక పరమాత్మను అనాద్యంతముగా నిరాకార నిర్వికారముగా నిర్వచిస్తారు. అంటే పరమాత్మ లేక దేవుడి నొక పదార్థంవలె సాకారంగా స్థలానికి కాని, పరిణామశీలమైనదిగా కాలానికి కాని కట్టుబడని రీతిగా నిర్వచిస్తారు. అనగా ఆధ్యాత్మికపంథా నవలంబిస్తారన్నమాట.

ఈ ఆధ్యాత్మికపంథా " విశ్వాసం " లేక " నమ్మకం " పైన ఆధార పడుతుందేకాని, దీనికి ఋజువులు లేక ప్రమాణాలతో సంబంధంలేదు. పర మాత్మ ఉన్నదని వాదింపుటకు ప్రమాణాలు లేవు. కాబట్టి మనకు బోధపడని ఆధ్యాత్మికములు లేక విచిత్రశక్తుల (దేవతలూ దయ్యాలూ మంత్రములూ మహి మల) ద్వారా భావవాదులు దేవుడున్నాడని నమ్మించ ప్రయత్నిస్తారు. విజ్ఞాన శాస్త్రం ఈ పంథా నెంతమాత్రం అంగీకరించదు.

భావవాదుల సృష్టికర్తయగు " పరమాత్మ " గ్రుడ్డినమ్మకంపై ఆధార పడువదేకాని " నిరూపణ " కు నిల్చువదికాదు. ఆదిమమానవునినుండి నేటి 20 వ శతాబ్దంవరకూ " దైవం " అంధవిశ్వాసంపైనమాత్రమే ఆధారపడి–మానవకల్పితమై—చలామణీ యౌతూఉన్నది.

భౌతికపదార్థము ఆదినుండీ అస్తిత్వమును కల్గియున్నదని భావవాదులు అంగీకరించరు. ఐతే, ఈ భౌతికపదార్థ మూలమునకు సృష్టికర్తయైన తమ పర మాత్మమాత్రం " అనాద్యంత " మంటారు. దేవునికి పుట్టుకలేదు—లేక ఆది నుండీ అస్తిత్వ మున్నదన్నమాట. ఆత్మవాదులు ఇలా వాదిస్తుంటారు.

తమవాదానికి ఉపయోగపడువరకూ విజ్ఞానశాస్త్రాన్ని ఆదర్శవాదులు బాహాటంగా వాడుకుంటారు. తీరా తమమతాలకు వ్యతిరేకఫలితా లేర్పడు సమయంలో దానికి తిలోదకాలిచ్చి దేవుని ముసుగులో ఒదిగిపోతారు.

విజ్ఞానశాస్త్రం " మనస్సు " చేత " పదార్థం " సృష్టింపబడుతుందని అంగీకరించదు. కేవలం మనస్సు సృష్టిచేస్తుందనేది మన అనుభవానికి అతీత మైనది—అసలు పదార్థసృష్టికిముందు మనస్సు లేక ఆత్మ తానుగా, విడిగా

ఉండగల్గటమనే భావమే అశాస్త్రీయమైనది. మన మనస్సు ఎల్లప్పుడూ పదార్థ మూలకమైనదే. [పదార్థం లేనిది మన మెదడు లేదు, ఇంద్రియాలూ లేవు, వాటి అనుభూతీ లేదు]... కాబట్టి 'శూన్యం' లో "భావం" లేక "జ్ఞానం" ఉంటుందని శాస్త్రం అంగీకరించదు.

ఒకవేళ పరమాత్మ సృష్టికిపూర్వం ఉండియున్నా అతనికి మనస్సు 'బుద్ధీంద్రియం' లేక మెదడు ఉంటేనేకాని సృష్టి కొనసాగించటం సాధ్యం కాదు. [నిరాకారంనుండి సాకారం సృష్టి కావటం శాస్త్రవిరుద్ధము.] కాబట్టి ఈ విశ్వాసం నిరాధారమైనది.

ముమ్ముందు దేవుని మనం విశ్వసింపవచ్చునా అను సమస్యకు విజ్ఞానశాస్త్ర మిచ్చే సమాధానాలను చర్చింపగలము. స్థలమునకూ కాలమునకూ అతీతమైన [అనగా పదార్థంకాని, మార్పులేని, నిరాకార, నిర్వికల్పమైన] దేవుడు కాని, మరొకటి కాని ఉంటుందా పరిశీలింపగలము.

## భౌతికవాదులు చెప్పేది నిజం.

భౌతికవాదుల నిరూపణలు శాస్త్ర ప్రమాణాల ఆధారాన్ని కల్గి యున్నవి—వారి ఈ క్రింది నిరూపణలు నికరమైనవి.

బర్క్లీ లేక అతని అనుయాయులు చెప్పునట్లు ఈ సృష్టి లేక పదార్థం మన "భావం" లేక జ్ఞానం లోపలనుండక వెలుపల వాస్తవికస్థితిని కలిగి యున్నది. మన భావంపై పదార్థపు స్థితి ఆధారపడి యుండదు. పదార్థపు స్థితిపైన మన భావం ఆధారపడి యుంటుంది.

"భావంవల్ల స్థితి యేర్పడదు." అనగా ఈ ప్రపంచం దేవునివల్ల సృష్టింపబడలేదని చెప్పటమే. కాగా దేవుని స్థితి—భావవాదులచే సృష్టింపచేయ బడినదే కదా! పదార్థం భావాన్ని యేర్పరుస్తుంది. పదార్థంయొక్క సృష్టికి దేవుని అగత్యంలేదు—కాబట్టి ప్రపంచం వాస్తవికరూపక సత్యము. వ్యావహారికసత్యమను వాదన ఒక గొప్ప భ్రాంతిమాత్రమే !...



# 5 తత్వశాస్త్ర మధ్యేమార్గం: అజ్ఞేయవాదం

1. అజ్ఞేయవాదం ఎందుకు ?
2. అజ్ఞేయవాదపు వాదనలు...
3. మూడవమార్గం ఎక్కడనుండి ?
4. దాని ఫలితాలు...
5. ఎలా ఖండించాలి ?

## మధ్యేమార్గ మెందుకు ?...

పై నాల్గు ప్రకరణాలలో మనం తత్వశాస్త్ర మౌలికసమస్యను పరిశీలించినసందర్భంలో రెండుమార్గాలను కనుగొన్నాము. 1. ఆదర్శవాదం, 2. భౌతికవాదం. ఈ రెంటిలో భౌతికవాద విచారధార క్రమమైనదని మనం గమనించాము. ఆమార్గంద్వారా భౌతికవాదాన్ని వివేచనాయుతంగా నిర్మాణం చేసుకొనినాము. కాని విషయాలంత తేలికగా ఉండవు. ఇప్పుడు మన ముందుకు మూడోమార్గం కొనిరాబడ్తుంది.

ఒకనాడు బర్క్లీ [శంకరాదుల] కున్న ధైర్యం ఈ నాటి ఆదర్శవాదులలో లేదు. కాబట్టి వీరు మరొక మధ్యేమార్గంలో (మరికొన్ని యుక్తులూ, పదాల వాదాలలో ఆడంబరంలో) మనను దించ ప్రయత్నిస్తారు. 1710 వరకు బర్క్లీమార్గమో లేక భౌతికవాదమో రెంటిలో ఏదో ఒకటే నికరమైనదిగా తేలిపోవలసియుండెను. కాని విజ్ఞానశాస్త్రం మరికొంత వికసించేసరికి ఈ రెండుమార్గాలమధ్యన తికమకపడి ఒక మధ్యేమార్గాన్ని త్రొక్కవలసిన అవసరం కొందరు మితవాద తార్కికులకు అనివార్యమైనది.

## మధ్యేమార్గ మేమిటి?

బర్క్లీ నిరూపించినట్లు మన అనుభూతులు సరియైనవిగా ఉందని భ్రాంతులేకనుక, మన వస్తువివేకం నామ-రూపాలదశవరకే సీమితంకనుక, అది సరియైన వస్తువివేకం కాజాలదనీ, అసలు మనకు 'పదార్థపు' అసలుస్వరూపం తెలియబడదనీ, సిద్ధాంతీకరించటమే అజ్ఞేయవాదమనబడు ఈ మధ్యేమార్గం.

అంటే మనకు వస్తువుముందా, లేక జ్ఞానముందా అనేది తెలియబడదు. అట్లాగే వస్తుస్వరూపం విషయంలోను, నామ-రూపాల గుణధర్మాల వరకే మనకు తెలుసుకాని, దాని 'అసలు' సత్యరూపం తెలియదుకదా ? అని. అంటే వాస్తవికసత్యం అజ్ఞేయమన్నమాట

ఉదాహరణకు మనం మరొకమారు చంద్రబింబాన్ని తీసికొందాం. అది ఆదిమమానవులు భావించినట్లు పళ్ళెంవలె లేదని మనం గుర్తించాము. కాబట్టి పళ్ళెంవలె కన్పించటం భ్రాంతి. [స్వరూప జ్ఞానం పైపై భావమే కాని అసలు సత్యంకాదు.] కాబట్టి చంద్రబింబం అసలు మన భావ ప్రతిబింబమగు మిథ్యా ? లేక ఉన్నదున్నట్లు మనచే తెలిసికోబడగలదా ? అన్న మీమాంస తాత్వికులలో కలిగినది. దీనికి అజ్ఞేయవాదులు మనం చంద్రబింబాన్ని స్వరూపజ్ఞానంద్వారా తెలిసికొంటాము. అంతకుమిక్కిలి దాని అసలు రూపం అజ్ఞేయం అంటారు...

మనం వస్తువుకు మనఇంద్రియాల మధ్యమంద్వారా చూస్తాము. కాబట్టి మన దృష్టితో ఎలా కనపడితే అలా జ్ఞానరూపకంగా అర్థం చేసికొంటాము. అంతేకాని, చంద్రబింబాన్ని అజ్ఞేయదృష్టితో లేక మూల భూతపదార్థ స్థితిలో తెలిసికోలేము. కాబట్టి సత్యం అజ్ఞేయమైనదని వాదిస్తారు.

ఒక భావవాదీ, ఒక భౌతికవాదీ రెండురంగుల కండ్లద్దాలతో గోడను చూస్తున్నారు. ఆ అద్దాలను వారు తీయలేనిపక్షంలో గోడరంగు వారిరువురికీ భ్రాంతిమాత్రంగానే కనపడ్తుంది. గోడయొక్క అసలురంగు ఉభయులకూ తెలియదు. అట్లాగే ఆదర్శవాదులూ, భౌతికవాదులూ తమతమ 'అద్దాల ద్వారా' మాత్రమే చూస్తున్నారు. వారికి అసలు వస్తుస్వరూపం గోచరించనే గోచరించదు అని అజ్ఞేయవాదులు తమ నిరూపణను సాగిస్తారు.

## ఈవాదం యెక్కడినుంచి పుట్టింది ?

1776 లో హ్యూం అను ఆంగ్లతాత్వికుడూ కేంట్ అను జర్మన్ తాత్వికుడూ అజ్ఞేయవాదాన్ని ప్రారంభించారు. వీరిరువురూ భౌతికవాదాన్నీ, ఆదర్శవాదాన్నీ సమన్వయింప ప్రయత్నించినవారే.

"ఒకచెట్టు ఉందనుకోండి. అది దూరంనించి చిన్నదిగా కన్పిస్తుంది. దగ్గరనించి పెద్దగా కన్పిస్తుంది. ఈ మార్పు మన చూపులోనిదేకాని చెట్టు లోనిది కాదుగదా ! కాబట్టి చూపుయొక్క 'భ్రమ' కు అతీతంగాను వస్తువుకు "స్థితి" లేక 'ఉనికి' యుంది." అంటూ హ్యూం వస్తువుయొక్క వాస్తవిక స్థితిని అంగీకరిస్తాడు. కాని వెంటనే ఆ 'స్థితి' లేక 'ఉనికి' వాస్తవికసత్యం కాదని చెప్తాడు. ఎందుకంటే చెట్టుయొక్క "స్థితి" ని చూచేది మన ఇంద్రియానుభూతులు. కాబట్టి అది మనకు కనబడుతున్నట్లుగా ఉండదు. ఇంద్రియానుభూతులకు పదార్థంయొక్క వాస్తవికసత్య వివేకం ఉండదని నిర్ధరిస్తాడు. అంటే భౌతికములకూ భావానికీ, లేక భూతానికీ జ్ఞానానికీ గల సంబంధాన్ని నిరాకరిస్తాడన్నమాట.

మనం సినిమా తెరమీద వస్తువుల ప్రతిబింబాలను-వాటి స్థితిని-చూస్తాము. నిజానికి తెరవెనుక ఏమీలేదు. అలాగే మన వస్తువివేకం. ఐతే మన మనస్సు [మెదడు] లో ఈ వస్తువివేకం ఎలా కల్గుతున్నది ? అది అజ్ఞేయం. అందుకు ఏదో తెలియబడని ఆధ్యాత్మికశక్తి పనిచేస్తున్నది— లేక మరేకారణమైనా కావచ్చు. అది మనకు ఎలాగూ తెలియబడనిది. ఇదీ, హ్యూం వాద ధోరణి.

## దీని ఫలితాలు:—

ఈ వాదానికీనాడు చాలా ప్రచారమూ వ్యాప్తీ ఉన్నది—ఐతే తత్వశాస్త్ర చరిత్రక్రమంలో ఇలాంటివాదాలు పెట్టకతప్పవు. ఆధునికయుగంలో ఈ వాదం వైజ్ఞానిక సంకుచితాన్ని పోషించు ఒక మధ్యేమార్గ సాధనగా ఉపయోగపడవలసి యుంది !!

ఐతే, పై పనాలు వాస్తవములేనా ? వాటి ఫలితాలేమిటి ? ఇక మనం పరిశీలించాలి. ఒకవేళ అజ్ఞేయవాదులు చెప్తున్నట్లు మనకు మూల భూతపదార్థంయొక్క అసలు స్వరూపం, స్థితి తెలియబడనిదైతే, లేక మన జ్ఞానం లేక భావం నామ-రూప గుణధర్మ ధర్మిమాత్మకమైనట్లయితే అప్పుడు వస్తువుకు వాస్తవికమైన స్థితి యుండునని మనం చెప్ప వీలులేదు. "గజం మిథ్య పలాయనం మిథ్య" కథలో ఏనుగు బుద్ధిమూలక భ్రాంతియా ? లేక సత్యమా ? నిరూపించే అవకాశం లేదు. అంటే భావం వస్తువుయొక్క ప్రతిబింబమని అంగీకరింప వీలులేదన్న మాట. ఈవిధంగా అజ్ఞేయవాదం తుదకు మళ్ళీ ఆదర్శవాదంగానే పరిణమించింది. అసలు వస్తువుస్థితియే లేదన్నా, లేక ఉన్నట్లు మనకు తెలియబడదన్నా అట్టే తేడా లేదుకదా ! అజ్ఞేయవాది వస్తువు స్థితిని జ్ఞాతృరూపకంగాను, (ఇంద్రియానుభూతి మూలకస్థితి) జ్ఞేయ రూపకంగాను (మూలభూత పదార్థస్థితి) విభజిస్తాడు. జ్ఞాతరూపకంగా వస్తువివేకం సాధ్యం. జ్ఞేయరూపకంగా అసాధ్యం. అంటాడు. ఇందులో మొదటిదేని విజ్ఞానశాస్త్రం. రెండవదిమాత్రమే అజ్ఞేయతత్వం—అంటే ఏమి ?...అజ్ఞేయవాది విజ్ఞానశాస్త్రాన్ని అంగీకరిస్తాడు. దాని వికాసాన్ని కోరుతాడు, నిర్మాణం చేస్తాడు. అంటే ఏమి ? విజ్ఞానశాస్త్రాలవరకు అతడు భౌతికవాదిగానే ఉంటాడు.

కాని వెంటనే అతడు మరేమంటాడు. విజ్ఞానశాస్త్రం నామ-రూప గుణధర్మపరిమితమైనదేగాని అది వస్తువులయొక్క జ్ఞేయమూలక మూల భూతస్థితిని నిరూపించదు అని. దేవుడు లేడని కాని, లేక వస్తువుయొక్క జ్ఞేయరూపక స్థితి జ్ఞాతరూపకస్థితియే యని కాని విజ్ఞానశాస్త్రం నిరూపించజాలదని వాదిస్తాడు. మానవుని బుద్ధీంద్రియానికి అతీతమైన ఈ అజ్ఞేయవిషయాలలో మనం కల్పించుకోకూడదని శాసిస్తాడు. ఒకవేళ వస్తువుయొక్క జ్ఞేయరూపక స్థితి ఉన్నా, దాన్ని నిరూపించే మతాలు ఆధ్యాత్మికవాదంతో ఉన్నా వాటితో మనకు సంబంధం లేదని, ఆవిషయంతో మనకు అవసరం లేదనీ దాన్ని చర్చించే అగత్యం లేదనీ తప్పుకుంటాడు.

కాబట్టి అజ్ఞేయవాది ఎలాంటివాడు ? ప్రవృత్తిపరంగా భౌతికవాది. కాని అతడు తనకుతాను భౌతికవాదినని చెప్పుకోడు. ఆదర్శవాదులతో పేచీకి దిగడు; మతాలతో తగవులలో దిగడు. అంటే అతడు 'దొంగ భౌతికవాది' అన్నమాటేకదా !

ఈ వాదన ఫలితమేమిటి? విజ్ఞానశాస్త్రంయొక్క పరిశోధనలుకూడా భ్రాంతులేనని. విజ్ఞానశాస్త్రంద్వారా మనం పదార్థాల వాస్తవిక స్థితిని తెలిసికోలేమని. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి భ్రాంతియేయని చంద్రుణ్ణిగూర్చిన ఆదిమ మనుష్యుని అభిప్రాయమూ, నేటి విజ్ఞానశాస్త్ర నిరూపణం రెండూ భ్రాంతులేనని. విజ్ఞానశాస్త్రం నిన్న చెప్పినది ఈనాడు మార్పులకు గురియౌతుంటుంది నేడు చెప్పేది రేపు మార్పులకు గురికావచ్చు. కాబట్టి విజ్ఞానశాస్త్ర నిరూపణ నిత్యసత్యంకాదు. అని విజ్ఞానశాస్త్ర అసమగ్రతద్వారా దాన్ని నిరుపయోగంగా అజ్ఞేయవాది నిరూపిస్తాడు. సాదృశ్యాలనూ, అనుభవాలను నిరాకరిస్తాడు. నిరాకరిస్తూ మతాలు, ఆధ్యాత్మికములపై విశ్వాసాన్ని పరోక్షంగా బలపరుస్తాడు.

## ఈ వాదనను మనమెలా ఖండించాలి?

భౌతికవాదులు విజ్ఞాన శాస్త్రాధారాలను వాస్తవంగా నమ్ముతారు. కేవలం శాస్త్రాన్నే కాక 'అనుభవాన్ని' కూడా పాటిస్తారు. అనుభవపు గీటురాయిద్వారా విజ్ఞానశాస్త్రాన్ని సరిదిద్దుకొని అభివృద్ధిపరుస్తారు. తద్వారా వస్తువు సమగ్రస్థితిని తెలిసికోవవచ్చునని చెప్తారు.

ఐతే, అజ్ఞేయవాదులు బాహ్యప్రపంచానికి వాస్తవికస్థితి ఉందో లేదో అసలే తెలియదంటారు. ఉన్నదంతా వ్యావహారికస్థితి లేక భ్రమే నని భావిస్తారు.

మనకు అనుభవం చెప్తున్నదేమిటి? ప్రపంచమూ పదార్థమూ ఉన్నదని. పదార్థాలనుగూర్చిన మన భావాలు సరియైనవని—పదార్థాలకూ మనకూ మనం నెలకొల్పేడి సంబంధాలు వాస్తవమైనవని ...

ఒక ఉదాహరణ: రొట్టె. రొట్టె రొట్టెగా మనకు తినటంద్వారా అనుభవంద్వారా తెలుస్తుంది. అది ఒకవేళ మిథ్య లేక మనోకల్పనైతే మన ఆకలి తీరదుకదా! ఈవిధంగా మనం వస్తువులనుగూర్చి సరిగానే తెలిసికొనగలం. అదేవిధంగా విజ్ఞానశాస్త్రపు సిద్ధాంతాలకు ఆచరణక్షేత్రంలో పరిశ్రమలూ, [నాగరికత] అనుభవపూర్వకమగు నిదర్శలుగా ఉన్నాయి.

శాస్త్ర సిద్ధాంతాలను మనం ప్రయోగాలద్వారా నిరూపించుకుంటున్నాము. మనం కృత్రిమరబ్బరు తయారుచేస్తున్నామంటే రబ్బరుయొక్క వాస్తవిక స్థితి విజ్ఞానశాస్త్రానికి తెలిసినందువల్లనే....

కాబట్టి శాస్త్రంయొక్క 'సిద్ధాంత' రూపంలో అసమగ్రతలు లేక తప్పులు ఉన్నా వాటిని అనుభవం లేక ప్రయోగాలు సరిదిద్ది శాస్త్రాన్ని నికరమైనదిగా నిరూపిస్తవి. అందువలన ఆచరణ అను గీటురాయిద్వారా శాస్త్రం నిర్దుష్టమౌతుంటుంది.

పర్యవసానం:

18 వ శతాబ్దంనుండి ప్రచలితమైయున్న ఈ అజ్ఞేయవాదం ఒక వంక ఆదర్శవాదంచేతను మరోవంక భౌతికవాదంచేతను దగ్ధంచేయబడుతూ ఉన్నది. మతాన్నీ, విజ్ఞానశాస్త్రాన్నీ రెంటినీ నమ్ముతూకూడా, అజ్ఞేయవాదులీ రెండు మార్గాలనూ తికమకపరచే మూడోపంథాను కల్గియున్నారు. వీరు ఇటు భౌతికవాదులమనీ చెప్పుకోరు, అటు ఆదర్శవాదులమనీ చెప్పుకోరు. ఇటు మతాన్నికాని అటు విజ్ఞానశాస్త్రాన్నికాని రెంటినీ (పరస్పర వ్యతిరేకమైనవి) ఖండించని తటస్థమార్గాన్నవలంబిస్తారు.

అజ్ఞేయవాదం ఆచరణలో విజ్ఞానశాస్త్రాన్నాశ్రయిస్తూ సిద్ధాంతాలలోమాత్రం ఆదర్శవాదానికి లొంగిపోతుంది. ఉభయత్రా ఇది అసమగ్రమైన రెంటికి చెడు రేవనికథమాత్రమే.

ఆధునికయుగంలో తనకాళ్ళపై తాను నిల్వలేని ఆదర్శవాదానికి ఈ అజ్ఞేయవాదం ఒక ఊతకఱ్ఱగా పనిచేస్తుంది. అందుకే లెనిన్ "ఒక అజ్ఞేయవాదిని గిల్లిచూడు, లోపల ఆదర్శవాదిగా కనపడ్తాడు" అన్నాడు.

అసలు తత్వశాస్త్ర మౌలికసమస్యకు అజ్ఞేయవాదం సమాధానాన్ని కల్గిలేదు. కాబట్టి అది ఒక సిద్ధాంతంగా అన్వర్థం కాజాలదు.



## ద్వితీయభాగం.

# తాత్త్విక భౌతికవాదం.



1వ భాగంలో మనం భౌతికవాదుల సర్వసాధారణాభిప్రాయములను గమనించాము. ఆదర్శవాదాన్ని ఖండించే భౌతికవాద సర్వసాధారణ నిరూపణలను తెలిసికొన్నాము. అజ్ఞేయవాదపు పొరపాట్లను గమనించాము. ఇక మనం భౌతికవాదాన్ని గూర్చిన పైవిషయ జ్ఞానాన్నుండి ఫలితాలను తీయుటకూ, భౌతికవాద వివేచనను స్థిరీకరించుటకూ ఈ క్రింది ప్రశ్నలకు సమాధానా లీయవలసియుంటుంది.

1. పదార్థం లేక భౌతికవస్తువు ఏమిటి ?

2. భౌతికవాది అనగా ఏమిటి ?

### పదార్థం ఏమిటి ?

ఒక విషయాన్ని నిర్ణయించేసే సందర్భంలో మనం స్పష్టంగా మౌలిక ప్రశ్నను వేసుకోవాలి. ఐతే, ఈ ప్రశ్న విషయంలో వెంటనే సరియైన సంతృప్తికరమైన సమాధానం రావటం అంత సులభంకాదు. సరియైన సమాధానాన్ని చేకూర్చుకొనుటకు గాను మనం ముందా వస్తువునుగూర్చిన నిర్వచనాన్నేర్పరచుకోవలసి వస్తుందికదా !...

మనం పదార్థం అనగానే ముందు తాకేవస్తువు లేక ఘనపదార్థం అనుకుంటాము. ప్రాచీన గ్రీకులు పదార్థాన్ని అలాగే నిర్వచించారు — కాని, ఈనాటి విజ్ఞానశాస్త్రం ఈ నిర్వచనాన్ని అసమగ్రమైనదని తెలియజేస్తున్నది.

## పదార్థమునుగూర్చిన నిర్వచన పరంపర:

మనమిక్కడ పదార్థాన్నిగూర్చిన భిన్న భిన్న నిర్వచనాలను — వాటి విశేష వివరణతోగాక — క్లుప్తంగా తెలిసికొందాం.

పురాతన గ్రీకుకాలంలో పదార్థం 'భార' మైనదనీ, అది అనంత పరిమితివరకు అవిభాజ్యమనీ భావింపబడేది. అంటే, పదార్థాన్ని విభజించటం లేక విడగొట్టటానికి ఒక మేర ఉందన్నమాట. ఇలా పదార్థంయొక్క అతి సూక్ష్మ (చిన్న) రూపమైన అణువు గ్రీకులకాలంలో అవిభాజ్యమైనదిగా భావింపబడినది— ఈ అణువులకు విడివిడి స్వరూపాలున్నవని వారు నమ్మేవారు. తైలంయొక్క అణువు గుండ్రంగాను, సారాయపు అణువు కొంకిగాను ఉండేదని చెప్పుకునేవారు.

ఈ సిద్ధాంతాన్ని ప్రారంభించినది డెమోక్రిటస్ అను తాత్వికుడు. ప్రపంచాన్ని భౌతికవాద దృష్టితో మొట్టమొదట సమన్వయించినది ఇతడే. ఇతడు మన దేహంయొక్క అణువులు 'ముతకరకమనీ' ఆత్మయొక్క అణువులను 'మృదువులనీ' (స్థూలమూ, సూక్ష్మమూనన్నమాట) భావించాడు. ఈతడు దేవుళ్ళనుకూడా నమ్మాడు. కాని దేవతల అణువులు మరీ సూక్ష్మములని వాటిని భౌతికవాదపరంగా వ్యాఖ్యానించాడు.

ఐతే, పూర్వకాలంనుండీ 'భౌతికముల' స్థితినిగూర్చి నిరూపింప ప్రయత్నించిన తాత్వికులున్నారన్నమాట. కాని, ఈ ప్రాచీన సిద్ధాంతానికి మధ్యకాలంలో ఎట్టి మార్పులూ చేయబడినట్లు కనపడటంలేదు. తుదకు 19వ శతాబ్దంలో ఈ నిర్వచనం సవరణకు గురియైనది.

పదార్థం అణువులుగా విభజింపబడి యున్నదనీ ఈ అణువులు పరస్పరాకర్షణలను కల్గియున్నవనీ వ్యాఖ్యానింపబడినది. అణువులు 'కొంకి' వలెనూ 'నున్న' గాను ఉంటాయన్న గ్రీకు సిద్ధాంతాలు నిరాకరింపబడినవి. కాని అణువు 'గట్టిగా' [ఘనంగా] ఉంటుందని భావింపబడినది. ఐతే, ఇటీవలి విజ్ఞానశాస్త్ర అభివృద్ధివలన అణు పరిశోధన మరికొంత ముందుకుసాగినది —

ఈనాడు అణువు మధ్యభాగంగా దానిచుట్టూ విద్యుత్ ప్రసారంతో సూక్ష్మగ్రహాలు తిరుగుతున్నట్లు తెలిసికోబడినది. అణువుయొక్క మధ్య

భాగం [న్యూక్లియస్] విభిన్నాకృతులను కల్గియున్నట్లు పరిశోధింపబడినది. [ఈ అణువుకూడా విభాజ్యమైనదేనని ఈనాడు ఆటంబాంబులద్వారా కను గొనబడుతున్నది.]

పదార్థమంటే అణువుల సమూహమన్నమాట. పదార్థంలో మనకు గోచరించే కఠినత్వం ఆ పదార్థంలో అణుసమూహపు విద్యుత్ప్రసారంవల్లనే.

ఈ అణుపరిశోధనను ఆదర్శవాదులు వెక్కిరిస్తుంటారు. వారు 'పదార్థం' అణువులా ?...అంటే పదార్థం లేదనేగా ?...పదార్థంయొక్క 'కాఠిన్యం' పదార్థందికాదూ ?...అది అణువులలోని విద్యుచ్ఛక్తిదా ? ఐతే పదార్థం అస్తిత్వం ఎగిరిపోయిందీ ?!...అని హేళనచేయ ప్రయత్నిస్తుంటారు.

ఈ వాదధోరణి చాల ప్రమాదకరమైనది. నిజమనేతోస్తుంది. కాని నిజంలో పదార్థపు అస్తిత్వాన్ని మనం మరింత సూక్ష్మంగా తెలిసికోగల్గు తున్నాము. పదార్థ స్వరూపం మనకు నేడు మరింత స్పష్టంగా తెలిసి పోతున్నది. అంతేగాని పదార్థంయొక్క స్థితి నిరాకరింపబడటంలేదుకదా !... ఇది గమనార్హము.

## భౌతికవాదిదృష్ట్యా భూతం లేక పదార్థం

ఒక భౌతికవాది పదార్థాన్ని ఎలా నిర్వచిస్తాడు ? ఈ ప్రశ్న సమా ధానానికి మనమీ క్రింది రెండుసమస్యలను గమనించాలి.

1. పదార్థం ఏమిటి ? అప్పై, 2. పదార్థం ఎట్లా ఉంటుంది ?

దీనికి భౌతికవాది సమాధానమేమిటి ? పదార్థం బాహ్యసత్యమని. అంటే మన జ్ఞానంయొక్క బంధనానికికాని, అస్తిత్వానికికాని అతీతమైన సత్యమని. [పదార్థంయొక్క ఉనికియే భావానికి, జ్ఞానానికి ఆధారంకదా !]

ఇక రెండవప్రశ్న. పదార్థం ఎలా ఉంటుందో 'మీరూ-మేమూ' చెప్పేవిషయం కాదు. ఆవిషయాన్ని నిర్ధరించేది విజ్ఞానశాస్త్రం.

ఐతే మొదటిప్రశ్న ఎల్లకాలమూ మారేదికాదు. రెండవప్రశ్న సమా ధానం మానవుని విజ్ఞానస్థాయినీ, విజ్ఞానశాస్త్రమునూ ఆశ్రయించియుంటుంది.

కాబట్టి అది మార్పుకు గురియౌతుంటుంది. ఈవిషయంలో సమాధానం సర్వ సమగ్రమైనదికాదు.

ఐతే ఈ రెండుప్రశ్నలనూ కలాపులగం చేయటంద్వారా ఆదర్శవాదులు మనను తికమకపరచకుండా తగు జాగ్రత తీసికోవాలి. మనకు ప్రధానమైనది మొదటిప్రశ్నయే. ఆవిషయంలో భౌతికవాదులు ఎల్లకాలాలలోను ఏకాభిప్రాయాన్నే కల్గియుంటారుకదా!

## పదార్థమునుగుర్చించి భౌతికవాద నిర్వచనాలు.

పదార్థం మన 'జ్ఞానావరణకు' వెలుపల నుంటుందని మనం గమనించాము. కాబట్టి అదెట్లో మనం వివరించాలి.

1. పదార్థం కాలంలోను. స్థలం (శూన్యం)లోను 'స్థితిని' కల్గియుంటుంది.

2. పదార్థం చలనాన్ని కల్గియున్నది.

దీనికి ఆదర్శవాదులు మరొక అడ్డుప్రశ్న వేస్తారు. 'కాలం' లేక (శూన్యం) స్థలం మన 'భావం' లేక 'జ్ఞానం' వల్ల సృష్టింపబడినవేకదా! అని.

దీనికి భౌతికవాదులిచ్చే సమాధానం. స్థలం లేక కాలం మన జ్ఞానం లేక భావసీమ లోపలలేదు. అది బయటఉంది. పైగా మనమే కాలంలోను శూన్యం లేక స్థలంలోను ఉన్నామని. మన విజ్ఞాన చైతన్యమును వ్యక్తపరచుటకు కాలమానం అనివార్యమైనది. కాబట్టి కాలమానములలోనే [మన భావనకు అతీతంగా] పదార్థం ఉంటుంది. మన 'చైతన్యానికి' అతీతమైన సత్యంకూడా ఉంటుంది. ఈ ప్రపంచం మనకంటే ముందుకూడా ఉండియుండెను, మనకంటె వెనుకకూడా ఉంటుంది. మనం పుట్టకముందుకూడా 'కాశీపట్టణం' ఉండియుండెను. అది విధ్వంసమైపోతేతప్ప మనం చనిపోయినతర్వాతకూడా ఉంటుంది. కాశీపట్నాన్నిగురించి మనం ఆలోచించనప్పుడుకూడా అది ఉంటున్నదన్న వాస్తవం వాస్తవమే. ఒక్క కాశీయే కాదు; ఎన్నోపట్టణాలు మనం చూడనివి, మనకు పేర్లుకూడా తెలియనివి

ఉన్నవని మనకు గట్టిగా తెలుసు. మనిషి యొక్క సామాన్యవిషయ జ్ఞానం ఇట్లా ఉంది....

విజ్ఞానశాస్త్రంకూడా మానవసృష్టికి పూర్వమే భౌతికప్రపంచ ముండి యున్నట్లూ...అసలు ప్రాణికోటి ఉత్పత్తికంటే ముందే ప్రపంచ పదార్థసృష్టి జరిగి ఉండియున్నట్లూ ఋజువుచేసింది. కాబట్టి ఆదర్శవాదులు ఎన్ని యుక్తి వాదాలతో తికమకపరచినా మనం మోసపోలేము.

విజ్ఞానశాస్త్రీలు పదార్థం 'కాలమూ స్థలం' లో స్థితి కల్గియుంటుందని చెప్తూ, తోడ్తో చలనాన్ని కల్గియున్నట్లును నిరూపిస్తున్నవి. ఆధునిక విజ్ఞాన శాస్త్రం నిరూపించిన ఈ 'చలనం' చాలా ముఖ్యమైనది. ఎందుకంటే వస్తువుకు చలనంలేదన్న పాతసిద్ధాంతాన్నది నిరాకరిస్తుంది.

ఈనాటి ప్రపంచస్థితి వేనకువేల సంవత్సరాల క్రమక్రమ అవిచ్ఛిన్న సుదీర్ఘసృష్టి పరిణామపు ఫలితమని మనకు తెలుసు.

" కాబట్టి 'గతి' లేక చలనం వస్తువుయొక్క స్థితి లేక ఉనికియొక్క అవస్థకు అనివార్యమైన ఆధారము. (ప్రపంచం గతిశీలమైనదికనుక) పదార్థంతో సమన్వయించని చలనమూ, చలనంతో సమన్వయించని పదార్థమూకూడ అనూహ్యములు ". (ఎంగెల్స్)— కాబట్టి మనమిలా నిర్ధరిస్తాము.

" ఈ ప్రపంచంలో చలనరూపకమగు వస్తువుతప్ప మరేమీ ఉండదు. చలనాత్మకమగువస్తువు కాలమూ స్థలమూలేకుండా చలింపజాలదు. " (లెనిన్)

## పర్యవసానం:

పై దృక్పథంలో పరమాత్మ కాని, లేక ప్రపంచసృష్టికర్త కాని లేక దేవుడు కాని ఒకడు కాలానికీ, స్థలానికీ అతీతంగా [నిర్వికార, నిరాకారుడు] " స్థితి " కల్గియుండే అవకాశంలేదు. ఒకవేళ దేవుడులేని స్థలంలో, [స్థలానికి అతీతంగా] లేనికాలంలో [కాలానికి అతీతంగా] ఏదో విశ్వసింపబడినట్లయితే, అది విజ్ఞానశాస్త్ర విరుద్ధమైన ఒక నిరర్థక భ్రాంతిగా గుర్తింపబడాలి.

భౌతికవాదులు విజ్ఞానశాస్త్రాధారంపై 'పదార్థం' (ఎక్కడో

ఒకక్కడ ) స్థలంలోను, ( ఎప్పుడో ఒకప్పుడు ) కాలంలోను స్థితిని కల్గియుంటుందని చెప్తారు—కాబట్టి దేవుడు ప్రపంచాన్ని కాలాతీతంగా ( ఎప్పుడూ కాకుండా ) సృష్టిచేశాడనటాన్ని నిరాకరిస్తారు—ఇంతేకాక, ఒకవేళ దేవుడు ప్రపంచాన్ని సృష్టించేఅట్లయితే ఆ సృష్టికిముందు విశ్వపదార్థకోటి లేదనవలసి వస్తుంది. ఐతే శూన్యంనుండి పదార్థం (నిరాకారంనుండి సాకారప్రపంచం) ఉద్భవమౌతుందనటం అశాస్త్రీయమగు వాదనయేకదా !—

విజ్ఞానశాస్త్రానికి వ్యతిరేకమైనట్టి ఆదర్శవాద నిరూపణలు నిరాధారములైనవిమాత్రమే. భౌతికవాదుల సిద్ధాంతాలు విజ్ఞానశాస్త్రంతో సమన్వయాన్ని కల్గియున్నవని మనం గుర్తించాము — ఐతే విజ్ఞానశాస్త్రానికీ, భౌతికవాదానికీగల సంబంధాలనిక ముమ్ముందు మనం తెలిసికోవాలి.



# 2 భౌతికవాది యనటమంటే అర్థమేమి?

## సిద్ధాంతానికీ ఆచరణకూ సమన్వయం:

మన ఉద్దేశం భౌతికవాదాన్ని పరిశీలిస్తూ అది యేవిధంగా గతితార్కికంగా పరిణమించి 'మార్క్సిజం' యొక్క స్వరూపాన్ని చేకూర్చుకొన్నదో గమనించటం. ( భౌతికవాదంలో సిద్ధాంతానికీ, ఆచరణకూ సమన్వయముందని మనమిదివరకే తెలుసుకున్నాము. ఇక భౌతికవాదాన్ని గూర్చిన మన ఉత్తరోత్తరచర్చలు 'గతితర్క' మనబడే విధానాన్ని నిరూపింపగలవని మనమిక్కడ గుర్తించాలి—

మనమిప్పుడు భౌతికవాద దృష్ట్యా పదార్థమంటే యేమిటో తెలిసికొన్నాము. పదార్థ 'స్థితి' ఎలా ఉందో చదివినాము. ఇప్పుడు మనం భౌతికవాదిఅంటే ఏమిటో—అతడు ఎలా వ్యవహరిస్తాడో అనగా సమస్యల యొక్క ప్రయోగాత్మకరూపం ఎలా ఉండాలో—తెలుసుకోవాలి.

భౌతికవాదంయొక్క మూలసూత్రం "స్థితి" లేక ఉనికియే "జ్ఞానం" లేక భావంకు ఆధారమని. ఇంతమాత్రం చెప్పటం చాలదు. భౌతికవాదాన్ని వాస్తవంలో అర్థంచేసికొనటమంటే దాన్ని 1. ఆలోచనపథంలోను, 2. ఆచరణపథంలోను నిరూపించిచూపాలి.

ఆలోచనపథంలో భౌతికవాది అంటే అర్థమేమి? అనగా 'స్థితి' నుండి 'భావం' యేర్పడుతుందన్న ప్రాథమికసూత్రాన్ని తెలిసికొనటమే కాక దీన్ని ఆచరణలో ఎలా అన్వయించాలో గుర్తించటం.

"స్థితినుండి భావం" యేర్పడుతుందన్న సాముదాయక సూత్రం Abstract అమేయమైనది. "స్థితి", "జ్ఞానం" ఈ రెండుపదాలూ అమేయమైనవే; స్థితి అంటే సర్వసాధారణమైన ఉనికీ, జ్ఞానం అంటే సర్వసాధారణమైన వివేకమూ. కాబట్టి ఈ సర్వసాధారణమైన స్థితీ, జ్ఞానమూ జ్ఞాతృరూపకంగానే (చూచేవానిద్వారా) తెలిసికొనబడునవై యున్నవి. ఇవి అమేయములు.

ఒక ఉదాహరణ: గుఱ్ఱములు ఉండును అని మనకు సాముదాయకంగా లేక సర్వసాధారణంగా తెలుసు. ఈ విజ్ఞానాన్ని "గుఱ్ఱాన్ని" గురించి మాట్లాడునప్పుడు మనం ఉపయోగపరుస్తాము. అలాగే "మనిషి." మనుష్యుల సామూహిక జ్ఞానంతోనే మనం "మనిషిని" గూర్చి చెప్తాము. ఐతే, ఈ సాముదాయక జ్ఞానం అప్రతిపాదమైనదీ, అమేయమూనైనది. ఈ అమేయ జ్ఞానము ఆచరణ రూపాన్ని దాల్చజాలదు. ఒకవేళ సాముదాయకజ్ఞానం లేదనుకొండి. అప్పుడేమౌతుంది? సర్వసాధారణంగా గుఱ్ఱాలు లేకపోతే యేమౌతుంది?...ప్రత్యేకమైన లేక ప్రత్యేక గుఱ్ఱాలుంటునికదా!—ఉదాహరణకు ఒక పశువైద్యుడు "నాకు సర్వసాధారణపు గుఱ్ఱాలను బాగుచేయవచ్చు—కాని ప్రత్యేకమైన గుఱ్ఱాల్ని కాదు" అంటాడనుకొందాం. [అలాగే మనుష్యుల విషయంకూడా.] ఈ మాట వట్టి హాస్యాస్పదమైనదేకదా! కాబట్టి ఈ సాముదాయకభావం కాక ప్రత్యేకితమైన నిర్దిష్టభావమే వాస్తవంలో ప్రయోగానికి నిలుస్తుంది. అట్టి భావమే స్థితిగా వర్తించి మనలో భావాన్ని కల్పిస్తుంది....

సర్వసాధారణమైనదీ లేక 'వ్యావహారికజ్ఞాన' మూలకమైనది అమేయ

మైన స్థితి. కాబట్టి అది స్థితిగా గుర్తింపబడక, ప్రత్యేకితమైన నిర్దిష్టస్థితియే స్థితిగా గుర్తింపబడి, భావాన్ని కల్పిస్తుంది. కాబట్టి ఒక భౌతికవాది ఎల్ల సమయాల్లోను, అన్నివిషయాల్లోను నిర్దిష్టమైన లేక ప్రత్యేకమైన స్థితినీ, ప్రత్యేకితమైన భావాన్నీ—అంటే స్థితిఎక్కడో, భావమెక్కడో సరిగా పోల్చుకొని వ్యవహరిస్తాడు.

ఉదాహరణకు: మెదడు—మనభావాలూ.

1. మనం వ్యావహారిక అమేయస్థితిని ఎలా ప్రత్యేకస్థితిగా నిర్దేశించాలో తెలిసికోవాలి. కాబట్టి భౌతికవాది వెంటనే మన మెదడును ' స్థితి 'గాను, మన భావాలను భావంగాను గుర్తిస్తాడు. అతడు " మెదడు " ఆలోచనలను పుట్టిస్తుంది అని తర్కిస్తాడు. ఇదొక సామాన్యమైన ఉదాహరణ. ఇప్పుడు మనం సమాజాన్ని తీసికొని భౌతికవాది ఎలా వాదిస్తాడో గమనిద్దాము.

2. మానవ సమాజంయొక్క అస్తిత్వం మొత్తంమీద ఆర్థిక జీవనం తోనూ రాజకీయ జీవనంతోనూ సమన్వయమైయున్నది. ఐతే ఆర్థిక జీవనా నికీ రాజకీయ జీవనానికీ సంబంధాలేమిటి? ఈ సామాన్య అమేయస్థితిలో ప్రయోగాత్మకమైన, నిర్దిష్టమైన ప్రాథమికభాగం ఏది?

ఒక భౌతికవాది దృష్ట్యా " ప్రాథమికభాగం లేక స్థితి ", లేక (భావపు స్వరూపాన్ని కల్గించేది) ఆర్థికజీవనం. ఇక రెండవవిషయం, అనగా స్థితితో విడదీయలేనట్టిదీ, స్థితివల్ల సృష్టింపబడినదీ ఐన రాజకీయ జీవనం. (భావం.)

" ఆర్థికజీవనం రాజకీయ జీవనాన్ని నిరూపిస్తుంది. ఎందుకల్లనంటే రాజకీయజీవనం ఆర్థికజీవనంనుండి యేర్పడినది " అని భౌతికవాది వాదిస్తాడు. మనం స్థూలంగా గమనించిన ఈవిషయాన్నే రాజకీయశాస్త్రం చారిత్రక భౌతిక వాదమని పేర్కొంటుంది. దీన్ని తొలిసారిగా మార్క్స్ లెనిన్ కనిపెట్టారు.

3. ఇప్పుడు మనమింతకంటె సున్నితమైన మరొక ఉదాహరణను తీసు కుందాం. కవి. కవిని మనం బోధపరచుకోవాలంటే ఎన్నో విషయాలను గణిం పకతప్పదు. ఐతే ఈ సమస్యయొక్క ఒక రూపాన్ని మాత్రమే ఇక్కడ నిరూపిస్తాము.

కవి సర్వసాధారణంగా వ్రాస్తాడనీ, దానికి కారణం అతని భావోద్రేకమనీ సామాన్యంగా చెప్పబడ్తుంది. కాని అందువల్ల మనకు కవి ఇలా వ్రాయటానికిబదులు అలా ఎందుకు వ్రాస్తాడని తెలుస్తుందా? లేదు. 'కవి' మెదడులో భావోద్రేకముంటుంది; కాని అతడు ఈ సమాజంలో నివసించే ఒకమనిషి. కాబట్టి కవికీ అతని అస్తిత్వానికీ ఆధారమైనది సమాజం. అది "స్థితి". ఇక రెండవవిషయం కవి మనస్సులో ఉండే భావోద్రేకం. అది భావం. అందువల్ల, కవిని ప్రోత్సహించేసే ప్రాథమిక అంశం సమాజం. అంటే సమాజంలో అతని స్థానం.

(ఈ కవి ఉదాహరణను మనం గతితార్కిక కాలను చదివే సందర్భంలో సవివరంగా మరొకసారి పరిశీలింపగలము. అప్పటివరకీ విషయ వివేచన కవసర మగు పూర్తి వివరాలను తెలిసికోగల్గి యుందుము.)

పై ఉదాహరణలద్వారా ఒక భౌతికవాది అన్ని విషయాలకునూ, అన్ని వేళలలోనూ, ప్రతిచోటా భౌతికవాదాన్ని ఎలా ప్రయోగరూపంలోకి తేగల్గి యుంటాడో మనం గమనించాము. అట్లు చేయుటవల్లనే అతడు అవ్యాఘాతముగా ఆలోచింపగల్గుతాడు.

## "ఆచరణ"లో ఒకడు ఎలా భౌతికవాది?

ప్రశ్నయొక్క ప్రాథమికరూపం. మూడో తత్వశాస్త్రం లేదనీ, ఒకడు ఆదర్శవాదిగానో భౌతికవాదిగానోమాత్రమే ఉండగల్గుతాడని మూడో మార్గమంటే ఈ రెంటి కలాపులగమనీ మనం గమనించియున్నాము. ఒక విజ్ఞానశాస్త్ర పండితుడు తన ప్రయోగములూ, పరిశోధనలలో భౌతికవాదిగా ఉంటాడు. అలా ఉండటం శాస్త్రానుభవమునకు అనివార్యం. ఒకవేళ పదార్థం లేక వస్తువు మన మనస్సులోనే ఉందని నిజంగా అనుకుంటే అతని ప్రయోగాల ప్రసక్తే తీరిపోతుందికదా!

శాస్త్రజ్ఞులలోను అనేకవిధాలున్నారు. (1) చైతన్యయుతులగు అవ్యాఘాత భౌతికవాదులు. ఉదాహరణకు యూ. యస్. యస్. ఆర్. విజ్ఞానశాస్త్రజ్ఞులు. వీరు విజ్ఞానశాస్త్రాన్నీ, మార్క్సిజాన్నీ సమన్వయించి అభివృద్ధి పరుస్తారు.

(2) భౌతికవాదులుగా ఉండి తాము భౌతికవాదులమని తెలిసికోలేని మరికొందరు వీరిలో మళ్ళీ ఆదర్శవాదులూ, అజ్ఞేయవాదులూ.

(3) ఆదర్శవాదులు ఆచరణలో భౌతికవాదాన్ని అనుసరిస్తున్నా వారికి తాము భౌతికవాదులైనట్లు తెలియదు. వీరు తమ ప్రయోగశాలలో భౌతికవాదులుగాను, వెలుపల మత విశ్వాసాలకు లొంగిపోయినవారుగాను పరస్పర వ్యాఘాతులుగా ఉంటారు....అజ్ఞేయవాదులు భౌతికవాద అనుసరణను ప్రారంభిస్తారు. కాని మధ్యంతరంలోనే తాము తమను భౌతికవాదులుగా ఒప్పుకోరుకనుక, ఆదర్శవాదులుగా లేక దొంగభౌతికవాదులుగా పరిణమిస్తారు.

ఇందులో ఆదర్శవాదులకు తమ విచారాలకొక క్రమస్వరూపాన్నెలా ఈయాలో తెలియదు. వారందుకు ప్రయత్నింపరుకూడా. అందుకని వారు తమనుతామే ఖండించుకునే "వ్యాఘాతా"నికి గురియైయుంటారు. అజ్ఞేయవాదులు "వస్తుస్థితి"ని శోధిస్తూ గుర్తిస్తూకూడా వస్తుస్థితి తెలియబడనిదనే నమ్మకానికి గురైయుంటారు. వారు పదార్థానికి స్థితి లేదని చెప్పలేకున్నా ఆ స్థితి తెలిసికోబడనిదేనని చెప్తుంటారు. ఇల్లా విజ్ఞానశాస్త్ర భూమికనుండి పడిపోతుంటారు. "విజ్ఞానశాస్త్రమూ, గుడ్డివిశ్వాసమూ పరస్పర వ్యతిరేకములు." పాస్చర్ బ్రాన్లీ మొదలగు గొప్ప విజ్ఞానశాస్త్రజ్ఞులుకూడా ఆస్తికులుగా, మతాన్ని విడువలేనివారుగా ఈ లోపాలకు గురైయున్నారు.... అంటే వీరు స్థితినీ—భావాన్నీ సమన్వయించుకోలేరన్నమాట.

## ప్రశ్నయొక్క రెండోరూపం:

తత్వశాస్త్ర మూలసూత్రాన్ని ప్రతిచోటా, ప్రతివిషయానికీ అన్వయించగల్గేవాడే నికరమైన భౌతికవాది. ఐతే ప్రతివిషయంలోనూ, ఎల్లప్పుడూ ఆ సూత్రాన్ని సమన్వయించేసందర్భంలో అతడు సరియైన విధానాన్నవలంబించు చైతన్యమును కల్గియుండాలి. సిద్ధాంతానికీ, ఆచరణకూ వ్యాఘాత దోషం పట్టకుండా ఉండాలంటే భౌతికవాదాన్ని ఆచరణాత్మకంగా పాటించటం అవసరమౌతుందని మనం పైన గమనించాము. అప్పుడే భౌతికవాది అవిచ్ఛిన్న వర్తనను కల్గియుంటాడు.

ఆచరణలో భౌతికవాది యవటం అంటే సిద్ధాంతాన్నీ తదనుగుణ్యమైన ఆచరణనూ కల్గియుండటం లేక ప్రాథమిక అంశమైన స్థితిని లేక వాస్తవంతో రెండవ అంశమైన భావాన్ని సరిగా సమన్వయించి వ్యవహరించటమన్న మాట.

ఐతే భావం లేక ద్వితీయాంశాన్ని ప్రాథమిక వాస్తవంగా లేక స్థితిగా భ్రమించి-తాత్కాలికంగా ఒకడు ఎలా ఆదర్శవాదానికి లోబడిపోతాడో మనమిక్కడ విశ్లేషించాలి.

1. ఒకవేళ ఒకమనిషి, ఈ ప్రపంచంలో తానొక్కడే నివసిస్తున్నట్లుగా వర్తిస్తుంటే అతణ్ణి మనమేమంటాము? వ్యక్తివాది. అతడు తనను గూర్చే ఆలోచిస్తూ బయటి ప్రపంచాన్ని గూర్చి విస్మరణకు లోనైయుంటాడు. బయటి ప్రపంచమంతా తనకోసమేనని భావిస్తూ (తన దృష్టినిమాత్రమే నమ్మి) తనపరంగానే ఆలోచిస్తుంటాడు. ఈ దృష్టి అహంభావం అనబడు ఆదర్శవాద స్థితికి చెందినది. కాబట్టి ఒక భౌతికవాదికి అహంభావం వ్యతిరేకమైనది.

2. శాస్త్రాన్ని తనవరకే నేర్చుకొనువాడు, అంటే తన సుఖంకొరకేనన్న మాట, లేక తనవరకే ఉంచుకొనేవాడు. ఇట్టివాడు తన స్థితికీ, తన ఆలోచనలకూ మాత్రమే సంబంధించియున్నాడు. ఇదికూడా ఆదర్శవాద దౌర్బల్యమే. ఆదర్శవాది బాహ్యప్రపంచాన్ని భ్రమనుకొని వాస్తవాలను లక్షించడుకదా. భౌతికవాది ఈ దోషానికి అతీతుడైయుంటాడు. అతడు వాస్తవాన్ని గుర్తించ సంసిద్ధుడైయుంటాడు. కాబట్టి తాను నేర్చుకొన్నది ఇతరులకు బోధిస్తాడు. విజ్ఞానాన్ని ప్రసరింపజేస్తాడు.

3. ప్రతిసమస్యనూ తన స్థితిగతుల కొలతబద్దతో యోచించటంకూడా ఆదర్శవాద లక్షణమే. ఉదాహరణకు ఒక సమావేశం జరిగిందనుకొండి. అది తన అభిప్రాయాలకు వ్యతిరేకమైన నిర్ణయాలు చేస్తే దాన్నొక ఆదర్శవాది "ఛఛ...తప్పుడుమీటింగు" అని విమర్శిస్తాడు. ఒక భౌతికవాది అట్లుకాక అసలు సమావేశంయొక్క నిర్మాణం ఎలాంటిదో, ఉద్దేశాలు లక్ష్యాలు ఏవో వాటినిబట్టి తన నిర్ణయాన్ని వాస్తవికరూపకంగా తీసికోవాలి.

4. స్వమతాభిమానంకూడా భౌతికవాద లక్షణంకాదు. ఒకడు తానుకాని తన వర్గంకాని ఒక విషయంలో ఒక నిర్దిష్టాభిప్రాయాన్ని కల్గియున్నంతమాత్రాన,

ఆ అభిప్రాయాన్నే ఇతరులుకూడా కల్గియుంటారనుకోవటం భ్రమే. ఇది పిల్లి కండ్లుమూసుకొని పాలుత్రాగుతూ ఎవ్వరూ చూడటంలేదని భావించటం వలె ఉంటుంది. ఒక భౌతికవాది ఈ లోపానికి గురికాకూడదు.

5. పాండిత్య ఛాందసత్వానికి గురియైనవాడుకూడా సరియైన భౌతిక వాది కాజాలడు. పాండిత్య ఛాందసునికి "గ్రంథాలు—సిద్ధాంతచర్చలు" మాత్రమే కన్పిస్తుంటాయి. అతడు పుస్తకాల్లోని వ్యాఖ్యాలనే వల్లిస్తుంటాడుకాని బయటి ప్రపంచపు స్థితిగతులను లెక్కించలేడు. అతడు గ్రంథస్థ సూత్రాలను—ఆచరణతో సంబంధంలేకే చిలుకపలుకులుగా వల్లిస్తుంటాడు—అట్టివాడు ఆచరణలో భౌతికవాదిగా నిలువలేడు. కాబట్టి ఇది పుస్తకాల దురభిమానమే కాని మరేదీ కాదు.

...ఒక నాయకుడు లేక కార్యకర్త ప్రజలకు వాస్తవ విషయాలను తెలియజేయాలి. నిరూపించాలి. బోధపరచాలి. అప్పుడు ఉద్యమాన్ని లేవదీయాలి. ఉద్యమపు ఆచరణదశలోకూడా వారికి బోధపరుస్తూనే ఉండాలి. ప్రజలు విషయాలను తెలిసికొని ముందుకుసాగుటకు సిద్ధులై యున్నప్పుడే ఉద్యమం కొనసాగింపబడ్తుంది. లేకపోతే ఉద్యమం సంకుచితమై, విఫలమై నాయకుల లేక కార్యకర్తల పొరపాటుగా పరిణమిస్తుంది. ఇది భౌతికవాద లక్షణంకాదు.

ప్రజలు వాస్తవాలను అంగీకరించ సిద్ధంగా లేనప్పుడు ఉద్యమాన్ని ప్రారంభింపకూడదు. ప్రజలు ఏ కారణాలవల్ల, ఏ పరిభావాలవల్ల అంగీకరించటంలేదో తెలిసికోవాలి. ఉద్యమ వ్యతిరేకుల శక్తి, పలుకుబడి, ప్రచారాలు, ఎత్తుగడలు, ఆయా సానుభూతిశక్తులు ఇవన్నీ సరిగా అర్థం చేసుకోబడాలి. వీటన్నిటినీ బట్టబయలుచేస్తూ, ఖండిస్తూ తన ప్రచారాన్ని ప్రజల్లో వ్యాపింపజేసి వారికినచ్చచెప్పినప్పుడే ఉద్యమం సరియైన పరిణామాలనుకల్గిస్తుంది.

నానాముఖములైన బాహ్యావాస్తవాల, పరిస్థితుల, పరిశీలన లేకుండా "పిల్లి కండ్లుమూసుకొని పాలుత్రాగినట్లుగా" వ్యవహరించటం గాలిమేడలు కట్టుటమే కాని ఫలప్రదం కాజాలదు. కాబట్టి,

పరిస్థితులను బాగుపరచే కృషి చేయనివారూ, బాగుపరచే మార్గాన్ని

ఆశ్వేషింపనివారూ, నకారాత్మక విమర్శలు చేసేవారూ, ఆత్మవిమర్శలు చేసికోలేనివారూ వీరంతా స్థిరత్వంలేని ఊగిసలాడే భౌతికవాదులుమాత్రమే.

మన భావాలే ప్రాథమికాంశం, లేక "స్థితి," కావు. స్థితిలో మార్పులొస్తేనే ఆచరణ జరగాలి. ఆచరణ క్షేత్రం మనకు ప్రాథమికాంశమైన స్థితి మన (మనస్సు) లో కాక, బయటి ప్రపంచంలో నున్నదని నిరూపిస్తుంది. దీన్ని మనం ఎప్పుడూ మరచిపోకూడదు.

కాబట్టి మనం ప్రాథమికాంశమైన 'పరిస్థితుల' ను ద్వితీయాంశమైన మన "అభిప్రాయాల" తో సమన్వయించి చూచుకోనటం అవసరము. స్థితి ఆధారాన్ని విడిచి మనం భావంవరకే ఆలోచించటం అసమగ్రమైన వివేచనకే దారితీయగలదు. అది ఆచరణరంగానికి సమన్వయం కాజాలదు.

## పర్యవసానం:

పై దోషాలు మనలో ఇంచుమించు ప్రతివారిలోను ఉంటాయి. వీటికి మూలకారణం ఆదర్శవాద ప్రభృతులే. ఎందువల్లనంటే ఆదర్శవాదులవలెనే పై 'లోపాల్లో' ఒక భౌతికవాదికూడా సిద్ధాంతానికీ, ఆచరణకూ సమన్వయాన్ని పాటింపలేకున్నాడు. ఒక ఆదర్శవాది కోరేదికూడా యిదే. అతడు చెప్పేదానికీ, చేసేదానికీ సమన్వయాన్ని కల్గిలేడు. కాబట్టి అతడు "నీతులు" చెప్పటంలో భౌతికవాదులకంటే వెనుకబడిలేడు. ఐతే, ఒక భౌతికవాది "ఆచరణ" తో సమన్వయాన్ని కోల్పోవటం తుదిని ఆదర్శవాదికి గెలుపు కల్గించటంగానే పరిణమిస్తుంది. పై లోపాలు సమాజంలోని ఆదర్శవాదం ద్వారా, దాని ప్రభావానికి లోనైయున్న మన చదువూ, సంస్కృతీభావనల ఆధారాలూ, అలవాట్లూ ఆచారాలద్వారా బాల్యంనుండీ మనలో నాటుబడుతున్నాయి. వీటితో ఒక భౌతికవాదికి నిత్యజీవితంలో తీవ్రమైన సంఘర్షణ జరుగుతుంటుంది. ఈ సంఘర్షణ ఆచరణరూపకమై, భౌతికవాద "సిద్ధాంతాలు" "ఆచరణ" తో వాస్తవంగా తనలో సమన్వయమై యున్నప్పుడే, భౌతికవాది నిజమైన భౌతికవాదిగా ఆదర్శవాదాన్ని ఎదుర్కొనగలడు. అతడే వ్యాఘాతరహితుడుగా నిల్వగల్గుతాడు.



# 3 భౌతికవాద చరిత్ర.

1. చరిత్ర పఠనావశ్యకత.
2. మార్క్సు పూర్వ భౌతికవాదం.
   ప్రాచీన గ్రీకుయుగంలో; ఇంగ్లండులో, ఫ్రాన్సులోను 18 వ శతాబ్దంలో...
3. ఆదర్శవాదం, మతం, ఎక్కడనుండి?
4. భౌతికవాదపు సుగుణాలు.
5. మార్క్సు పూర్వ భౌతికవాదపు లోపాలు.

ఇంతవరకు మనం భౌతికవాదాన్ని గూర్చిన సర్వసాధారణాభిప్రాయాలను చదివాము. ఇప్పుడు తొలుతనుండి క్రమక్రమంగా భౌతికవాదం ఎలా పరిణమించిందో, తుదకు నేటి భౌతికవాద స్వరూపాన్ని ఎలా చేకూర్చుకుందో చూడాలి. ఇప్పుడు మనం భౌతికవాద చరిత్రలోని ప్రధాన ధోరణులను గమనించాలి.

భౌతికవాద చరిత్రను మనం ఎంత స్థూలంగా పరిశీలించినా—భౌతికవాద క్రమవికసనకు కారణాలైన ప్రధానాంశాలనుకూడా గమనించాలి. కేవలం ఒక పేర్లయు తేదీలపట్టికగా కాకుండా ప్రయోగాత్మకంగా భౌతికవాద పరిణామగతిని పరిశీలించాలి.

అందుకై ముందు మనం కేవలం భౌతికవాద చరిత్రను గమనించి, ఆపిదప ఆ చరిత్రకు ఆధారాలైన వివరాలతో సమన్వయించుకుందాము.

భౌతికవాద చరిత్రను గమనింపవలసిన అవశ్యకత—

పాలకవర్గాలు భౌతికవాద చరిత్రను, దానికసలు చరిత్రక్రమమే లేనట్లు చెప్తుంటారు. అథవా ఉన్నదన్నా దాన్ని అపార్థం చేయించుటకు ఎన్నో తప్పుడు విధాలుగా ప్రచారం చేస్తుంటారు.

ఉదాహరణకు ఒక గొప్ప భౌతికవాద తాత్త్వికుడగు డిడ్రాట్ (17 వ శతాబ్దపువాడు) జీవితాన్ని—అతని పరిశోధనలను ఇతరవిషయాల్లో శ్లాఘించినా అతణ్ణి ఒక భౌతికవాదిగా చిత్రించరు. ఇలాగే ఎందరో తాత్త్వికులను గొప్పవారుగా అంగీకరిస్తూకూడా, వారిని భౌతికవాదులుగా మాత్రం 'దాచి' పెడ్తుంటారు.

కొందరు డిస్కార్టెస్‌వంటి అసమగ్ర భౌతికవాద తాత్త్వికుల చరిత్రలలో వారి భౌతికవాదానికి సంబంధించిన పరిశోధనలను విడిచివేస్తుంటారు.

ఈ రెండుమార్గాలూ పనికిరానిసందర్భాలలో ఎందరో భౌతికవాదులను వారి పేర్లతోసహా తమ చరిత్రలలో 'స్వాహా' చేస్తుంటారు. 18 వ శతాబ్దపు 'తత్వశాస్త్ర—సాహిత్య' చరిత్రలో మనకు డి. హాల్‌బాచ్, హెల్వెటియస్‌లవంటి తాత్త్వికులపేర్లు కనపడవు.

ఇలా ఎందుకు? ఎందువల్లనంటే భౌతికవాద చరిత్ర పరిశీలనవల్ల ప్రపంచ సమస్యలు విద్యార్థులకు తెలిసిపోయి పాలకవర్గాల ఆటలు కట్టవలసివస్తుంది. కాబట్టి పాలకవర్గ పండితులు గత 20 శతాబ్దాలనుంచీ భౌతికవాదం ఒకే స్తబ్దదశలో నున్నట్లూ, దానికి పరిణామం లేనట్లూ చెప్పి మోసగిస్తుంటారు. ఆదర్శవాదంవలెనే భౌతికవాదానికికూడా చరిత్ర ఉంది. ప్రకృతి (విజ్ఞాన) శాస్త్రం ఒక్కొక్క నూతనవిషయాన్ని కనుగొన్నప్పుడల్లా భౌతికవాదం ఒక్కొక్క పరిణామదశను చేకూర్చుకుంది.

అందుకై మనం భౌతికవాద చరిత్రను తెలిసికోవాలి. ఇక మనం వాన్ని రెండు కాలాలలో విభజిద్దాము...

1. గ్రీకు నాగరికత కాలంనుండి మార్క్సు ఎంగెల్సుల కాలంవరకు.

2. మార్క్సు ఎంగెల్సుల కాలంనుడి నేటివరకు.

ఇందులో తొలిదశ మార్క్సుకు పూర్వపుది. రెండవదశ మార్క్సుకు పిదపది. అనగా ఒకటి భౌతికవాదానికీ, మరొకటి గతితార్కిక భౌతిక వాదానికీ సంబంధించినది.

తొలిదశ:

భౌతికవాదానికీ విజ్ఞానశాస్త్రానికీ అన్యోన్య సంబంధం కలదని మనం మరచిపోరాదు. విజ్ఞానశాస్త్ర వికసన ఆధారంగానే భౌతికవాదం వికసిస్తుంది. ఇప్పటికి 2500 యేండ్లకుపూర్వం ప్రాచీన గ్రీకులకాలంలో పదార్థ విజ్ఞానశాస్త్రం భౌతికవాద విచారధారను ఉదయింపజేసినది. థేల్స్, అనక్జిమిన్స్, హిరాక్లిటస్ మొదలగు ప్రథమ భౌతికవాదులు గతితార్కిక ఆధారాలను కల్గియుండిరి. వారు చలనమూ, మార్పూ ప్రతిచోటా కలవని గమనించటమే కాక పదార్థాల అన్యోన్యాశ్రియాలనుకూడా కనుగొన్నారు.

హిరాక్లిటస్ [ 'గతితార్కిక వాద పిత అనబడుతాడు' ] ఇలా అన్నాడు "ఏదీ చలనరహితంగా లేదు. ప్రతిదీ ప్రవాహరూపంలో ఉంది. ఒకడు ఒకే నదీజలంలో రెండుసార్లు స్నానం చేయడు. ఒకటివెనుక ఒకటివచ్చే రెండుక్షణాల్లో రెండూ ఒకటి కావు. ఒకక్షణంనుండి మరొక క్షణానికి మార్పుగల్గి రెండూ వేరువేరు క్షణాలైనవి." [ఈ క్షణికవాదం భారతదేశంలో గౌతమబుద్ధునిచే అధిక ప్రాధాన్యత యీయబడ్డది. గౌతమ బుద్ధుడిని మనం భారతదేశపు ప్రధాన భౌతికవాదాచార్యుడుగా పేర్కొనవచ్చు.]

హిరాక్లిటస్ చలనాన్నీ, మార్పునూ మొదట కనుగొన్నాడు. ఇంతే కాక వ్యతిరేకతలద్వారా పదార్థాల పరిణామ భూమికనుకూడా గుర్తించాడు. ఈ తొలి తాత్వికుల భౌతికవాదం సరియైయున్నది. కాని అపరిపక్వ కాల మానంకల్ల—అంటే విజ్ఞానశాస్త్రం అప్పటికి తగు వికసనను పొందియుండని కారణాన—ఈ తాత్విక దృక్పథం కాలదోషానికీ విస్మృతిపథానికీ గురియైనది.

మరికొందరు గ్రీకు తాత్వికులుకూడా భౌతికవాద దృక్పథాలను కలిగియున్నారు. ల్యూసిపస్ అను ఆచార్యుడు తన పరిశోధనలద్వారా, తన శిష్యుడైన డెమోక్రిటస్ పరిశోధనలద్వారా అణుసమస్యను చర్చించాడు.

దాన్ని మనం మరొకచోట డెమోక్రిటస్ సిద్ధాంతంగా పరిచయం చేసి కొని యున్నాము.

ఎపిక్యూరస్ (341–270 బి.సి.) అను డెమోక్రిటస్ శిష్యుడు పాలకవర్గ తత్వశాస్త్రజ్ఞులచే అమితంగా దూషింపబడినాడు. ఇతన్ని గూర్చి "తాత్విక సూకరం లేక పంది" అని చరిత్రలో వ్రాయబడినది. ఈ ఎపిక్యూరస్ ఒక సన్యాసి యైనప్పటికీ, అతని 'అనుయాయి' అనగానే 'లంపటవాది' అని ఖ్యాతి గొల్పబడినది. [చార్వాకాదులను గురించి మన తత్వచరిత్ర కూడా వారిని భోగలాలసులుగాను, లంపటులూ తాగుబోతులూ వ్యభిచారులు వామాచారులుగా చిత్రించియుంది.] ఈ అపఖ్యాతి యంతా ఎపిక్యూరస్ భౌతికవాది యైనందు వల్లనే.

ఎపిక్యూరస్ శిష్యుడు ల్యూక్రిటస్ (బి.యస్ సి 1వ శతాబ్దం) ప్రకృతి పైన ఒక దీర్ఘ కావ్యం వ్రాశాడు. అతడు "ఈ మానవజీవితాన్ని ధ్వంసం చేస్తున్నది మత మేననీ—చావు తరువాత ఆత్మ శాశ్వతకాల దుఃఖాన్ని పొందు ననే పరలోక భయం దీనికి కారణమనీ" వ్రాశాడు "పరలోకభయం మానవులను భయగ్రస్తులను చేస్తున్నదని వ్రాశాడు. దానివల్ల ప్రపంచంలో సుఖం లోపిస్తున్నదనీ, ఈ భయాన్ని తొలగించాలనీ అందుకై ఎపిక్యూరస్ సిద్ధాంతాలు రాచబాటలనీ" ఉద్ఘాటించాడు.

పై తాత్వికులందరూ ఈ సిద్ధాంతం మానవలోకానికి అనివార్యమైనదన్న చైతన్యాన్ని కల్గియుండిరి వారు ఆదర్శవాదంతో, మతంతో ఘర్షణపడ్డారు. ఐతే, అప్పటి ఆదర్శవాద తాత్వికుడు "అరిస్టాటిల్" ప్రాచీన గ్రీకు సంస్కృతిలో అత్యంత ప్రాధాన్యతను కల్గియున్నాడు. అతడు ఆ కాలపు మానవ విజ్ఞాన సర్వస్వాన్నంతటినీ ఆవరించి ఎన్నో గ్రంధాలను వ్రాశాడు. అతని "వ్యాపక" దృష్టి అతనిప్రాధాన్యతను ఇటీవలి (మధ్యయుగ) కాలంలో వరకూ ప్రతిష్ఠించి యుంచగల్గింది. ఏ చింతకుడు కూడా అరిస్టాటిల్ ప్రభావానికి అతీతంగా ఆలోచించలేకపోయాడు. శతాబ్దాలవరకు అతని అనితరప్రభావం ఆచారక్రియంగా కొనసాగింది. అరిస్టాటిల్ వ్యతిరేకులు తీవ్ర దమననీతికి గురియయ్యేవారు. ఐతే మధ్యయుగపు అంత్యకాలంలో తిరిగి "పదార్థం" భ్రమ అనేవారికీ, పదార్థం వాస్తవికస్థితిని కల్గియున్నదనేవారికీ ఘర్షణ ప్రారం

భమైనది. 11, 12 వ శతాబ్దాలలో ఫ్రాన్సులోను, ఇంగ్లండులోను ఈ వివాదాలు తీవ్రంగా నడచినవి. మొదట ఇంగ్లండులోనే తిరిగి భౌతికవాద దృక్పథం తలనెత్తింది.

ఆతరువాత త్వరలోనే ఫ్రాన్సులోను చిగిర్చసాగింది. ఇలా 15, 16 వ శతాబ్దాలనాటికి రెండు స్పష్టమైన భౌతికవాద విచారధారలుగా (ఒకటి ఆంగ్లదేశపుదీ, మరొకటి ఫ్రాన్సుదేశపుదీ) రూఢమైనవి.

## ఆంగ్లేయ భౌతికవాదం:

నేటి ప్రయోగాత్మక విజ్ఞాన శాస్త్రానికీ, ఆంగ్లేయ భౌతికవాదానికీ జనకుడు బేకన్ పండితుడు. అతడు భౌతిక, ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాలు నిజమైన విజ్ఞానశాస్త్రమనీ, అందులోను భౌతికశాస్త్రం ప్రధానాంగమనీ సిద్ధాంతీకరించాడు.

బేకన్ ప్రకృతి పదార్థాలపై ప్రయోగాలద్వారా భౌతికశాస్త్రం ముందుకుపోవాలని వాదించాడు. అరిస్టాటిల్ యుగంలోవలె "పుస్తకాల చర్చల" పైగాక వాస్తవ ప్రపంచప్రకృతుల ఆధారంపైన పరిశోధనలు కొనసాగాలని నినాదంచేశాడు.

బేకన్ కు పూర్వం పదార్థ విజ్ఞానశాస్త్ర విద్యార్థులు ఎలా చదివేవారు? ముందు అరిస్టాటిల్ నిరూపణలను చదువుకొనేవారు. ఆపిదప ఒక మతాచార్యుడు థామస్ అక్వినాస్ బుఱ్ఱి పుస్తకాలూ అరిస్టాటిల్ పై అతనిభాష్యాలనూ చదివేవారు. చదువుచెప్పే గురువుగారు తాము స్వయంగా చెప్పేదేమీ లేకే, అరిస్టాటిల్, అక్వినాస్ భాష్యాలను కేవలం వల్లింపజేసేవారు. మధ్యమ యుగపు ఈ చదువులు కేవలం పుస్తకాల అధ్యయనాలు మాత్రమే. "పాండిత్య" పు గొడవలుమాత్రమేగా ఉండేవి.

(భారతదేశంలోను అర్థంలేకుండానే వేదాలను, మంత్రాలను వల్లించటమూ, లేక పురాణాలనూ శాస్త్రాలనూ భాష్యాలనూ గురుముఖంగా గుడ్డిగా నేర్చుకొనటమను ఆచారమే ఇటీవలివరకూ అమలుచుండేననీ, అందులో మతాధారము ప్రధానముగా పాటింపబడుచుండెననీ మనకు తెలిసినదే—)

ఈ స్థితికి తిరుగుబాటుగా బేకన్ విజ్ఞానశాస్త్రజ్ఞుల దృష్టిని బయటి ప్రపంచంవంకకు మరలించాడు.

దీనితో అసలు పదార్థాలు నిజంగా ఉంటాయా లేక భ్రాంతులా అన్న మీమాంస మళ్ళీ చెలరేగింది. బేకన్ ఈ విషయంలో మన వస్తువివేకాన్ని గూర్చి మనం వస్తువుల "స్థితి"ని కేవలం ఇంద్రియానుభూతుల ద్వారానే తెలిసికొనటం లేదన్నాడు. కాని ఆ విషయాన్ని నిర్ధారణగా నిరూపింపలేకపోయాడు.

ఆపిదప 'లాక్' అను పండితుడు మన అనుభవంనుండి ఎలా భావాలు ఉదయిస్తాయో నిరూపింప పూనుకున్నాడు. అతడు అన్ని భావాలూ అనుభవాలద్వారానే కల్గుతవనీ — కాబట్టి అనుభవాలు భావాలకు ఆధారమనీ నిరూపించాడు. (ఇతడు 1632, 1704 మధ్య జీవించిన గొప్ప తాత్వికుడు.) మొట్టమొదటిసారి మానవునికి ఒక "బల్ల"ను గూర్చిన జ్ఞానం ఎలా కల్గింది? అతడు అదివరకు మరేదో రాతినో, చెట్టుమొదలునో, బల్లకు ప్రత్యామ్నాయంగా ఉపయోగించుకొనియున్న అనుభవంవల్లమాత్రమే అంటూ లాక్ కొత్త పంథాలో వాదన సాగించాడు.

ఇంగ్లాండులో భౌతికవాదం ఇలా పరిణమించుతూ 18వ శతాబ్దపు పూర్వార్థభాగంలో ఫ్రాన్సుకు ఎగబ్రాకినది. ఇటు ఇంగ్లండులో వైరుధ్యాలు కొనసాగుతూ ఉండగా అటు ఫ్రాన్సులోను భౌతికవాదపు వెల్లువ ప్రారంభమౌతూ ఉండెను.

## ఫ్రాన్సులో భౌతికవాదం:

డెస్కార్టెస్‌తో ప్రారంభించి (1596, 1650) ఒక స్పష్టమైన భౌతికవాద విచారధార ఫ్రాన్సులోను ప్రారంభమైనది. ఈ నూతన మార్గంలో డెస్కార్టెస్ ప్రభావం మౌలికశక్తిగా పనిచేసినది. ఐతే, మన ధనికవర్గపు చరిత్రకారులు అలా వ్రాయరులెండి.

ఫ్యూడలిజంకాలంలో (మధ్యయుగం) శాస్త్రపండితులు కేవలం పుస్తకాల పండితులుగా మాత్రమే ఎలా వ్యవహరించేవారో మనమిదివరకే గమనించాము. ఈ స్థితితో డెస్కార్టెస్ పోరాటం ప్రారంభించాడు.

ఫ్యూడలిజంయుగంలో సమాజం రెండువర్గాలుగా ఉంటుంది; భూస్వాములు (దొరలు) సామాన్యరైతులుగా — ఇందులో దొరలవర్గం అన్ని హక్కులనూ కల్గియుంటుంది. రైతాంగానికి ఏ హక్కులూ ఉండవు. కాబట్టి విజ్ఞానాన్ని గడించే హక్కు అవకాశాలుకూడా పాలకవర్గాలకే అన్వయిస్తవి. సామాన్యప్రజలు అజ్ఞానులుగా ఉంచబడతారు.

ఈ స్థితితో డెస్కార్టెస్ పోరాడాడు. అతడు తెలివితేటలు ప్రపంచంలో అన్నివర్గాలలోను పంపకమైయున్నవని వాదించాడు. కాబట్టి చదువుకునేహక్కు, శాస్త్రజ్ఞానాన్ని చేకూర్చుకునేహక్కు అందరు మానవులకు వర్తిస్తుందని వాదించాడు.

అతడు "విజ్ఞానాభివృద్ధికి" తనకాలంలో యీయబడుతున్న "పుస్తకలేహ్యం" లేక అరిస్టాటిల్ అక్వినాస్‌ల ఔషధాన్ని నిరుపయోగమైనదిగా వాదించాడు. ప్రకృతిపరిశీలనయే విజ్ఞానాభివృద్ధికి రాచబాటయని నొక్కి చెప్పాడు.

డెస్కార్టెస్ 19వ శతాబ్దపు తొలిభాగంలో నివసించాడు. 18వ శతాబ్దం "విప్లవానికి" నాంది వేయనుంది. డెస్కార్టెస్ పాత క్రొత్త ప్రపంచాల యుగసంధ్యలో నివసించాడు. కాబట్టి ఒకవంక భౌతికవాద భూమికను ఆవిష్కరిస్తూ మరోవంక మతధర్మాలనూ అతడు పోషింపగోరాడు.

అతని కాలంలో వేయబడ్డ "చేతనములైన జంతువులెందుకున్నాయి?" అన్న ప్రశ్నకు మతమిచ్చే సమాధానం అనగా "అవి అలా బ్రతుకుతూ ఉండటమే కర్మసూత్రం" అన్న ధోరణికి డెస్కార్టెస్ ఇలా అన్నాడు. జంతువులు అలా బ్రతుకుతున్నాయంటే అవి "భౌతికవస్తువులు కాబట్టి" అని. అయితే, అతడు జంతువులను "అస్థిమాంసాల యంత్రాలుగా" భావించాడు. జంతువులకును తదితర కర్ర, ఇనుం యంత్రాలవలెనే ప్రాణములేదని భావించాడు.

[అబీపోర్టు రాయల్‌లో, పరిశోధనలసందర్భంలో కుక్కలకు సూదులను గుచ్చుతున్నప్పుడు డెస్కార్టెస్ శిష్యులు 'ఈ ప్రకృతి ఎంత విచిత్రంగా ఉంటుంది? ఈ కుక్కలు నిజంగానే బాధపడుతున్నాయని మన మనుకుంటాం కదా!' అని ఆశ్చర్యపోయేవారట.] జంతువులకు ఆత్మా, చైతన్యం లేవని వారనుకొనేవారు!

డెస్కార్టెస్ మతంలో జంతువులు యంత్రాలు... కాని మనిషిమాత్రం అలా కాదు. ఎందుకంటే మనిషిలోపల "ఆత్మ" నివసిస్తుందికదా!... ఈ విధంగా డెస్కార్టెస్ అటు భౌతికవాదభూమికను నిర్మాణం చేస్తూ ఇటు ఆధ్యాత్మికవాద విశ్వాసాలను సమర్థించాడు.

[ఈ వాదుకూడా దివ్యజ్ఞాన సమాజంలాంటివి మనిషికి జంతుజన్మ ఇక రాదనీ, కాని జంతువులకు మనిషిజన్మ రావచ్చనీ, మనిషికి మనిషిజన్మే మళ్ళీ వస్తుందనీ హిందూమతంలోని పునర్జన్మవాదానికి సవరణలు ప్రతిపాదిస్తుంది...]

1709 నుండి 1751 వరకు నివసించిన లామెట్రీ అనే పండితుడు జంతువులు యంత్రాలనే సిద్ధాంతాన్ని తిరగ తోడుతూ, "అలాగైతే మనిషెందుకు యంత్రంకాడూ?" అని ప్రశ్నించాడు. అతని దృష్టిలో మానవుని 'ఆత్మ' కూడా చైతన్యధర్మాలను కలిగియున్న యంత్రమేనన్నమాట.

ఈదశలో ఇంగ్లాండులోని లాక్ భౌతికవాదం ఫ్రాన్సులోకి ప్రవేశించింది. ఈ రెండింటి అనుసంధానంతో త్వరలోనే ఇంతకంటే వికసించిన భౌతికవాద స్వరూపం యేర్పడగల్గింది.

## 18 వ శతాబ్దపు భౌతికవాదం:

ఈదశలో భౌతికవాదం ఒక ఉద్యమరూపాన్ని దాల్చింది. తాత్వికులు విమర్శాత్మక సారస్వత సృష్టిద్వారా పోరాడటాన్ని నేర్చుకున్నారు. సమాజ వ్యవస్థలనూ, మతాన్నీ, గుడ్డిసాంప్రదాయాలనూ విమర్శించసాగారు. సిద్ధాంతాలకూ ఆచరణకూ సమన్వయాన్ని కల్పించబూని పాలకవర్గాలతో పోరాడసాగారు... జైళ్ళుమొదలగు శిక్షలుకూడా ఎదుర్కొన్నారు.

పై ఉద్యమానికి నాయకత్వం వహించినవాడు డిడ్రోట్ పండితుడు. (1718—1784). డిడ్రోట్నుగూర్చి లెనిన్ "ఇతడు దాదాపు ఆధునిక (సతితార్కికదశ) భౌతికవాద సూత్రాలకు సన్నిహితమైన నిష్కర్షలు చేసియున్నట్లు" గా వ్రాశాడు. "ఇతడు మార్క్స్ ఎంగెల్సులకుపూర్వపు గొప్ప తత్వశాస్త్ర పండితుడు. నూతనయుగానుసంధాత." కాని ఇక్కడ ఆవిధంగా భనికవాదుల చరిత్రలు చిత్రించవు...

డిడ్రాట్ గొప్ప విజ్ఞానకారుడు. మతాన్ని, సాంఘిక దురాచారాలను తీవ్రంగా ఖండించాడు...జైలుశిక్ష ననుభవించాడు. ఇతని "ఎలెంబర్టు డిడ్రాట్ లసంభాషణ" "రమూ అల్లుడు" "ఫేటలిస్ట్, జాక్స్" అన్న రచనలు తప్పక చదువదగినవై అతని ఘనతను వేనోళ్ళ చాటుతున్నవి.

19 వ శతాబ్దపు పూర్వార్థంలో—చారిత్రక స్థితిగతులవల్ల—భౌతికవాదం కొన్ని అవరోధాలను కల్గియుండెను. పాలకవర్గాలు మతాన్ని, ఆదర్శవాదాన్ని పోషించుటకు ఇంచుమించు అన్ని దేశాల్లో బ్రహ్మాండమైన ప్రచారాన్ని సాగించేవి.

అప్పుడు జర్మనీలో ఫర్‌బాచ్ భౌతికవాద ప్రచారాన్ని ఆదర్శవాదంలో మునిగితేలుతున్న తాత్వికులకు సవాలుగా ప్రారంభించాడు. ఇతడు క్రొత్త విషయాన్నేదీ చెప్పకపోయినా తన పూర్వుల భౌతికవాద సూత్రాలనన్నీ చక్కగా సమన్వయించి వాటికొక పూర్ణరూపాన్ని చేకూర్చాడు. ఇతని కృషి 19 వ శతాబ్దంనాటికి మార్క్స్, ఎంగెల్స్‌లకు ఎంతైనా ఉపకరించింది.

19 వ శతాబ్దం బ్రహ్మాండమైన మూడు విజ్ఞానశాస్త్ర పరిశోధనలకు దారితీసి ఫలించింది. జీవకణమును గురించిన పరిశోధన, సత్తా (స్వరూప) వికల్పం, మరియు పరిణామవాదం, (డార్విన్ సూత్రాలు) ఇవీ, ఫర్‌బాచ్ కృషీ కలిసి మార్క్స్ ఎంగెల్స్‌లనూ తన గతితార్కిక భౌతికవాద ఆవిష్కరణకు దారితీసినవి.

ఐతే, మార్క్స్, ఎంగెల్స్‌లు పై భౌతికవాద చరిత్రను గమనించారు. భౌతికవాదంలోని అసమర్థతలను నివారించారు. మంచిని చేకొన్నారు. చెడును సరిచేశారు.

ఐతే మార్క్స్ ఎంగెల్స్‌లకు పూర్వపు భౌతికవాద స్థితిలో తప్పులు ఏవి? అసమగ్రతలేవి? వాటికి దారితీసిన కారణాలేమి? మనమిక్కడ గమనించాలి. ఐతే, మార్క్స్ ఎంగెల్స్‌ల పూర్వపు భౌతికవాద స్వరూపం ఎట్టిది?...

...భౌతికవాద అభివృద్ధికి దోహదమైన ఆయా తాత్వికుల ఆయా సిద్ధాంతాలను గమనించాక మనం ఆయా సూత్రాలు ఎలా ఏమార్గంలో అభి

వృద్ధికి దోహదం చేశాయో అర్థం చేసికోకపోతే మన చరిత్ర పరిశీలన అసమగ్ర మైనదిమాత్రమే కాగలదు.

ఇక్కడ అన్ని విచారధారల సమన్వయరూపకమైన 18వ శతాబ్దపు భౌతికవాదాన్ని మనం చర్చనీయంగా తీసికొందాము. ఐతే మనం అప్పటి భౌతికవాదంలోని మరపులనూ, అసమగ్రతలనూ గమనిస్తూ... (అవీ ఏకపక్ష వాదంగా కాక సమన్వయ రూపకంగా) వాటి గుణగణాలను గుర్తుంచుకోవాలి.

భౌతికవాదం మొదట గతితార్కికరూపంలో ఉండియుండెను. అది ఆ రూపంలో వికసింప వీలు లేకపోయినది. విజ్ఞానశాస్త్ర అభివృద్ధి కొరవడి నందువల్ల ఆమార్గాన్ని తగు ఆధారాలు లేనందున విడిచివేయవలసి వచ్చింది. కాబట్టి తత్వశాస్త్ర వికసనకు మున్ముందు విజ్ఞానశాస్త్రం వికసించుట అనివార్య మైనది. ఈ క్రమాన్ని మనం బాగా జ్ఞాపకముంచుకోవాలి.

ఐతే విజ్ఞానశాస్త్రాల వికాసమే భౌతికవాదపు నేటి గతితార్కిక రూపానికి ఆధారంగా పనిచేసినది. ఆ ఆధారమే గతితార్కిక భౌతికవాదా న్ని శాస్త్రీయమైన దృఢమైన పునాదులపై నిల్పగల్గింది. కాబట్టి విజ్ఞానశాస్త్ర ఆధారమే భౌతికవాదమునకు పునాది. ఐతే ఆదర్శవాదానికి పునాది ఏమిటి?...అదికూడా మనం గమనించాలి.

ఆదర్శవాదం ఎక్కడినుండి వస్తుంది? ఆదర్శవాదం మతంలోనించి వస్తుంది. వచ్చి మతం వెంటవెంటనే ఉంటుంది...దీన్నిగూర్చి లెనిన్ "మతం యొక్క పరిష్కృతమైన లేక విలక్షణమైన తేలికైన రూపమే ఆదర్శవాదం" అన్నాడు. దీని అర్థమేమిటి? మతంకంటె ఆదర్శవాదం మతోద్దేశాలను గంభీరంగా ప్రకటిస్తుంది. ఈ ప్రపంచం పరమాత్మచేత సృష్టింపబడినదనీ— ఆ పరమాత్మ శూన్యాంధకారంలో తేలిపోతూ ఉండేననీ, ఆ దేవుడు పదార్థం కాదనీ, ఆ తరువాత అతడు ప్రపంచాన్ని 'కల్పించా' డనీ......లేక అతని మూల విరాట్స్వరూపం (మనిషి దేహంతో పోలికగలదిగాకూడా చెప్పబడు తుంది) నుండి ప్రపంచం పుట్టిందనీ—ఈ భావాలను మతం చాలా మొరటు రూపంలో వర్ణిస్తుంది. దీన్ని ఆదర్శవాదం ఈ ప్రపంచమంతా మన మనస్సు. లేక ఆత్మ యొక్క భ్రాంతిమాత్రమేనని నాజూకుగాను గూఢంగా నిరూ పిస్తుంది. ఈ రెండింటికీ పర్యవసానం ఒకటే. కాబట్టి ఆదర్శవాదం మతా నికి నాజూకైన ముసుగుమాత్రమే.

అంతేకాక ఆదర్శవాద ప్రచార్యులు తమవాదనలలో చతురమైన యుక్తి ప్రయుక్తులనూ, గడ్డు ఎదురుసవాళ్ళనూ ప్రయోగించి తికమక పరుస్తుంటారు. [బర్క్లీ వ్రాసిన ఫిలోనస్ హైలాస్ సంవాదంలో ఫిలోనస్ యుక్తివాదం ఇలాంటిదే...కుమారిల భట్టు తన యుక్తివాదంకూడా ఇలాంటి తికమక పరచేదే. కుమారిల భట్టు తన యుక్తివాదంతో బౌద్ధమతాన్ని గగ్గోలుచేసినది భారతీయ విద్యార్థులకు తప్పక పఠనీయమైనది ]

మతం ఎక్కడినుండి ?

మతాన్ని గూర్చి ఎంగెల్స్ "మతం మనిషియొక్క సంకుచిత భావాల వల్ల వచ్చింది" న్నాడు. (సంకుచితమంటే ఇక్కడ అజ్ఞానమన్న మాట.)

ఆదిమ కాలపు మానవులు రెండువిధాల అజ్ఞానానికి గురియై యుండిరి. 1. ప్రకృతినిగురించిన అజ్ఞానం, 2. తననుగూర్చిన అజ్ఞానం. ఆదిమమానవుల గూర్చి చదువునప్పుడు మనమీ రెండువిధాల అజ్ఞానాలనూ గుర్తుంచుకోవాలి.

ప్రాచీన గ్రీకు నాగరికతకాలం, అప్పటికది విజ్ఞానాభివృద్ధిగా తోచినా, ఇప్పటి మన విజ్ఞానశాస్త్ర యుగంతో పోల్చుకుంటే ఎంతో వెనుకబడియున్నట్లు తెలుస్తుంది. అరిస్టాటిల్ (అనేక శతాబ్దాలు తాత్వికుడుగా రాజ్యంచేసిన పండితుడు.) భూమికి చలనం లేదనీ, అది విశ్వగోళానికి మధ్యస్థమై యున్నదనీ, గ్రహాలు దానిచుట్టూ తిరుగుతున్నాయనీ భావించాడు. ఈ గ్రహాలు చూరుకు మేకులు గ్రుచ్చినట్లుగా నలభైయారున్నాయని చెప్పాడు. ఇదంతా ఈనాడు పిల్లలాట మాటలుమాత్రమేగా శేషించింది ?!

గ్రీకులు మూలపదార్థాలు నాల్గని భావించారు. భూమి, నీరు, గాలి, అగ్ని. [మన భారతీయులు దీనికి ఆకాశాన్నొకటి చేర్చి ఐదన్నారు] ఈ పదార్థాలు విడదీయబడ వీలులేవన్నారు. ఈనాడు విజ్ఞానశాస్త్రం ఇవన్నీ హాస్యాస్పదములుగా నిరూపిస్తున్నది. ఈనాడు నీటిని మనం రెండువాయువుల సమ్మిశ్రిత పదార్థంగాను, భూమినీ గాలినీకూడా సమ్మిశ్రిత పదార్థాలుగాను...అగ్నిని మరొకవిధమైనదిగాను తెలుసుకుంటున్నాము.

అలాగే మనిషినిగురించికూడా గ్రీకులు అజ్ఞానాన్ని ప్రదర్శించారు. ఉదాహరణకు మన ఆహారాన్ని జీర్ణంచేసే అవయవం మెదడని భావించారు.

కాబట్టి వాళ్ళ అవయవ వివేకంకూడా అసమగ్రమైనదే యైయుండెను —

ఐతే, బ్రహ్మాండమైన నాగరికతను కల్గిన గ్రీకు సంస్కృతి ఆనాటికే ఇట్లాఉంటే, అంతకుముందు వేలసంవత్సరాలుగా మానవ విజ్ఞానం ఎంత అల్ప దశలో ఉండెనో !... కాబట్టి, ఆదిమమానవుల ప్రకృతి విజ్ఞానంకాని, సమాజ విజ్ఞానంకాని చాలా అల్పదశలో నుండెను. ఐనా వారు ప్రతిసమస్యకూ ఏదో ఒక సమాధానాన్ని మాత్రం కల్పించుకొనుచుండిరి. [ఊహల ఆధారంపైన.] ...మనుష్యుని "స్వప్నావస్థ" పై వారు మనుష్యుని ద్వైయాస్తికతను సిద్ధాంతీకరించారని మనమిదివరకే గమనించాము. ఇదేవిధంగా వారు మనిషిలో "ఆత్మ" ఉందని సిద్ధాంతం లేవదీశారు. అది చావులేనిదన్నారు. [మన భారతీయులు ఈఆత్మలు మళ్ళీమళ్ళీ పుస్తూ క్రొత్తచొక్కాలవలె క్రొత్తక్రొత్త దేహాలు ధరిస్తూ వాటిని మళ్ళీ మళ్ళీ మాసినచొక్కాలవలె విడుస్తూఉంటాయని పునర్జన్మవాదాన్నే అవిష్కరించారు.]

దేహం కృశించినట్లయితే ఆత్మ పెరుగుతుందనే ఒక విచారధార పూర్వకాలంలో బాగా ప్రచారంలో నుండియుండెను. అందుకే సన్యాసులూ, మునులూ, ఋషులూ దేహాన్ని శోషింపజేసే ఆచారం యేర్పడినది. ఏకాదశి ఉపవాసాలూ, రంజాన్ నిరాహారాలూ ఇలాంటివే.

...చావుకు పిదప ఆత్మ యింకా జీవించియుంటుందన్న విశ్వాసమే ఆదిమ మనుష్యునిలో దేవతల, దయ్యాల భావనను దారితీసింది.

ఆదిమమానవులు తమ శక్తికిమించిన పదార్థాలనన్నిటినీ ప్రత్యక్ష దైవములుగా ఆరాధించారు. ఈ ప్రత్యక్ష దైవాలకంటే గొప్పవిగా అపరోక్ష లేక సూక్ష్మమైన (అగుపడక ఆత్మపదార్థమునకు సంబంధించిన) దేవతలను భావించారు.

ఇలా ప్రాచీన గ్రీకులకాలంనాటికి ఆయా పనులుచేసే ఆయా వివిధ దేవతలను కల్పించుకొని నమ్మినమానవుడు మరికొంత కాలానికి యేకేశ్వరోపాసకుడైనాడు. ఈవిధంగా "దేవుడొకడే" అనే మతాలు ప్రారంభమైనవి. (క్రైస్తవమతం, ఇస్లాం మొదలైనవి.) ఐతే, ఒకేదేవుడనుకొంటున్న నేటి కాలంలోకూడా, ఇంకా మానవుడు తన అజ్ఞానాధారమైన మత విశ్వాసాలను సడలించుకోలేకపోతున్నాడు !

...కాబట్టి ఆదర్శవాదం మనిషి అజ్ఞానంనించీ, సంకుచిత భావనలనించీ యేర్పడినట్టిది. దీనికి ప్రతియోగిగా శాస్త్ర ఆధారాలపై పరిణతి జెందినట్టిది భౌతికవాదము. తత్వశాస్త్ర చరిత్ర పరిశీలనలో మనం ఆదర్శవాదానికీ, భౌతికవాదానికీ అనవరత ఘర్షణను చూస్తాము. భౌతికవాదం అడుగడుగునా అజ్ఞానాన్ని ఓడించటానికి ముందంజవేస్తుంది. ఇదే దానిలోని ఘనతా, విశేషతయును.

## భౌతికవాదం, దాని గుణములు:

గ్రీకులకాలంలో విజ్ఞానాభివృద్ధి జరిగినది. అప్పుడు భౌతికవాదం తల నూపినది. ఇదేక్రిమంలో

1. మధ్యయుగంలో విజ్ఞానశాస్త్రం వికసింపలేదు. కాబట్టి భౌతిక వాదం వికసించలేదు.

2. 17, 18వ శతాబ్దాలలో విజ్ఞానశాస్త్రం వికసించింది. భౌతిక వాదంకూడా వికసించింది.

3. 19వ శతాబ్దంలో నూతన శాస్త్రీయసత్యాలు కనుగొనబడినవి. భౌతికవాదం మార్క్సు ఎంగెల్సులచేతులలో నూతనశక్తిని చేకూర్చుకుంది.

4. ఈనాడు విజ్ఞానశాస్త్రం బ్రహ్మాండమైన వికాసం చేకూర్చుకుంటున్నది. దానితో సమన్వయరూపంలో గతితార్కిక భౌతికవాదం శాస్త్రీయ పరిణతి చేకూర్చుకుంటూ ముందుకు సాగుతున్నది.

దీనివల్ల విజ్ఞానశాస్త్ర అభివృద్ధి భౌతికవాదానికీ, విజ్ఞానశాస్త్ర స్తంభత ఆదర్శవాదానికీ దోహదంచేస్తుందని తేలుతుంది. ఈ రెండువాదాల అన్యోన్య ఘర్షణ కేవలం పదాల-శాస్త్రార్థాల-వరకే సీమితమై లేక ఆచరణక్షేత్రంలో తీవ్రమైన పోరాటస్వరూపాన్ని దాల్చియున్నదని చరిత్ర రుజువుచేస్తుంది.

మానవ చరిత్రగతిలో సాగే ఈ అజ్ఞాన విజ్ఞానాల పోరాటం నేడు కూడా ఇంకా సాగుతూనే ఉన్నది. ఒకటి ప్రజలను అజ్ఞానావరణలో పడ వేయ ప్రయత్నిస్తుంటే మరొకటి విజ్ఞానక్షేత్రానికి లాగ ప్రియత్నిస్తున్నది.

ఒకటి మానవుణ్ణి బందీగా ఉంచ తాపత్రయపడ్తుంటే మరొకటి స్వేచ్ఛాపథానికి నడిపింప ఉద్యమిస్తున్నది— ఈ పోరాటం ఎన్నో సార్లు తీవ్రరూపాలను దాల్చింది. ఉదాహరణకు గెలీలియో జీవితాన్ని తీసుకుందాము.

అరిస్టాటిల్ వ్రాతలకూ, బైబిల్ మతానికీ భిన్నంగా గెలీలియో భూమి సూర్యునిచుట్టూ భ్రమిస్తుందని ప్రకటించాడు. "భూమి విశ్వగోళానికి మధ్యభాగంకాదు...అది విశ్వగోళంలో ఒక బిందువుమాత్రమే. కాబట్టి మనం ప్రాత అభిప్రాయాలను మార్చుకోవాలన్నా" డతడు. ఈఅపచారానికి గెలీలియోను మతాచార్యులు విచారణకు గురిచేసి, హింసించి,|చంపారు. విజ్ఞానానికీ, అజ్ఞానానికీ స్పర్థ ఇలా ఉంటుందనుట కిదొక సాదృశ్యం. విజ్ఞానశాస్త్రాన్ని అనుసరించటమే ఆదర్శవాదానికి అపచారం చేయటంగా పరిణమిస్తుందని ఈ ఉదాహరణ చాటుతుంది.

ఐతే, ఇక్కడొక క్రమాన్ని మనం గుర్తించాలి. ఈ పోరాటం కేవలం "సిద్ధాంతాల" సంఘర్షణమాత్రమే కాదు— ఇది సామాజిక రాజకీయరూపాన్ని కల్గియుంది. ఈ పోరాటంలో పాలకవర్గాలెప్పుడూ అజ్ఞానపక్షాన్నే అవలంబిస్తూ వచ్చాయి. పాలకవర్గం చూడండి. 18 వ శతాబ్దంలో భూస్వాములు పాలకవర్గాలుగా ఉంటూ ధనికవాదులను అదుపులోనుంచేవారు. అప్పుడు ధనికవాదులు భూస్వాములకు వ్యతిరేకంగా విజ్ఞానశాస్త్రాన్ని బలపరచారు— దీనిఫలితమే ఆకాలంలో "విజ్ఞాన సర్వస్వం" వెలువడటం. ఐతే ఈవాదు ధనికవాదులు పాలకవర్గాలుగా మారిపోయినారు— దానిఫలితంగా విజ్ఞానశాస్త్రాన్ని నేడు వారు తీవ్రాతితీవ్రంగా దాచిపెట్టుతున్నారు. దీనికి సాదృశ్యం హిట్లర్ ఫాసిజమే.

ఇలా మార్క్సుకు పూర్వపు భౌతికవాదం చరిత్రలో ప్రధానపాత్ర వహించినది. అది ఎంతో చారిత్రక ప్రాధాన్యతను కల్గియున్నది. విజ్ఞాన, అజ్ఞానాల ఈ పోరాటక్రమమే భౌతికవాదాన్ని వికసింపజేసినది. మతసిద్ధాంతాలకు వ్యతిరేకమైన వైజ్ఞానిక వాస్తవములను సమాజంలో వికసింపజేసినది. దాని క్రమక్రమమగు పరిణతస్వరూపమే ఆధునిక మార్క్సిజం ఆవిష్కరణకు కూడా దారితీసింది...

## మార్క్సుకు పూర్వపు భౌతికవాదంలో లోపాలు:

మనం విజ్ఞానశాస్త్రమూ, భౌతికవాదమూ ఒకదానిఆధారంపై మరొకటి వికసిస్తుందని గమనించాము. కాబట్టి భౌతికవాద చరిత్రలోని విస్మృతులు, అసమగ్రతలు ఆయా కాలాల విజ్ఞానశాస్త్రాల ఆయా స్థాయిల కారణంగా కల్గినవేనని గమనించాలి.

గ్రీకులకాలంలో భౌతికవాద విచారధార విజ్ఞానశాస్త్ర స్థాయికంటే ముందుకు పరుగెత్తినది. కాబట్టి విజ్ఞానశాస్త్రాలు తగుస్థాయికి వికసించువరకు అది స్తంభించి యుండవలసివచ్చినది. ఐతే, అందుకై 2000 యేండ్ల కాలం పట్టినది. ఈ దీర్ఘకాలంలో భౌతికవాదం ఆయా విజ్ఞానశాస్త్రాల పరిభావాలను...సారాంశాన్ని అనుసంధానం చేసికొంటూ నిల్చియున్నది.

18వ శతాబ్దంలో యాంత్రికవాదం లేక మెకానిక్సుకు సంబంధించిన విజ్ఞానశాస్త్రం సర్వోపరి ప్రాధాన్యత కల్గియుండెను. ఆ శతాబ్దంలో ఘన పదార్థాల మెకానిక్స్, నక్షత్రాల గ్రహాల మెకానిక్స్, భూ ఆకర్షణయొక్క మెకానిక్స్ పరిశోధనలు అభివృద్ధి జెందియుండెను. రసాయనశాస్త్రం, జీవశాస్త్రం, వృక్షశాస్త్రమింకా ప్రారంభదశలో నుండెను. అవికూడా యాంత్రికపరంగానే అన్వయింపబడుచుండెను. డెస్కార్టెస్ జంతువును యంత్రమంటే, 18వ శతాబ్దపు శాస్త్రజ్ఞులు మనిషిని యంత్రమన్నారు. ఈవిధంగా ఆ శతాబ్దం యాంత్రికవాద ప్రాచుర్యాన్ని కల్గియుండెను. [మెకానిక్స్ అంటే యాంత్రికవాదం.]

క్రైస్తవమతంచే అణచబడ్డ విజ్ఞానశాస్త్రం మధ్యయుగంలో తిరిగి యిలా విజృంభించి లేచింది. ఐతే, 18వ శతాబ్దపు విజ్ఞానశాస్త్రం ఈ ప్రపంచాన్నొక మహాయంత్రంగా నిరూపిస్తూ ప్రతిసమస్యనూ యాంత్రికవాద సూత్రాలతో కొలతపెట్ట ప్రయత్నించింది. పరిణామక్రమాన్నికూడా ఒక సాధారణ యాంత్రిక చలనంగా భావించింది. వచ్చినఫలితాలే మళ్ళీమళ్ళీ వస్తుంటాయని సిద్ధాంతీకరించినది. కాని ఇది పొరపాటు. అప్పటి శాస్త్రజ్ఞులు పదార్థాల యాంత్రికపార్శ్వాన్నే చూచారుకాని సజీవపార్శ్వాన్ని లక్షించలేకపోయారు. ఈ అసమగ్రతకు లోనైన భౌతికవాదాన్ని మనం యాంత్రిక భౌతికవాదమని చెప్తాము.

ఉదాహరణకు "భావానికి" ఏరేమని అర్థం చెప్పారు? మన పిత్త కోశం పిత్తాన్ని ఎలా పుట్టిస్తుందో అలాగే మెదడు ఆలోచనలను పుట్టిస్తుందని.

ఐతే, నేడు మనం దీనికి నవ్వుతుంటాము. "మన భావాలు కేవలం మెదడునుండే—ఇతర కారణాల అవసరం లేకుండా అదేపనిగా వెలువడవు కదా!...మనకు ఇలాటి భావాలు కల్గి, అలాటి భావాలు ఎందుకు కల్గకపోవటం జరుగుతున్నది? దీనికి కారణం మెదడుగాక సంఘమూ వాతావరణమూ కదా!" అని ఆక్షేపిస్తాము. ఐతే, యాంత్రిక భౌతికవాదం మన మెదడునొక యాంత్రికవిశేషంగా భ్రిమపడినదన్నమాట.

ఇక్కడ గమనించవలసిందేమిటి? రసాయనశాస్త్ర జీవశాస్త్రాల కొన్ని అనుక్రమాలతో ఈ యాంత్రికవాద సూత్రాలు కొంతవరకు సమన్వయం కాగల్గినా, అవి అంతకంటె ప్రధానమైన యితరసూత్రాల ప్రభావంవల్ల వెనుకకు నెట్టివేయబడుతుంటవి. ఈ రెండవపార్శ్వాన్ని 18వ శతాబ్దపు యాంత్రికవాద శాస్త్రజ్ఞులు గమనింపలేరు. ఇది వారి ముఖ్యలోపము.

ఈలోపంవల్ల ఆనాటి భౌతికవాదం సర్వసాధారణంగా సమాజ చరిత్ర క్రిమాన్ని విస్మరణకు గురిచేసింది. చారిత్రక అభివృద్ధినీ దాని అనుక్రిమాలనది పాటించలేదు. ప్రపంచం ముందుకుసాగుతుందనీ, గడచినదే మళ్ళీ చర్విత చర్వణంగా తిరిగి వస్తూఉండదనీ, మానవసంఘం, జంతుజాలం, జీవకోటి తమ పరిణామక్రిమంలో నిత్య నూతన స్వరూపాలను చేకూర్చుకొంటాయనీ 18వ శతాబ్దపు భౌతికవాద మప్పటికి తెలిసికోలేకపోయింది.

18వ శతాబ్దపు భౌతికవాదం సృష్టిని అనుక్రమ పరంపరగా అన్వయింపలేకపోయింది. విశ్వాన్ని అవిచ్ఛిన్న చారిత్రక అభివృద్ధిని పొందుతున్నదానిగా అప్పటి శాస్త్రజ్ఞులు గమనింపలేకపోయారు. దీనికి అప్పటి విజ్ఞానశాస్త్ర అసమగ్రతా, తోడ్తో అధి భౌతిక విధానమూ కారణమైనవి. అధి భౌతికవిధానము గతితార్కికములకు విరుద్ధమైన దృక్పథము. [ప్రకృతికి చలనం కలదని అంగీకరింపబడినా ఈ చలనం ఎడతెగని ఆత్మ ప్రదక్షిణాలరూపంలో నున్నట్లుగాను అందువల్ల ప్రతీదీ తన స్థానంలోనే ఉండి మళ్ళీమళ్ళీ అదేచోటికి వస్తూ వస్తూ ఆవేఅవేఫలితాలను కల్గిస్తుందని యాంత్రికవాదం భావిస్తుంది. అంటే

ప్రపంచానికి చలనం లేదనే అధిభౌతిక దృక్పథానికే ఇది దారితీసి భావవాదాన్ని సమర్థిస్తుంది.]

దాని మూడవ లోపం అనాసక్త ధోరణి. ప్రపంచ చరిత్రయొక్క సమాజ పరిణామంలోని మానవుని "చర్య"ల క్రమ పరంపరను 18 వ శతాబ్దపు భౌతికవాదం లెక్కకు తీసికోలేదు.

గతితార్కిక భౌతికవాదం ఊరికే ప్రపంచ స్థితిని వివరించటమే కాక దాన్ని మార్చివేయాలని బోధిస్తుంది. చారిత్రకంగా మానవుడు ప్రపంచాన్ని మార్చివేయగల ఒక క్రియాత్మకశక్తి. .మానవుడు విప్లవాన్ని సృష్టిస్తాడు. కొనసాగిస్తాడు. జయిస్తాడు. అతడు నూతనసమాజాన్ని నిర్మిస్తాడు అని నమ్ముతుంది. ఈ భావం 18 వ శతాబ్దపు భౌతికవాదంలో లేదు.

మార్క్సుకు పూర్వపు భౌతికవాదం ఇట్టి ప్రయోగాత్మకతను కల్గిలేదు. ఆ కాలంలో మానవుడు వాతావరణంచేతనే నిర్మాణం చేయబడతాడని (యాంత్రికంగా) భావింపబడినది. దీన్ని మార్క్సు "మానవుడే పరిసరాలను నిర్మాణం చేసుకుంటాడనీ, తనను తానే నిర్మాణం చేసుకోగలడనీ" సంస్కరించిచూపాడు. మనిషిపైన పరిసరాల ప్రభావం ఉన్నా — అతడు పరిసరాలను మార్చివేసి తద్వారా తనను తానుమార్చుకోగలడు. దీనికి సజీవనిదర్శనమే నేటినూతనరష్యా.

...18 వ శతాబ్దపు భౌతికవాదం పై అనాసక్తిధోరణికి గురియగుటకు కారణం అది చరిత్రక్రమాన్ని గుర్తించకపోవటమేననీ, అనగా అప్పటికి అధిభౌతిక యోచనాక్రమంలోతప్ప మరోవిధంగా ఆలోచించే అవకాశాన్నిచ్చే తత్వశాస్త్ర వికసన జరుగకపోవటంవల్లనేననీ ఇక్కడ గుర్తింపబడాలి. ఇక ముందు ప్రకరణంలో మనం అధిభౌతిక విధానాన్ని పరిశీలించగలము.



# అధి భౌతిక విధానం; దాని విశ్లేషణ.

18 వ శతాబ్దంలో భౌతికవాదం అధి భౌతిక విధానానికి లోనైయున్న దని మనం పైన చదివాము. ఈ అధి భౌతిక భౌతికవాదం నేటి మార్క్సిస్టు లేక గతితార్కిక భౌతికవాదానికి వ్యతిరేకమైనదని తెలుసుకున్నాము. ఇక మనం అధి భౌతిక విధానాన్ని పరిశీలిస్తూ, దానికి గతితార్కిక విధానంతో గల ముఖ్య విభేదాలను ప్రత్యేకంగా గమనించాలి.

"పదార్థ పరిశీలనకూ దాన్నిగూర్చి ఆలోచనకూ పాతమార్గమే అధి భౌతిక విధానం." ఎంగెల్స్.

ఇక్కడ మనమొక విషయాన్ని ముందు తెలిసికోవలసియుంది.

మనలో సర్వసాధారణంగా చలనానికి ముందొక స్థిరస్థితి ఉంటుందనే భావం సహజం. ఏదైనా ఒక వస్తువు చలనాన్ని పొందకముందు స్థిర స్థితిని కల్గియుండాలికదా! అనుకోవడటం సహజం. బైబిల్ కూడా అలాగే సృష్ట్యాదిలో దేవుడు ప్రపంచాన్ని సృష్టించినకాలంలో అది స్థిరస్థితిలో నుండె ననే చెప్తుంది...

...చలనపదాన్ని మనం సాధారణంగా "మార్పు"గా వాడుతుంటాము. చలనం అంటే ఒకవస్తువు ఒకస్థలంనుండి మరోస్థలానికి మారటము. కాని, ఒక వస్తువు ఆకారం మారిపోవటంకూడా మార్పే. ఒక అమరాలిన చెట్టులో వచ్చేది ఇట్టిమార్పు. ఒక రాయిపైనుండి క్రిందపడటం స్థలం మార్పు; ఐతే, ఇప్పుడీ రెండుమార్పులనూ మనం ఒకటిగానే తీసుకుందాము. ఐతే, గతి తార్కికాలను చదువునప్పుడీ రెండుమార్పులనూ మనం తిరిగి ప్రత్యేకంగా విడిగా పరిశీలింపవలసివస్తుంది.

సర్వసాధారణంగా మనం చలనాన్నిగాని, మార్పునుగాని దృష్టిలో నుంచుకొనక వస్తువుల అచల స్థితి లేక మార్పులేని స్థితినే లెక్కిస్తుంటాము.

మనం ఒక ఎఱ్ఱ చెప్పులజత కొన్నామనుకోండి. అది కొన్ని సార్లు బాగుచేయబడి, పాతబడి, అతుకులు వేయబడి, అడుగులు మార్చబడినా మనం "ఆ" చెప్పులనే వేసుకుంటున్నట్లుగా భావిస్తుంటాము. మన దృష్టిలో ఎల్లప్పుడూ అవి "ఆనాడు కొన్న బాపతు, ఆ చెప్పులే" అనిపిస్తాయి. ఐతే, ఈ ప్రవృత్తి తత్వశాస్త్ర పరిభాషలో అవికల్పసూత్ర మనబడుతుంది. అవికల్ప సూత్రమంటే చలనాన్ని అచలంగాను, మార్పును అవికల్పంగాను భావించట మన్నమాట.

ఈ పునాదిపైనే ప్రపంచ నిర్వచనంకూడా చేయబడినప్పుడు సృష్టి మార్పు లేక చలనం లేనిదిగా భావింపబడుతుంది. అలాగే ప్రకృతి, సమాజం, భావం విషయంకూడా. ఇలా 'మార్పు జరగద'ని భావింపబడటంవల్ల "దేవుని సృష్టియంతా ఎల్లకాలమూ ఒకే అచలస్థితి లేక స్థితిస్థితిలో ఉంటుంద" నికూడ భావింపబడుతుంది. అంటే ప్రకృతిలోని సృష్టి, రాళ్ళు-రప్పలు, ధాతువులు చెట్లూ-చేమలూ, జంతువులూ-మనుష్యులూ ఎల్లకాలాలలోను అవి మనముందీనాడున్నట్లే ఇలాగే ఉండునట్లు భావింపబడుతుందన్నమాట. ఐతే, మన యీ సామాన్య భావనవల్ల పాలకవర్గాలు పూర్తిలాభం పొందుతవి. అంటే ఈ అవికల్పసూత్రాన్నవి పూర్తిగా వినియోగపరచుకొంటాయన్నమాట.

సామ్యవాదాన్ని విమర్శించేటప్పుడు సామాన్యంగా ఇలా వాదింపబడుతుంటుంది. 'మనిషి దురాశాపూరితుడు. అతనికి అదుపాజ్ఞలుకూడా అవసరం. అతని స్వార్థాన్ని నొక్కిపట్టటం అనివార్యం. లేకపోతే, అరాజకం తాండవిస్తుంది.' అని. దీని అర్థం తీరా సామ్యవాద భావాలు మంచివి కావనే. ఈ విమర్శలో కొలతబద్ద ఏమిటి? అవికల్పసూత్రమే. మనిషి ఎల్లప్పుడూ ఒకే ప్రవర్తన లేక నైజాన్ని కల్గియుంటాడనీ, అతని స్వభావం మారదనీ, అనుకోనటంద్వారా అధి భౌతికవిధానంపై విశ్వాసానికి ఆధారమైంది.

"ఒకవేళ సామ్యవాదం యేర్పడితే, (అంటే మనిషి చేసే పనిదృష్ట్యా కాక అతని అవసరాలదృష్ట్యా అతనికి ప్రతిఫలం లభించేతీరుకు) అప్పుడు ప్రతివాడూ తన సహజగుణమగు పేరాసవల్ల గొంతెమ్మకోరికలతో పోటీ పడతాడు. కాబట్టి, అలాంటిసమాజం నిల్వదు." అని పై విమర్శ ఆంతర్యం. ఐతే, రాబోవు సామ్యవాదసమాజంలో నివసించే భావిమనుష్యులకూ, ఈ నాటి

సమాజంలో నివసిస్తున్న నేటిమనుష్యులకూ భేదం ఉండదని ఇక్కడ "అవికల్పం" గా భావింపబడినది. నేటిసమాజం మారి సామ్యవాద సమాజంగా రూపొందునప్పటికి అప్పటి సమాజ స్థితిగతులుకూడ మారిపోయి, మనుష్యుడు మార్పుకు గురియౌతాడన్న విషయం ఇక్కడ గుర్తింపబడలేదు.

ఇంకొక ఉదాహరణ. "రష్యాలో ఒక కార్మికునికి అతని పనివల్ల ఉత్పత్తి ఆయ్యే మొత్తంఫలితం లభించదుకదా! అంటే అతనికి లభించే ప్రతిఫలం పోగా ఉత్పత్తి చేయబడ్డ కొంతఫలితం మిగిలియుంటుందికదా! ఐతే, శ్రమ యొక్క విలువలో కొంతభాగమే అతనికి లభిస్తుందన్నమాట. ఇతరదేశాల లోను అలాగే జరుగుతూఉన్నది. ఇక ఇతరదేశాల కార్మికులకూ, రష్యా కార్మికులకూ భేదమేమిటి?"

ఈ ఉదాహరణలో అధి భౌతికవాద మెక్కడుంది! అసలు రష్యా సమాజం సామ్యవాద సమాజమనీ, ఇతరదేశాలది అలా కాదనీ ఈ రెండు సమాజ వ్యవస్థలూ వేరువేరనీ విస్మరింపబడినది. శ్రమవిలువలో కార్మికునికి లభించేభాగం ఉభయత్రా కొంతమాత్రమే అన్నది నిజమే. కాని ఈ మిగులుబడి ఇతర దేశాల్లో కొందరు పెట్టుబడిదార్లకు లేక వ్యక్తులకు చెందుతుంది. కాని రష్యాలో యంత్రాలు వ్యక్తులవి కాక, కార్మికుడూ, యంత్రాలూ కలిసి చేసే ఉత్పాదనలో కార్మికుని వేతనంపోగా మిగులుబడి వర్గరహితసమిష్టికి లేక సాముదాయకరూపకమైన సమాజానికి చెందుతుంది. ఇలా మౌలికంగానే భేదం ఉంది. కాని, అది పాటింపబడలేదు.

పై ఉదాహరణలో ఎందుకు లోపం కల్గింది!...అధి భౌతిక విధానం యొక్క ప్రత్యేకతయగు (మార్పును గుర్తించకపోవటం లేక తక్కువ అంచనా కట్టటమను) అవికల్పసూత్రం వల్లనే. మారుతున్న పరిస్థితులు మార్పు లేనట్లుగా చూడబడటమే ఈలోపం—

మనం జనవరి 1935 లో కట్టిన ఒక ఇంటిని చూస్తామనుకొండి. మనం దాన్ని అదేయిల్లుగా జనవరి 36 లోను, 37 లోను, 38 లోను, పిదప ప్రతి యేటాను లెక్కిస్తుంటాము. ఆ యిల్లు అవేగదులతో, అవేతలుపులతో, అవే కిటికీలతో మార్పులేనిదిగా, అదేయిల్లుగా, అవికల్పంగా మనచే వ్యవహరింప

బవుతుంది. ఇలా మనదృష్టిలో ఎప్పుడూ ఆ యిల్లు ఆయిల్లుగా నే ఉంటుంది. మార్పుకు గురి కాదన్న మాట. ఇలా మనం యోచించుటకు మూలం అవికల్ప సూత్రమే.

## అవికల్పసూత్రంవల్ల పరిణామాలేమిటి?

మనం వస్తువులను మార్పులేనివిగా లేక అవికల్పమైనవిగా చూస్తాము. కాబట్టి మనం ఇలాఅంటాము. "జీవనం-జీవనము. మరణం-మరణము." అంటే, జీవనం జీవనంగాను, మరణం మరణంగాను ఉంటుందని విశ్వసిస్తామన్న మాట.

పదార్థాలను ఇలా అవికల్పంగా చూచే అలవాటువల్ల మనం వాటిని ఒక దానినుండి మరొకటి ప్రత్యేకిస్తాము—మనం ఒక కుర్చీ అన్నామనుకోండి. అలా అనటంలో మనం "కుర్చీయే కుర్చీ—కుర్చీకానిది మరొకటి;" అని ప్రత్యేకరూపంలో విడదీస్తాము.

ఇలాగే గుఱ్ఱం. "గుఱ్ఱమే గుఱ్ఱం—గుఱ్ఱంకానిది మరొకటి." అని విడదీస్తాము. ఇట్లే ప్రతివస్తువునూ ప్రత్యేకిస్తాము. ఈ ప్రపంచం అనేక భిన్నభిన్న వస్తువుల స్థిరమైన అమరికగా గణిస్తాము. ఇది అవికల్పసూత్రప్రు ప్రసారమన్న మాట.

## రెండవ ప్రత్యేకత—వర్గీకరణసూత్రం:

మనం ప్రతివస్తువును దేనికదే విడివిడిగా ఉన్నట్లు చూస్తాము. ఇది కూడా ఒక అభ్యాసముగా పరిణమిస్తుంది.

మనం ఒక గాడిదనూ ఒక గుర్రాన్నీ చూస్తామనుకోండి. వాటిని అన్యోన్య సంబంధంలేని రెండు విడివిడి జంతువులుగా చూస్తాము. ఈ రెంటి లోగల అన్యోన్య సాపత్యాన్నిగూర్చి మనం ఆలోచించము. గుఱ్ఱము గుఱ్ఱమూ, గాడిద గాడిదా అని, వాటికి సంబంధంలేదని అనుకుంటాము.

పూర్వం జంతుశాస్త్రంకూడా ఇట్లాగే యోచించేది. ప్రతిజంతువునూ ఒకదానినుండి మరొకదాన్ని విడదీస్తూ, వాటి సంబంధాలను గమనించకుండా విడివిడిగా వర్గీకరించేది. ఇది అధిభౌతిక విధానాన్నవలంబించినఫలితమే.

ఇలాగే పాఠకవర్గాలు విజ్ఞానశాస్త్రాన్ని విజ్ఞానశాస్త్రంగానూ, తత్వశాస్త్రాన్ని తత్వశాస్త్రంగానూ, రాజకీయాలను రాజకీయాలుగాను దేనికది విడివిడిగా, అన్యోన్యసంబంధం లేనిదిగా తీసికోబడాలని వాదిస్తుంటవి.

అంటే ఒక విజ్ఞానశాస్త్రజ్ఞుడు విజ్ఞానశాస్త్రజ్ఞుడుగామాత్రమే ఉండాలనీ, ఒక తాత్వికుడు తాత్వికుడుగామాత్రమే ఉండాలనీ, ఒక రాజకీయజ్ఞుడు రాజకీయజ్ఞుడుగానే ఉండాలనీ; ఇవ్వన్నీ ఒకదానితో ఒకటి కలపబడకూడదనీ భావింపబడ్తుంది. ఈ భావనకు కారణంకూడ అధిభౌతిక విధానమే.

ఒకసారి ప్రఖ్యాత రచయిత హెచ్.జి.వెల్స్ మాక్సిం గోర్కీని కలుసుకున్నాడు. వెల్స్ గోర్కీతో రాజకీయాలతో సంబంధంలేని ఒక సాహిత్య సమితిని నడుపుదామని సూచించాడు. దానికి అక్కడున్న గోర్కీ, అతని మిత్రులూ నవ్వసాగారు. వెల్స్ భావం సాహిత్యకారుడు సమాజానికి విడిగా ఉండేవాడని. కాని వాస్తవజీవితంలో ఒక రచయిత సమాజానికి వెలుపల విడిగా ఉండేవాడు కాడని గోర్కీకి తెలుసుకదా !...

మనం సామాన్యజీవితంలో అభ్యాసగతంగా వస్తువులను వర్గీకరిస్తాము. విడదీస్తాము. దేనికదే ప్రత్యేకంగా వాటిని పరిశీలిస్తుంటాము. ఇలాగే సమాజమూ ప్రభుత్వమూకూడ. "సమాజం వేరు, ప్రభుత్వం వేరు" అని సామాన్యంగా వర్గీకరింపబడుతుంది. కాని మార్క్సిస్టులు ఈ రెంటినీ విడదీసి ఆలోచించకూడదు...

అట్లాగే 'మనుష్యుడు.' ఒక మనిషినిగురించి మనం ఆలోచించునప్పుడు ఇతర మనుష్యులతో విడిగా ఆలోచిస్తాము. ఏ మనిషి కా మనిషిగానే చూస్తాము. పరిసరాలనూ, సమాజాన్నీ గుర్తుంచుకోము. ఇది లోపం. అలాగే ఒక యంత్రం. యంత్రం పారిస్‌లోను ఉత్పత్తిచేసి కార్మికుని శ్రమ ఫలితాన్ని పెంచుతుంది. రష్యాలోను పెంచుకుంది కాబట్టి యంత్రంఅంటే ఒకటే. "ఇదే అదీ, అదే ఇదీ" అంటూ సమాజంతో సంబంధం లేకుండా మనం ఆర్థికాలను వ్యాఖ్యానిస్తుంటాము.

ట్రేడ్ యూనియన్లూ, విద్యార్థిసంస్థలూ రాజకీయాలకు అతీతంగా ఉండాలనేవాదంకూడా యిట్లాంటిదే. ఇందులోకూడా దేనికది అనే వర్గ

కరణసూత్రం అమలౌతున్నది. మనం ఇలాంటి పరిభాషకి బాగా అలవడి యున్నాము. సర్వసాధారణమైన మన ఈ అలవాటువల్ల వస్తువులను విడివిడిగా వర్గీకరించుకుంటున్నాము... ఈ వర్గీకరణ ఆధిభౌతిక విధానంవల్ల వచ్చినదే.

## మూడవ ప్రత్యేకత—శాశ్వతీకరణసూత్రం:

వైవిధంగా వస్తువులను చలనం లేక మార్పులేనివిగా భావిస్తూ మనం వాటిని విడివిడిగా అన్యోన్యసంబంధం లేనివిగా వర్గీకరణ చేస్తున్నాము. ఇది లోపముతో కూడియున్నదే. ఐతే, అవిధంగా పదార్థాలను చూడటంవల్ల మనం మరొక నిర్ణయానికికూడా వస్తున్నాము. అదికూడా ఆధిభౌతిక విధాన ఆధారంవల్లనే.

మనం వస్తువులను స్వచ్ఛంద, నిర్వికల్ప శాశ్వత విభాగములుగా నిర్ణయిస్తాము. ఇదే ఆధిభౌతిక విధానంయొక్క మూడవ ప్రత్యేకత.

ఒక ఉదాహరణ: మనం సమాజంలో ధనికవర్గమూ, శ్రామికవర్గమూ ఉన్నదని విభజిస్తాము. ఈ విభజనను ఒక ఆధిభౌతికవాదీ, ఒక మార్క్సువాదీ ఉభయులూ అంగీకరిస్తారు. కాని ఈ యిరువురి విభజనదృష్టిలోనూ చాలా భేదమున్నది. ఈ విషయంలో ఆధిభౌతికవాది ఇలా ఆలోచిస్తాడు.

"ధనికులూ బీదలూ ఉన్నారు." అనగానే "ఔను. ఉన్నారు. ధనికులూ బీదలూ ఎల్లప్పుడూ ఉంటున్నారు. ధనికులూ బీదలూ ఎల్లప్పుడూ ఉంటారు." అంటాడు ఆధిభౌతికుడు—ఈ రెండువర్గాలూ వేటికవే ఉండేవి. ఎల్లప్పుడూ ఉండేవి. మార్పులేకుండా ఉండేవి అని అతడు శాశ్వతీకరిస్తాడు.

పైన్న ఆధిభౌతికవాది చేసిన లోపమేమిటి? అతడు ధనికుల బీదల "ఉనికి"కి ఆధారాన్ని పరిశీలింప ప్రయత్నింపలేదు. ఈ రెండువర్గాల సంబంధాలను గమనించిచూడలేదు. వర్గసంబంధాలకు అతీతంగా, ఉభయ వర్గాలను విడివిడిగా ప్రత్యేకించి, ఈ రెండువర్గాలకూ మధ్య అటలమైన గోడలు పెట్టివేసినాడు....

సమస్యపతదు గాడిదకూ గుఱ్ఱానికీ సంబంధ 'బంధము' ఉండదనే ధోరణిలోనే సిద్ధాంతీకరించాడు. అలాగే విజ్ఞానశాస్త్రంయొక్క వివిధ శాఖలు. అధిభౌతికవాది వాటిని దేనికి దాన్ని ఒకదానితో సంబంధంలేని మరొకటిగా వర్గీకరిస్తాడు. ఈ విధానపు లోపాలోపాలను మనం ముందు పరిశీలింపగలము. కాని పై మూడుసూత్రాల ఫలితమేమిటో మనమిప్పుడు గమనించాలి.

## నాల్గవ ప్రత్యేకత—వ్యతిరేకతల విరుద్ధత:

మనమిదివరకే గమనించినట్లుగా, "బ్రతుకు బ్రతుకు, చావు చావు" అనుకోబడటంలో బ్రతుకుకూ చావుకూ ఒకదానితో మరొకదానికి పోలిక లేదనీ, ఒకటికి మరొకటి అన్నివిధాలా విరుద్ధమనీ అధిభౌతికవిధానం చెప్తుంది. బ్రతుకునూ చావునూ ఒకటినుండి మరొకటిని పూర్తిగా విడదీసి బ్రితుకును బ్రితుకుగాను, చావును చావుగను ఈ విధానం విడదీస్తుంది.

ఒక బ్రతికియున్నవాడు చనిపోయాడనుకోండి. చచ్చిన మరుక్షణంలో అతణ్ణి బ్రతుకునుండి విడదీయటం జరుగుతుంది. ఒక మనిషి ఒకప్పుడే బ్రతికిన చచ్చిన ఉభయస్థితులలో ఉండటానికి వీలులేదుకదా!... చావూబ్రితుకూ విరుద్ధవిషయాలుగనుక వాటినెలాగూ కలవకుండా విడదీయటం అధిభౌతిక విధానంలో అనివార్యం.

మనం ఒకవస్తువునుండి మరొకదాన్ని ప్రిత్యేకమైనదాన్నిగా చూడటమేకాక ఈ రెండువస్తువుల "విరుద్ధతలను" సిద్ధాంతీకరిస్తాము. ఇదే అధిభౌతికవిధానపు నాల్గవలక్షణం.

ఈ సూత్రం విరుద్ధతను నిరూపించి, ఒకేసమయంలో, ఒకేచోట విరుద్ధతలు కలిసియుండరాదని శాసిస్తుంది. ఉదాహరణకు బ్రతుకూ, చావూ. ఇవి ఒకటికొకటి వ్యతిరేకములు. ఈ రెంటికీ మధ్యస్థమైన మూడవస్థితి లేదు. అని అటోయిటో తేల్చివేస్తుంది. కాబట్టి మనం దీన్నోదాన్నో అసందిగ్ధంగా ఒప్పుకోనితీరాలి. ఈ రెంటికిమధ్య మూడవదనే వ్యాఘాతం. అది దోషం; కాబట్టి అసంభవం. అలాగే,

ఉదాహరణ: ప్రజాస్వామికవిధానమూ, నియంతృత్వవిధానమూ తీసుకుందాం. వెంటనే అధిభౌతిక విధానం "ఇది ఇదిగానూ, అది అదిగానూ" నిర్ధరించి సమాజాన్ని మీకు "యిదికావాలా? అదా?" అంటుంది. ప్రజాస్వామ్యం నియంతృత్వంకాదు, నియంతృత్వం ప్రజాస్వామ్యంకాదు. మనం ఈ రెంటిలో ఏదో ఒకటే (యథాతథంగా) స్వీకరించితీరాలి. లేదా, మనం వ్యాఘాతాన్ని, అక్షరహిత్యాన్ని, అసంభవాన్ని ఎదుర్కోవలసి యుంటుందన్నమాట!

వ్యతిరేకతలంటే అధిభౌతికవిధానపు ఈ నాల్గవ సూత్రానికి చాలా భయము.

ఐతే, ఒక మార్క్సిస్టు ధోరణి యిట్లా ఉండదు. ఒక మార్క్సిస్టు శ్రామికవర్గ నియంతృత్వం, "ఒకేసమయంలో, ప్రజా సముదాయ నియంతృత్వమనీ, పీడిత ప్రజల ప్రజాస్వామ్యమనీ" సమన్వయిస్తాడు.

అతడు చేతన పదార్థాల "బ్రతుకు" జీవకణాల ఎడతెగని అంతర్గత ఘర్షణమూలకమనీ, ఒక జీవకణంలో తద్వ్యతిరేకమైన మరో జీవకణం పుట్టి పెరగటం, పాత జీవకణం తాను నశిస్తూ క్రొత్తదాని వృద్ధికి దారితీయటం, ఆ క్రొత్త జీవకణంవృద్ధి పూర్తికాగానే (పాత జీవకణం అంతరించగానే) తిరిగి దాని వ్యతిరేక జీవకణం దానిలోను ఆవిర్భవించటం...తిరిగి ఘర్షణ...తిరిగి క్రొత్త జీవకణం వృద్ధి; పాతదాని చావు; తిరిగి క్రొత్తజీవకణం చీలి దానిలో మరొక వ్యతిరేక జీవకణ ఆవిర్భావం...ఈక్రమంలో జీవకణ పరిణామం కొనసాగుతుంటుందనీ.-అనగా చావులో బ్రతుకు, బ్రతుకులో చావుఅంశం గర్భితమైయుందనీ విజ్ఞానశాస్త్రాధారంతో వాదిస్తాడు. కాగా, అప్పుడే మరణించినదేహం (శవం) లో కొంతకాలంవరకు జీవకణాలింకా సజీవమయ్యేయుంటవి. మరణంకూడా క్రమక్రమంగా వస్తుంది. ఇంతేకాక ఒకశవంలోనుండికూడా, అది అలాగే ఉంచబడితే, కొన్ని ఇతరప్రాణులు ఉద్భవిస్తాయి. కాబట్టి చావూ బ్రతుకూ అన్యోన్య విరుద్ధమైన రెండు విడివిడివిషయాలూ, రెండు విరుద్ధతలమధ్య అఘాతం విధిగా ఉండవలసినసమస్యలూ కావని ఒక మార్క్సిస్టు నిరూపిస్తాడు.

పర్యవసానం:

అధిభౌతికవిధానపు పై నాల్గులక్షణాలు మనం పదార్థాన్నొక ప్రత్యేక దృక్కోణంనుండి చూచుటకును, ఒక ప్రత్యేక విధానంలో ఆలోచించుటకును దారితీస్తున్నవి. ఈ విధానానికొక 'తర్కశాస్త్రం' కూడా ఉంది. దాన్ని మనం ముందు గమనింపగలము. మొత్తంమీద ఈ విధానం మనం ఒక నిర్దిష్టవిధంలో ఆలోచించుటకు, చూచుటకు, పరిశీలించుటకు, విశ్లేషించుటకు దారితీస్తున్నదన్నదే ఇక్కడ గమనార్హం.

పై నాల్గుసూత్రాలూ ఇలా ఉన్నవి.

1. పదార్థాలు "స్థితదశ" లో (చలనం లేక మార్పులేనివిగా) అవికల్పంగా చూడబడుతవి.

2. పదార్థాలు ఒకటినుండి మరొకటి వేరుచేయబడుతవి—వాటి పరస్పర సంబంధం తొలగింపబడ్తుంది.

3. పదార్థాల విభాగం శాశ్వతమైనదిగా, అటలమైనదిగా భావింపబడ్తుంది.

4. వ్యతిరేకల విరుద్ధతద్వారా ఒకేసమయంలో, ఒకేవస్తువులో విరుద్ధత నివారింపబడ్తుంది.

ఐతే, మనం ఉదాహరణలద్వారా పై నాల్గుసూత్రాలు "వాస్తవం" పై ఆధారపడిలేవని ఇదివరకే గమనించియున్నాము.

ఇక, సృష్టి, సమాజమూ పైసూత్రాలకు అనుగుణ్యంగా ఉన్నవా? ప్రకృతిలో వస్తువులు చలనమూ మార్పూ లేనివిగా ఉన్నాయా! లేవు. మనం పదార్థాలలో చలనాన్నీ మార్పునూ ఎల్లప్పుడూ చూస్తూ నేఉన్నాము. కాబట్టి ఈ సూత్రాలు ప్రాకృతికవస్తువుల వాస్తవిక స్థితిగతులకు సంబంధించినవిగా లేవు. ఐతే, ఈసూత్రాలు లోపాన్ని కల్గియున్నవా? ప్రకృతియా?... ఈ సూత్రాలేకదా?

తత్వశాస్త్రాన్ని మనం ఎలా నిర్వచిస్తున్నాము? తత్వశాస్త్రం "విశ్వ ప్రకృతిని, పదార్థాలను, మానవుణ్ణి" బోధిస్తుందని. ఆయా విజ్ఞానశాస్త్రాలు ఆయా ప్రత్యేకసమస్యలను బోధిస్తవి. తత్వశాస్త్రం ఆయా శాస్త్రాలన్నిటి

ఆధారంపై సువ్యాప్తమైన ప్రకృతిసమస్యలను బోధిస్తుంది. కాబట్టి అది విజ్ఞాన శాస్త్రాల సామూహికమైన కూడలి...అని.

ఐతే, ఆధిభౌతిక విధానంకూడా ప్రకృతిని, మానవుణ్ణి, భావాన్ని—అన్ని సమస్యలను ఆవరిస్తుంది. ఇదికూడా ఒక తత్వశాస్త్రరూపమే. కాని ఈ విధానం యే ఆధారంపైన తన ప్రసరణను కల్గియుంది?

"ఒక ఆధిభౌతికునికి వస్తువులస్థితులూ, వాటినిగూర్చిన తన మానసిక భావాలూ విడివిడిగా ఉంటాయి. ప్రపంచ ప్రకృతిని ఒకదానినుండి మరొకటి దూరంగా, ఒకదానికిపిదప మరొకటిగా; ఏవస్తువుకావస్తువుగా, స్థిరరూపకమైనదిగా, నికరంగా ఆధిభౌతికవాది నిర్ణయించాలి. అతని నిర్ణయం "ఇటో, అటో" స్పష్టంగా తేల్చివేయాలి. ఇది ఇదనీ, అది అదనీ తేలిపోవాలి. ఉండటమో, ఊడటమో నిర్ణయం కావాలి. ఒకటికొకటి పొత్తులేకుండా విడిపోవాలి. అదేకారణం, అదేఫలితాన్ని నిరూపించాలి."—ఎంగెల్స్.

ఈ విధంగా ఆధిభౌతికవాదం ఇన్ని గుదిబండలకు గురియైయున్నది. ఈ విధానం ప్రపంచాన్ని "వస్తువుల స్థిరమైన ఒక అమరిక" గా భావిస్తుంది... ఈ విధానం ప్రకృతినీ, సమాజాన్నీ, యోచనాక్రియన్నీ ఎలా నిర్దేశిస్తుందో ఇక మనం గమనించాలి.

## ఆధిభౌతిక దృక్పథంలో ప్రకృతి:

ఆధిభౌతికవిధానం ప్రకృతిని స్థిరముగా అమర్చబడియున్న పదార్థముల శాశ్వతమగు ఒక చక్రంగా భావిస్తుంది. ఇందులో తిరిగి రెండువిధానాలు. ఒకవిధానం ప్రపంచానికి 'చలనం' లేదనీ, ఆ చలనం మన ఇంద్రియముల భ్రాంతియనీ. కాబట్టి ఈ భ్రమను తొలగించుకుంటే ప్రకృతికి చలనముండదంటుంది. (ఇది ఆదర్శవాదం) ఇది ఇల్యాటిక్ అను గ్రీకుతాత్వికుని దృక్పథం. ఐతే, వాస్తవానికి ఈ సిద్ధాంతం చాలా దూరమైయున్నది. అందుకై ఇది ఈరోజుల్లో అడుగున పడిపోయింది.

రెండవవిధానం—ప్రకృతినిగురించినది—కొద్దిగా క్లిష్టమైనది. ప్రపంచానికి చలనం ఉన్నది. కాని అది యాంత్రికచలనమని ఈవిధానంభావిస్తుంది.

నిజానికిది ఆధిభౌతిక దృక్పథంకాక యాంత్రికవాద దృక్పథము—ఇవీ పొరపాటే. 17, 18 వ శతాబ్దాల భౌతికవాదులు ఈ లోపానికి గురియైవారని మనమిదివరకే గమనించాము. యాంత్రికచలనమంటే కేవలం స్థానపు మార్పు మాత్రమేనని భావం. అదీ, లెక్కలోకి రానిదనికూడ.

ఇదేవిధంగా గ్రహగోళచలనంకూడా యాంత్రికచలనమనీ, అంటే, కేవలం స్థలం మార్పుమాత్రమే కాని, వస్తుస్థితిలోకాని, ఆకారంలోకాని వచ్చే మార్పు కాదనీ భావించబడ్తుంది. [ఈ విధంగా ఆధిభౌతిక దృక్పథపు అదే "భూమి" అనుకునే అవికల్పసూత్రానికే ఈ యాంత్రికవాదం తిరిగి సమన్వయమైపోతుంది ]

వాస్తవంలో విషయం అంత తేలికైనదికాదు. ఉదాహరణకు భూమి తిరుగుతుంది. ఐతే అది కేవలం స్థలంమార్పేకాదు. తిరుగుతూ తిరుగుతూ భూమి మార్పుకు గురౌతుంది. పరిణతిలోనౌతుంది. కాబట్టి ఇక్కడ కేవలం చలనమేగాక మార్పుకూడ జరుగుతుందని స్పష్టం.

కాని ఆధిభౌతికవాదం ఇలా అంటుంది. "భూమి సూర్యునిచుట్టూ తిరుగుతుంది. ఎడతెగకుండా తిరుగుతూ ఉంటుంది. కాని దాని స్థితిలో మార్పురాదు. అది అవికల్పస్థితిని కల్గియుంటుంది. అది అనాదిగా తిరుగుతూ ఉన్నది. అనంతంగా తిరుగుతూ ఉంటుంది. ఏదీ జరుగనట్లుగానే అది అలాగే అదేపనిగా తిరుగుతూ పోతూ ఉంటుంది." ఈ వాదంలో భూమి తిరుగటానికొక చరిత్రలేదు. భూగోళ పరిస్థితిలో యుగయుగాలుగావచ్చిన మార్పులక్రమం గమనింపబడదు. కావున పరిణామశాస్త్రానికీవాదం అసంబద్ధమైనది.

అరగని లోహాలతో చేయబడ్డ ఒకగడియారం అదేపనిగా ఎల్లకాలమూ నడుస్తూ పోతుంటుంది. దానికి చరిత్ర ఉండదు. డెస్కార్టెస్ ప్రపంచం కూడా అలాగే తిరుగుతూ ఉంటుందని భావించాడు. భౌతికశాస్త్రం, జీవశాస్త్ర సూత్రాలన్నిటినీ ఇలా యాంత్రికవాదంలో యిమిడ్చాడు. అతనికి రసాయనశాస్త్ర పరిచయంలేదు. ఈ యాంత్రికభావననే 18 వ శతాబ్దపు తాత్వికులు అనుసరించారు. [ఐతే ఒక్క డిడ్రాట్ మాత్రం తన కొన్ని రచనలలో గతితార్కికవాద సీమలను స్పృశింపగల్గాడు.]

18 వ శతాబ్దపు భౌతికవాదులంతా ఈ "గడియారాల" యాంత్రిక భావవాదనలోనే మునిగి తేలారు. దీన్నిబట్టి పదార్థం తాను మారకుండా స్థలం మారి మళ్ళీమళ్ళీ [గడియారం ముల్లువలె] తన యథా స్థానానికే వస్తుందన్న ఆధిభౌతికధోరణిలో సంచరించారు. అలాకాని రసాయనిక మార్పుల అనుక్రమం వారి దృష్టికి రాలేదు.

## ఆధిభౌతిక విధానంలో సమాజం:

సమాజంలోను మారేదేమీ లేదనే ఆధిభౌతిక విధానం భావిస్తుంది. కాని సరిగ్గా అలా నిష్కర్ష చేయబడదు. కొన్ని మార్పులు అంగీకరింపబడుతవి కూడా. ఉదాహారణకు ఉత్పత్తిలో ముడిపదార్థాలు తయారుసరుకులుగా మారుతాయనీ, రాజకీయంలో ఒక ప్రభుత్వంస్థానంలో మరో ప్రభుత్వం వస్తుందనీ అంగీకరింపబడ్తుంది. ఐతే, ధనికవాద "హయాం" మాత్రం శాశ్వతమైనదిగా భావింపబడి, దాన్నొక యంత్రంతో కూడా కొన్నిసార్లు పోల్చబడ్తుంది. ఆర్థికయంత్రం అప్పుడప్పుడు గాడి తప్పుతున్నట్లుగాను, దాన్ని మళ్ళీ ధనికవాదం త్రోవలో పడేస్తున్నట్లుగానూ వ్యాఖ్యానింపబడ్తుంది. గాడి తప్పకుండా ఈ ఆర్థికయంత్రం లాభాలు పాలకవర్గాలకూ, బీదతనం మిగిలిన ప్రజలకూ ఎల్ల కాలం ఒకేరీతిగా పంచవలసిందేనన్నదే దీనికిఫలితం.

రాజకీయంగాను — రాజకీయ యంత్రం అనగా, ధనికవర్గాల పార్లమెంటరీవిధానం ఒకసారి వామపక్షంవంకకూ, మరోసారి దక్షిణపార్శ్వంవంకకూ మొగ్గుతూ — ధనికవర్గాల సంక్షేమహక్కులను కాపాడుతూ — ఒకేరీతిని తన స్వరూపంలో ఎట్టి మార్పులేకుండా కొనసాగిపోవలసినదే...

ఇలా ఉంటుంది యాంత్రికవాదరూపకమైన ఆధిభౌతిక చలనదృక్పథం...

మన సమాజం ఇలాగే యంత్రంలా తిరుగుతూ పోతుంటే, స్వరూపంలో మార్పును పొందకుండా శాశ్వతకాలం తిరుగగల్గితే, ఫలితమేమి ?...దానికి చరిత్రలో క్రొత్తరూపాన్ని దాల్చే అవకాశంలేదు...సంఘాన్ని గూర్చి "చరిత్ర చెప్పినదాన్నే తిరగతిరుగ చెప్తుంది" అన్న సూత్రంలో అదే చరిత్ర అదేక్రమంలో మళ్ళీమళ్ళీ పునరుద్ఘాటనౌతుందన్న యాంత్రికభావమే ఉంది. సమాజగతి ఇలా వ్యాఖ్యానింపబడ్తుంది.

[మన భారతదేశ సామాజికదృష్టి ఎలా ఉంది ?...అది మతంతో మరీ సన్నిహితపరచబడి జన్మతో సంక్రమిస్తాయని చెప్పబడే కుల (వృత్తి) విభాగం పై నిర్మాణమైయుంది. 'నా విష్ణుః పృథివీపతిః' అన్న సూక్తి ఈ వాడు కాల గర్భంలో కలిసిపోయింది. అలాగే, కులతత్వాలుకూడా దేశపరిస్థితులలో, ప్రజల ఆలోచనలలో వస్తున్న మార్పులవల్ల వెనుకబడిపోతున్నాయి కాని తమ 'పాత' కాలపు ఆలోచనలు—లేక ఆధిభౌతికవాద ప్రభావంవల్ల ఈ వాడుకూడా ఈ మార్పులను సరిగా గమనించని లేక గమనించినా ఈ మార్పులకు హర్షించనివారు మనముందు అనేకులు లేకపోలేదు.]

పైభావాలు బాగా ప్రచారాన్ని పొందియున్నవి. ఆధిభౌతికవాదులు చలనాన్నీ, మార్పునూ కాదనకున్నప్పటికీ ఆ మార్పును యాంత్రికీకరించి దాని ప్రాధాన్యతా ప్రభావమూ తగ్గిస్తారు. [ఐతే వాస్తవంలో భూస్వామ్య యుగం గతించి ధనికవాద సమాజం వచ్చింది. మళ్ళీ భూస్వామ్యవిధానమే తిరిగిరావటంలేదు. కాబట్టి చరిత్ర పునరుద్ఘాటన కావటంలేదు. ఇక రానున్నది కార్మికవర్గ పరిపాలనకదా ? ఈవిషయాన్ని పై యాంత్రికవాదం మభ్యపరుస్తుండటం గమనించవలసినఅంశము. ఎలాగైనా, ఆధిభౌతికవాదులు నేటి సమాజ పరిస్థితులను మార్పులేకుండా స్థిరీకరించుటకు ప్రయత్నిస్తుంటారనేదే ఇక్కడ గమనార్హం.]

## ఆధిభౌతిక విధానంలో "ఆలోచన" లేక భావం:

మన భావాల "స్వభావ" స్వరూపాలు ఎలాంటివి ? సామాన్యంగా "మనిషి" ఆలోచనకూడా అనాద్యంతమైనదిగా భావింపబడ్తుంది. అంటే యుగక్రమంలో పరిస్థితులు ఎలా మారినా మన ఆలోచనాపథంయాత్రం ఒకే క్రమంలో కొనసాగుతూ ఉంటుందని అనుకోబడ్తుంది. భావనలూ, అనుభూతులూ స్థిరంగా ఉంటాయని తలచబడ్తుంది. ఉదాహరణకు ప్రేమ, దయ మొదలైనవి గ్రీకుసమాజంలోను, నేటిసమాజంలోను ఒకేలాగున్నాయని చెప్పబడ్తుంది. ఈ గుణాలు ఎల్లప్పుడూ ఒకేలాగుంటాయని నిరూపింపబడ్తుంది.

అందుకే మనుష్యుడు స్వార్థపూరితుడుగా—అదేపనిగా తనకొరకు డబ్బు సంపాదించుకొనుటకు పోటీపడ్తున్న "వ్యక్తి" గా అర్థంచేసికోబడు

తాడు. అందుకే మనిషి కోరికలు అనాద్యంతమై శాశ్వతమూ స్థిరమైనవిగా భావింపబడుతవి.

భావంయొక్క గతిలోను మనం ఇలా ఆధిభౌతికసూత్రాన్ని ప్రవేశ పెడ్తాము. ఈసూత్రాలే మనకు విద్యావిధానంద్వారా, సమాజ సంస్కారం ద్వారా ఉగ్గుపాలతో పోయబడియున్నవి.

"మనకు భావక్రమం చూడగానే ఒక స్వరూపాన్ని కల్గియున్న ట్లు—అంటే నిర్దిష్టమైన సామాన్య జ్ఞానప్రసార క్రమరూపకమైయున్నట్లు-తోస్తుంది."-ఎంగెల్స్.

ఆలోచనకొక క్రమాన్ని మనం కల్పిస్తాము. అధిభౌతికవిధానం ప్రపంచ పదార్థాలకేకాక మన భావక్రమానికికూడా ఇలా నిర్దిష్ట స్వరూపాన్ని కల్పిస్తుంది. ఐతే మనమీ అధిభౌతికవిధానపు ఆలోచనాక్రమాన్ని ఖండించటం తేలికైనా, ఆ విధానాన్ని విడిచివేయటం కష్టసాధ్యమే.

ఆధిభౌతిక విధానంలో భావం ఇలా ఉంది. "మన ప్రపంచ వస్తు వివేకం భావం. మనం సమాజంలో చూస్తున్న మార్పులన్నీ పైపై స్వరూపంలోమాత్రమే. స్వభావరీత్యా చూస్తే ఈ మార్పులన్నీ పోయిపోయి తిరుగ భావపు పూర్వపుదశకే చేరుకుంటవి. భావంలో మౌలికంగా మార్పుఉండదు—ఇదీ భావంవిషయం. ఇక దీన్ని నిరూపించుటకొక పద్ధతి ఉంది. అది తర్కశాస్త్రం. ఈ పద్ధతికి ప్రపంచంలో, సమాజ చరిత్రలో నేటివరకు జరిగిన వివరాలవన్నిటినీ పరిశీలించి ఆ ఆధారంపై "క్రొత్తగా వచ్చేదేమీలేదు...అంతా మామూలే" అని నిర్ధరించటమే ప్రయోజనం—ఇక్కడ మొదట భావం (నిష్కర్ష) యేర్పడి అది తనకై విధానాన్ని నిర్మాణం చేసుకోవటం జరిగింది... కాబట్టి విధానం సంకుచితత్వానికి గురియవటం సహజంకదా! సరి. ఇక మనం తర్కశాస్త్రాన్ని పరిశీలింతాం—

## తర్కశాస్త్రం ఏమిటి?

తర్కశాస్త్రమంటే సరిగా ఆలోచించే కళ అని నిర్వచింపబడుతుంది. అంటే మనం వాస్తవికంగా ఆలోచిస్తున్నామంటే తర్కశాస్త్రాన్ని అనుసరిస్తున్నామనే అనుకోవాలన్నమాట—

ఈ తర్క శాస్త్రానికి మూడు ప్రధానసూత్రాలున్నాయి.

1. అవికల్పసూత్రం:— ఒకేవస్తువును అదేవస్తువుగా నిరూపించేసూత్రం [గుఱ్ఱము గుఱ్ఱమే అనేపోలిక.]

2. అవ్యాఘాతసూత్రం:— ఒకే కాలంలో ఒకే పదార్థం దానికి వ్యతిరేకవస్తువుగా ఉండజాలదు. [చావో లేక బ్రతుకో ఏదో ఒకటిమాత్రమే ఉండాలి.]

3. మధ్యేమార్గ పరిహారసూత్రం:— రెండు పరస్పర వ్యతిరేకతల మధ్యగా విరుద్ధత లేక మూడవస్థితి నిరాకరింపబడటం. ఐతే చావు లేకపోతే బ్రతుకు కాని మధ్యలో మూడవదశ లేదు అని.

తర్కశాస్త్రరీత్యా ఆలోచించటమంటే ఈసూత్రాలద్వారా యోచించటం. కాబట్టి ఈ మూడుసూత్రాలను ప్రయోగించుట ఎప్పుడూ మరచిపోబడకూడదు. [ఈ మూడుసూత్రాలనూ మనం ఆధిభౌతికములను చదివినసందర్భంలో ఇదివరకే గమనించియున్నాము.]

నిజంలో ఆధిభౌతికవిధానమూ తర్కశాస్త్రమూ ఒకేనిర్మాణాన్ని కల్గియున్నవి. ఆధిభౌతికవాదానికి తర్కశాస్త్రం యొక్క పద్ధతిమాత్రమే. ఇది ప్రతివస్తువునూ స్పష్టమైనవిధంలో విడదీసి వర్గీకరిస్తుంది. అదేవస్తువును అదేవస్తువుగా, అవికల్పముగా అంగీకరించునట్లు చేస్తుంది. ఆపిదప మధ్యేమార్గాన్ని వదలి రెండు వ్యతిరేకతలలో ఏదో ఒకదానిని స్వీకరించుటకు ఒత్తిడి చేస్తుంది. ఇదీ దీనిమార్గం...అంటే చావు చావు, బ్రతుకు బ్రతుకు. ఈ రెండూ విరుద్ధములు. చావునైనా బ్రతుకునైనా ఒప్పుకోమ్మని చెప్పే క్రమాన్ననుసరిస్తుందన్నమాట. ఇక, ఈ తర్కం ప్రసరణ ఎలా ఉంటుంది ?...

" మనుష్యుడు మృతిని కల్గియున్నాడు. " అనగానే " రామయ్య మనిషి; కాబట్టి రామయ్య మృతిని కల్గియున్నాడు. " అని తార్కికంగా యోచించటమే దీని విధానం; ఈవిధానం ఎలా ఉంది ?!

" మనిషి చావును కల్గియున్నాడు. " అనగానే మనం " రామయ్యను " మనిషిఅని వర్గీకరించాము. కాబట్టి మనం యేవస్తువును చూచినా, అది యే వర్గానికిచెందినదో నిర్ణయించుకోవాలన్నమాట. మనముందురు సమస్య ఈ

రూపంలో వస్తుంది. మన వివిధవస్తువుల వివేకం కొన్ని విడివిడి సొరుగులుగా అమర్చబడియున్నది. కావున మనకు కన్పించేవస్తువు ఏ సొరుగుకుచెందినదో పోల్చుకొని దాన్ని ఆవస్తువులసొరుగులో పడవేస్తేసరి !...

ఇలా చావునుకల్గియున్న అన్ని ప్రాణులదీ ఒకసొరుగు. అందులో ఇముడ్చవలసిన చిన్న సొరుగు మనుష్యులు. తిరిగి అందులో ఇముడ్చవలసిన సొరుగు రామయ్య. ఈ సొరుగులు క్రమంగా ఒకదానికంటె ఒకటి చిన్నవి. ఇలాంటి అమరికను తర్కశాస్త్రం అనుసరిస్తుంది.

ఇలాంటి తర్కంతోను, సొరుగుల అమరికతోను అధిభౌతికవాదం రాజ్యంచేస్తుంది. రామయ్య చావును కల్గియున్నాడనే నిష్కర్ష తీయటానికి అంతకంటెముందు 2 మెట్లు నెలకొల్పబడియున్నవి. మూడవమెట్టు నిష్కర్ష అన్నమాట.

ఇక మనం మరో ఉదాహరణను తీసుకుందాము. యూ.యస్.యస్. ఆర్ లో (రాజ్యాంగచట్టం మేర్పడే పూర్వం) శ్రామికవర్గ నియంతృత్వ ముండియుండెను. (1) నియంతృత్వము నియంతృత్వమే, (2) యూ.యస్.యస్. ఆర్ లో నియంతృత్వ ముండెను. (3) కాబట్టి నియంతృత్వదేశాలై యుండిన ఇటలీ, జర్మనీ, యూ.యస్.యస్.ఆర్ లలో భేదం లేకుండెను. ఇలా పోతుంది తర్కధోరణి.

ఈ ఉదాహరణలో 'ధనికవర్గ ప్రజాస్వామికం' లో "లాభం" ఎవరికో సామాన్యంగా చెప్పబడనట్లుగానే, నియంతృత్వం ఎవరికొరకై నిజంగా అవలంబింపబడినదన్న విషయాన్ని లెక్కింపలేదు.

ఈవిధంగా సొరుగుల అమరిక చతురతద్వారా వస్తువులనూ, సాంఘిక విజ్ఞానాన్ని విడివిడి సొరుగులుగా విడదీసి, వాటిలో పెద్దసొరుగులలో చిన్నసొరుగులు అమర్చి తుదిసొరుగు నిర్ణయమిచ్చే తర్కశాస్త్రవిధానం అధిభౌతికవాదపు ఆలోచనాక్రమంగా అనుసరింపబడుతుంది.

పై ఉదాహరణొక సామాన్యవిషయమే. కాని, అది ఆచరణ క్షేత్రంలో ఎలా పనిచేసిందోచూడండి. 1919 లో జర్మనీలో జాతీయ ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యాన్ని కాపాడుకొనుటకు శ్రామికవర్గ నియంతృత్వాన్ని ధ్వంసం

చేసింది. అందుకు పరిణామంగా పెట్టుబడిదారీతత్వం పాలుపోసి పెంచబడి "నాజీంజము" దారితీసింది. ఇలాగే ఇటలీ చరిత్రకూడా ఫాసిజంకు దారి తీసింది. ఐతే పైన మన పొరుగుల తర్కవాదమైతే సరిగానే ఉంది. కాని ఆచరణక్షేత్రంలో ఎంతవరకు విమమించిందో చూడండి! తర్కంలోగల అస మగ్రత ఇలా ఉంటుంది.

జంతుశాస్త్రంలోను, వృక్షశాస్త్రంలోను ఇటీవలి "పరిణామసిద్ధాంతం" వికసించువరకూ ఒక్కొక్కటిగా ఆయాజంతువులు వర్గీకృతరూపంలో విడివిడిగానే పరిశీలింపబడేవి. ఇలా, ప్రకృతిశాస్త్రం విడివిడి సంచయన విధానాన్నే అనుసరించేది.

తగు విజ్ఞానశాస్త్ర వికసనలేనందువల్లనే 18వ శతాబ్దపు భౌతికవాదులీ అధిభౌతిక మార్గాల ననుసరించారు.

## అధిభౌతిక విధాన నిర్వచనం:

అధిభౌతికవిధానము ఆదర్శవాద తత్వశాస్త్రంలో చాలా ముఖ్యమైన భాగము. అది దేవుడూ ఆత్మకు సంబంధించినది. అందులో ప్రతిదీ శాశ్వతంగా నిరూపింపబడ్తుంది. దేవుడు అవినాశుడు, అవికల్పుడుగా నిరూపింపబడ్డాడు. దేవుడు, దేవుడు; ఆత్మ, ఆత్మగా ఆయా స్వస్వరూపాలను కల్గియుంటాయని చెప్పబడ్తుంది. అలాగే మంచి మంచిగానూ, చెడు చెడుగాను స్వస్వరూపాన్ని కల్గియున్నట్లు భావింపబడ్తుంది. ఇందులో వ్యతిరేకతల పరిశీలన (అంటే మంచికి చెడు వ్యతిరేకంగా, పదార్థం మనస్సుకు వ్యతిరేకంగా విభాగింపబడి, వానివాని విరుద్ధతల ఆధారం) ప్రధానంగా పాటింపబడ్తుంది.

ఈ విధంగా ఆలోచించటాన్ని తర్కించటాన్ని అధిభౌతికవిధాన మంటారు. భౌతికశాస్త్రంలో ఆవరింపబడని దేవుడు, ధర్మం, ఆత్మ, పాపం మొదలగువిషయములు ఇందులో చర్చింపబడుతవి. ప్రాపంచిక వస్తువులను భూతములు లేక పదార్థములంటారు. వీటికి అతీతమైన విషయచర్చను కల్గియున్నందున దీనికి "అధి" ఉపసర్గను చేర్చి అపత్యరూపంలో అధిభౌతికమని వాడబడినది.

ఆధిభౌతికవిధానమూ, యాంత్రికవిధానమూ, తర్కశాస్త్రమూ ఒకటి కొకటి 'అన్యోన్యా' శ్రయములై యున్నవి. ఈ మూడూ అవిభాజ్యముగా ఒకటిప్రక్కనే మరొకటి కన్పిస్తాయి. ఈ మూటీ సూక్ష్మమైన సమన్వయ రూపమే ఆధిభౌతికవిధానం. అందుకని ఈ మూటినీ మనం కలిపి చర్చించు చున్నాము. ఇక మనం నూతనసిద్ధాంతమగు గతితార్కిక విధానాన్ని పరిశీలింతాంగాక!—



# చతుర్థ భాగము.

# గతితార్కికవిధాన పరిచయం.

1. ప్రాథమిక హెచ్చరికలు:
2. గతితార్కికవిధానపు ఆధారం:
3. అధిభౌతికవిధానం 18 వ శతాబ్దంవరకూ ఎందుకు బలపడ్డది
4. గతితార్కికవిధానపు ఆవిష్కారం:

## ప్రాథమిక హెచ్చరికలు:

గతితార్కికములనగానే అవేవో చిత్రములైనవనీ, వింతైనవనీ, క్లిష్టమైనవనీ సాధారణంగా భావింపబడ్తుంది. అట్లు భావించేవారికి గతితార్కికములను గురించి అట్టే తెలిసియుండదు. కాబట్టి అట్లాంటిభావాన్ని మనం తొలగించుకోవాలి. ఒక గతితార్కికుడంటే సామాన్యంగా, సూక్ష్మంగా ఆలోచించే తార్కికుడని అర్థం తీయబడ్తుంది. కాని మనం "గతితార్కికము" లన్న పదాన్ని అలాంటి అర్థంలో తీసికోనము—గతితార్కికములు తాత్విక పరిభాషలో ఒక ప్రత్యేకార్థాన్ని కల్గియున్నవి. గతితార్కిక విధానం విచిత్రితనూ, క్లిష్టతనూ కల్గిలేక సుబోధకమైయున్నది. దాన్ని మనం స్పష్టంగా అర్థం చేసికోవచ్చు...[గతితార్కికములు అను పదం గతితార్కికసూత్రముల పరముగా ఇక్కడ వాడబడుచున్నది.]

ఐతే, ఒక విషయమిక్కడ గమనింపదగినది. చేతిపనులలో కొన్ని సులభమైనవి, కొన్ని క్లిష్టమైనవి. మట్టికుండలు చేయటానికీ, రేడియో

సెట్టును చేయటానికీ ఇలాంటిభేదం ఉంటుంది. ఒకటి స్థూలమైనపనైతే మరొకటి సూక్ష్మమైనది.

చేతిపనుల్లో మన అరచేతి వేళ్ళవలెనే ఆలోచనాక్రియంలో మన మెదడు కూడ ఒక పరికరము. చేతి పని చేతుల నిపుణతపై ఆధారపడునట్లే భావం మన మెదడుపై ఆధారపడియుంది. మానవచరిత్రలో మనిషి మొదట మోటు పనులు చేసేవాడు. అభివృద్ధి యేర్పడినకొద్దీ అతనిబుద్ధి వికసించి సూక్ష్మమైన పనులను చేయసాగాడు. అలాగే భావంయొక్క చరిత్రకూడా క్రియంగా పరిణమించింది. ఆధిభౌతికవిధానం స్థూలమైన చేతిపనివంటిది, గతితార్కిక విధానం అంతకంటే సూక్ష్మమైనది. అది సూక్ష్మతరమైన ఆలోచనాక్రమము.

చేతిపనుల క్రమాభివృద్ధివలెనే భావంయొక్క అభివృద్ధిక్రియంకూడా. ఈ రెంటికీ పరిణామక్రమంలో ఒకటేచరిత్ర ఉంది. ఈ చరిత్రలో విచిత్రత కాని, క్లిష్టతకాని లేక క్రియ వికసన స్పష్టంగా కనపడుతుంది.

ఐతే గతితార్కికములు క్లిష్టమైనవని ఎందుకు చెప్పబడ్తుంది?...చాలా కాలంగా తుండలుచేసే అలవాటుగలవానికి క్రొత్తగా రేడియోచేయటం వింతగా కనపడ్తుంది. అది అలవాటువల్ల. క్రొత్త అలవాట్లను అలవరచుకొనటంలో మనిషి తడబడ్తాడు. ఈ తడబాటు క్రొత్తదనం పోయేవరకే—

అట్లాగే గతితార్కికములనుగురించికూడా. మనం ఇంతకాలంగా ఆధిభౌతికవిధానంలో మునిగితేలుతున్నాము. ఇప్పుడు మనకు గతితార్కిక విధానాన్ని క్రొత్తగా అలవరచుకోవలసియుంది. కాబట్టి కొంచెం తడబడినట్లుగా ఉంటుంది. అంతేకాని ఇందులో విచిత్రతకాని, క్లిష్టతకాని—అర్థం కానట్టి ఇతరలక్షణాలేవీ కాని లేవు.

## గతితార్కికవిధానం ఎక్కడనుండి?

ఆధిభౌతికవిధానం ప్రపంచాన్ని అనేకపదార్థాల అచలమైన అమరికగా చూస్తుంది. కాని ప్రపంచం చలనాన్నీ, మార్పునూ కల్గియున్నట్లు మనకు నిత్యమూ అనుభవవేద్యమే. అట్లాగే భావంకూడా చలనాన్నీ, మార్పునూ కల్గియున్నది. దీన్నిబట్టి ఆధిభౌతికవిధానం ప్రకృతికి విరుద్ధంగా నున్నట్లు స్పష్టం. ప్రకృతి నిత్యచలనాన్ని కల్గియున్నదని గతితార్కికవిధానం చెప్తుంది.

తేలికగా అర్థంచేసికొనుటకు మనం అధిభౌతికవిధానాన్ని అచలనిరూపణగాను, గతితార్కికవిధానాన్ని చలననిరూపణగాను చెప్పుకోవచ్చు. గతితార్కికవిధానానికి ప్రతివస్తువులో మనం అనవరతం చూసే "చలనమూ, మార్పూ" ఆధారమైయున్నవి.

"మనం ప్రకృతినిగాని, ఆలోచనాక్రమాన్నిగాని గమనిస్తే చరిత్రలో మనం మొదట గమనించేది ఎడతెగని అన్యోన్యసంబంధాలు, అన్యోన్యవిరుద్ధతలు, స్వరూపాల, స్వభావాల మార్పులతో ఎల్లప్పుడూ (ప్రవాహరూపంలో) వస్తూ-పోతూ ఉన్నాయనే." —ఎంగెల్స్.

ఈ నిర్వచనం గతితార్కిక దృక్పథంలో ప్రతివస్తువూ మారుతుందనీ, స్థితంగా ఉండదనీ చెప్తుంది. ఇదే వాస్తవానికి సన్నిహితమైయున్నది.

భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతున్నది. సూర్యుడుకూడా తిరుగుతున్నాడు. ఈ తిరగటంలో యుగయుగాలుగా మార్పులు కల్గుతున్నాయి... కాబట్టి పదార్థం పైకి మనకు కదలటం లేనట్లుగా కన్పించినా అది చలనాన్నీ మార్పునూ కల్గియేయుంది. అధిభౌతికవిధానంలో వస్తువు అవికల్పమైనదిగా భావింపబడి అవికల్పసూత్రానికి సమన్వయింపబడ్తుంది. కాని అందుకు భిన్నంగా, వాస్తవంలో ప్రతివస్తువూ నిత్యమూ మార్పును పొందుతూనే ఉంటుంది.

మనం ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటామని అనుకుంటాము. కాని వాస్తవం అదికాదు. అదేపదార్థం అదేపదార్థంగా ఉండక మారిపోతుంది. మనం ఇదివరకువలెనే ఇప్పుడున్నామని భావించినా మార్పుకు గురియౌతూనేఉన్నాము. మనం శైశవదశనుండి యువకులంగా మారినాము. తరువాత పెద్దవాళ్ళమైనాము. రోజురోజూ, క్షణక్షణమూ వృద్ధాప్యాన్ని సమీపిస్తున్నాము. మానవసమాజంకూడా ఇలాగే అనవరతం మారుతున్నది.

కాబట్టి మనకు ప్రపంచంలో కనిపిస్తున్న "మార్పు" మన భ్రాంతి కాదు. పైగా మార్పులేనట్లు కనిపిస్తుండటమే అపోహయూ భ్రాంతియూ—

వస్తువులు ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటాయనటానికి చరిత్ర విరుద్ధంగా సాక్ష్యమిస్తున్నది. ఏకాలంలోకూడా సమాజం చలనరహితమై యుండ

లేదు. ఆదిమయుగంలో బానిససమాజం, తరువాత భూస్వామ్యసమాజం, తరువాత ధనికవాదసమాజం యేర్పడ్డాయి. ఈ సాంఘికవ్యవస్థలలో ఎల్లప్పుడూ ఎడతెగకుండా ఆయా సమాజస్థితులలో ఆయా అంతర్గతశక్తులు పనిచేసి ఆయా నూతనస్వరూపాలను వాటిలో కల్గించాయి. అలాగే ఈనాడు ధనికస్వామ్యం మారిపోతూఉన్నది. రష్యాలో సమాజం సామ్యవాదరూపాన్ని చేకూర్చుకుంది. ఈనాటి రష్యాలోని సామ్యవాద స్వరూపంకూడా క్రమక్రమంగా మారిపోతూనేఉన్నది.—ఐతే ఆధిభౌతికవిధానపు అలవాటువల్ల ఈ మార్పులను కొందరు గమనింపలేకపోతున్నారు. వారు సామ్యవాదసమాజాన్ని ధనికవాదసమాజపు కొలతబద్దలతోనే ఇంకా పరిశీలిస్తున్నారు. అలాగే మనఅభిరుచులూ 'వాసనలు' కూడా మారుతుంటాయి. భావాల ఈమార్పులను మనం సరిగా గమనించకపోవచ్చు. మనసంబంధాలు తరుచు బాంధవ్యాలుగానూ, శత్రుత్వాలుగానూ మనం అనుకోకుండానే మారుతుంటాయికదా? అనగా భావం మారుతుంటున్నట్లేకదా!

కాబట్టి ప్రకృతిలోచూచినా, చరిత్రలోచూచినా, భావంలోచూచినా మనకు మార్పే గోచరిస్తుంది. ఈసూత్రంతో గతితార్కికవిధానం ప్రారంభమౌతుంది.

హిరాక్లిటస్అనే గ్రీకుతాత్వికుడు ప్రపంచాన్ని చలనాత్మకంగా కనుగొన్నాడని మనం లోగా చదివియున్నాము. కాని దానికతడొక పద్ధతి నిర్మాణం చేయలేకపోయాడు. [విజ్ఞానశాస్త్రాధారాలు చాలక]. ఐతే ఇదొక విధానంగా చాలాకాలానికిగాని పరిణమించలేదు. ఐతే; ఎలాగ?...

## గతితార్కిక విధానాన్ని చాలాకాలం ఆధిభౌతికవాదం ఎందువల్ల నిలదీసింది?

గతితార్కిక వివేకం ప్రాచీన గ్రీకుల కాలంనాటికే ఉండియుండెను. కాని దానిని నిరూపించు విజ్ఞానశాస్త్రాధారాలు చాలని అజ్ఞానంమూలంగా ఆధిభౌతికవిధానమే ప్రబలుట జరిగినది. మానవుని అజ్ఞానదశనుండి ఆదర్శవాదం ప్రబలినట్లుగానే, అతని అసమగ్ర జ్ఞానదశనుండి ఆధిభౌతికవాదం ప్రబలుట జరిగినది....

ఎలాగ? ఎందుచేత? మనిషి అజ్ఞానదశలో పదార్థాల పరిశీలన ప్రారంభింపబడినది. అతడు ఒక్కొక్క వస్తువును విడివిడిగా పరిశీలించసాగాడు. అలాగే వస్తువులను వర్గీకరించాడు. ఐతే ఈ వర్గీకరణపద్ధతికి అతడు అలవడిపోయాడు. ఈ అలవాటు ఒక ఆలోచనక్రమంగా మారింది. ప్రతిదాన్నీ వర్గీకరించటం, ప్రత్యేకించటమే ఈ ఆలోచనాక్రమవిధానం. [ఇదే అధిభౌతికవిధానమని వేరే చెప్పనవసరంలేదుకదా!]...ఈపద్ధతే దాదాపు 150 యేండ్లక్రిందటివరకూ ఆచారంగా ఉంటూవచ్చినది. దేనికదిగా విడివిడిగా విజ్ఞానశాస్త్రాలను విద్యార్థులు అధ్యసించేవారు. రసాయనశాస్త్రం, పదార్థవిజ్ఞానశాస్త్రం, జీవశాస్త్రం దేనికదిగా అన్యోన్యసంబంధం లేనిదిగా భావింపబడేది. ఆయా శాస్త్రాలలోకూడా దేనికది విడిగానే విభజించబడియుండేది. ఉదాహరణకు పదార్థవిజ్ఞానశాస్త్రంలో: శబ్దం, ఉష్ణం, (నూదంటురాయి) ఆకర్షణ, విద్యుచ్ఛక్తి విడివిడిగా విభజింపబడి అన్యోన్యసంబంధం లేకుండా పరిశీలింపబడేవి. దేనిదానికి వేరేవేరే ప్రకరణాలుండేవి. కాని ఇవన్నీ సమన్వయరూపాన్ని చేకూర్చలేదు. ఈవిధంగా అధిభౌతికవిధానంలోని రెండవసూత్రం, దేనిదాన్ని పరస్పరపోలికలు లేకుండా విడదీసే లక్షణం, అమలగుచుండెను.

కాని ఈ అసమన్వయవిధానం "ఆచరణ" లో మాత్రం మారిపోక తప్పలేదు. శాస్త్రజ్ఞులు వస్తువులను స్థితదశనుండి క్రమక్రమంగా చలనదశలో పరిశీలింపసాగారు.

ఉదాహరణకు ఛాయాచిత్రం. మొదట వస్తువులు స్థితస్థితిలో ఛాయాచిత్రం తీయబడ్తూ కొద్దికాలానికే చలనస్థితిలోకూడా చిత్రాలుతీయటం ఆరంభమైనది. ఇదే నేటిసినిమా. మన పరిశోధనయొక్క వికాసక్రమానికి ఇదొక ఉదాహరణ కాగల్గుతుంది.

మొదట 'స్థిత' దశలో వస్తువు పరిశీలింపబడ్డది. ఎందుకంటే అది తేలికకాబట్టి. క్రమక్రమంగా చలనదశలో వస్తుపరిశీలన వికసించింది. —మనిషి బుద్ధివికాసం ఇదేక్రమంలో పరిణతిగాంచినది.

ఇదేవిధంగా మొదట జంతుశాస్త్రమూ, వృక్షశాస్త్రమూ విడివిడిగా శోధింపబడినవి. ఆయా జాతులలో, రకాలలో, ఆయా జీవకోటి వర్గీకరింప

బడి దానికి శాశ్వతత్వం ఆపాదింపబడినది. "రోజా" ఎల్లకాలాలలోను అదే "రోజా" గా ఉంటుందని సిద్ధాంతీకరింపబడటమే ఈ శాశ్వతీకరణ. ఇది ఆధిభౌతిక విధానంలోని మూడవసూత్రమని మనమిదివరకే గమనించాము. కాని విజ్ఞానశాస్త్ర వికాసం ఈపద్ధతినికూడా మార్చివేసింది.

## 18 వ శతాబ్దపు భౌతికవాదం ఆధిభౌతికవిధానాన్ని ఎందుకనుసరించింది ?

18 వ శతాబ్దపు భౌతికవాదంలో యాంత్రికవాదం విశేషించి పనిచేసినట్లు మనమిదివరకే తెలుసుకున్నాము. అందువల్ల అప్పటి భౌతికవాదం ఆధిభౌతికవిధానానికి లొంగిపోయినట్లుకూడా గమనించాము. అలా యెందుకైనది ?...ఎందుకంటే భౌతికవాదం విజ్ఞానశాస్త్రాల వికసనపై ఆధారపడియున్నందువల్లనూ, ఆ కాలానికి యాంత్రికవాదమే వికసించియుండటంవల్లనూ. యాంత్రికవిధానమంటే ఏమి ? సాధారణంగా యాంత్రికవిధానమంటే యంత్రములకు సంబంధించినదిగా భావింపబడ్తుంది. కాని శాస్త్రీయ పరిభాషలో అది చలనంయొక్క—స్థానం మార్పుయొక్క—పరిశీలన. చలనంలో యాంత్రిక చలనం [అంటే వస్తువుస్థితిలో మార్పులేని కేవల స్థానచలనం] చాలా సులభమైనది. ఒక జామపండు చెట్టునుంచి క్రిందపడటాన్ని పరిశీలించటం, ఆ జామపండు పండుగా మారేక్రమాన్ని పరిశీలించటంకంటే తేలిక. గాలితాకిడికి జామపండు రాలిపడిందనటం తేలిక. కాని బాగా పండిన కారణంగాను రాలిపడ్డదని గుర్తించటం అంత తేలికకాదు. ఇందులో మొదటిమార్గం ఆధిభౌతికానికి దారితీస్తుంది; అది అసమగ్ర పరిశీలనకదా !

ప్రాచీన గ్రీకుశాస్త్రజ్ఞులు ప్రతివస్తువుకూ చలనముందన్నారు. కాని వారి విషయజ్ఞానం అల్పమైయున్నందున ఆ సిద్ధాంతాన్ని వారు ఉపయోగానికి తేలేకపోయారు. అందుకై పదార్థాలనూ, ప్రకృతులనూ పరిశీలించినసందర్భంలో వాటిని (స్థితరూపకంగా) వర్గీకరింపవలసివచ్చింది. ఆధిభౌతిక విధానం అలాగే వస్తువులను వర్గీకరించి పరిశీలిస్తూ తృప్తిపడ్డది....

ఇలా 18 వ శతాబ్దపు యాంత్రికయుగంలో భౌతికవాదాన్ని ఆధిభౌతిక

విధానమే శాసించింది. ఈ భౌతికవాదం "యాంత్రిక భౌతికవాదం" గాను చెప్పబడ్తుంది.

ఐతే, అప్పటి భౌతికవాదం—భౌతికవాదంగా "పదార్థాల వాస్తవిక స్థితిని ప్రధానముగా" తాత్వికరూపకంగా గుర్తించింది. తోడ్తో ప్రపంచం లోని వస్తుకోటి విడివిడిగా అసమర్చబడ్డ సమూహామని ఆధిభౌతికాన్నీ అంగీక రించింది. వెనువెంటనే 'యాంత్రికముల' ద్వారా ప్రయోగాత్మకంగా ప్రతి వస్తువు చలనమునూ పరిశీలించింది.

కాని శాస్త్రపరిశోధన పెరిగినకొద్దీ ఏశాస్త్రాన్నికాశాస్త్రం విడిగా స్థిత రూపంలో ఉండదని తెలిసికోక తప్పిందికాదు. ఒకశాస్త్రం మరొకశాస్త్రంపై ప్రసరణ కల్గియున్నట్లు గమనింపబడినది. రసాయనశాస్త్రాన్ని జీవశాస్త్ర పదార్థ విజ్ఞానశాస్త్రాలతో విడిగా—అట్లాగే ఒకదానితో మిగిలినవి విడిగా—పరిశోధించుట అసంభవమగు పరిస్థితి యేర్పడ్డది. ఉదాహరణకు మన "జీర్ణక్రియం" రసాయనశాస్త్రంపైనా, జీవశాస్త్రంపైనా ఆధారపడియున్న దికదా! ఇలాగే 19వ శతాబ్దారంభంవరకు విజ్ఞానశాస్త్రాలు పరస్పర ప్రసర ణను పెంపొందించుకొని తమ ఆధిభౌతికవిధానపు విడివిడితనాన్ని కోల్పో సాగినవి. పదార్థ విజ్ఞానశాస్త్రంలోని ప్రకృతులు సమన్వయరూపాన్ని చేకూర్చుకున్నవి. విద్యుచ్ఛక్తి అయస్కాంతశక్తి రెండూ కలిసి Electro magnetism గా మారింది. శబ్దాన్ని విద్యుత్తుగా, విద్యుత్తును ఉష్ణంగా కాంతిగా మార్చే నూతన పరిశోధనలు క్రమక్రమంగా వికసింపసాగినవి.

సుత్తెతో ఒక వస్తువును మనం కొట్టినప్పుడు, శబ్దమూ, ఉష్ణమూ రెండూ కలుగుతవి. చలనం ఉష్ణాన్ని పుట్టిస్తుంది. శబ్దం చలనాన్ని కలిగి యుంది. ఇలా ఒక్కొక్క ప్రకృతి మరొకప్రకృతితో సంయోగాన్ని చేకూర్చుకోసాగింది.

జీవశాస్త్రంలో కొన్ని ప్రాణులు జంతువులా, వృక్షములా తెలియనంత సందిగ్ధరూపంలో శాస్త్రజ్ఞులముందుకు రాసాగినవి. 19వ శతాబ్దారంభపు పరి శోధనలచే జంతువులకూ, వృక్షములకూ గల యెడం తొలగిపోసాగింది. కొన్ని జంతువులు తమ ఆదిమస్థితిలో జంతువులుగా లేనట్లు తేలిపోయింది.

ఇలా ఆధిభౌతికవిధానపు 'శాశ్వతీకరణ' సూత్రం వాస్తవములచే సమూలంగా ఖండింపబడసాగినది.

[ఈ శాస్త్ర వికాసపరిణామాలే నేటి సినిమా, రేడియో, టెలివిజన్ మున్నగు నవీనసాధనాలు. జగదీశ చంద్రబోస్ జీవశాస్త్ర పరిశోధనలుకూడ ఈ సందర్భంలో పేర్కొనదగియున్నవి.]

ఐతే, ఈమార్పులు 19 వ శతాబ్దారంభంలో ఒక విస్పష్టాకృతిని చేకూర్చుకున్నవి. ఇలా విజ్ఞానశాస్త్ర వికాసమే భౌతికవాదాన్ని గతితార్కిక భౌతిక వాదంగా ఆవిష్కరించినది.

కాగా, ఆధిభౌతికరూపకమైన 18 వ శతాబ్దపు అసమగ్ర విజ్ఞానశాస్త్రం ఆధిభౌతిక భౌతికవాదానికి దారితీస్తే, నూతన విజ్ఞానశాస్త్రదశ నూతన భౌతిక వాదానికీ, లేక గతితార్కిక భౌతికవాదానికీ దారితీసినది.

## హెగెల్ మార్క్స్ దృక్పథాలలో గతితార్కిక భౌతికవాదం:

ఆధిభౌతిక భౌతికవాదం గతితార్కిక భౌతికవాదంగా ఎలా మారిందనగానే సామాన్యంగా వచ్చే సమాధానం ఈ క్రిందివిధంగా ఉంటుంది.

1. 18 వ శతాబ్దంలో అధిభౌతిక భౌతికవాదమని ఒకటి ఉండేది.

2. విజ్ఞానశాస్త్రాలు మారినవి.

3. మార్క్స్ ఎంగెల్స్ వచ్చారు. వాళ్ళు భౌతికవాదపు "అధిభౌతిక" విశేషణాన్ని లాగివేసి దానిస్థానంలో 'గతితార్కిక' పదాన్ని తగిలించారు.

ఈ సమాధానం ఒక సూచీక్రమంలో చెప్పబడింది. మనం విషయాలను ఆవిధంగా చెప్పే సహజాభ్యాసాన్ని కల్గియున్నాము. ఈ అభ్యాసం ఆధిభౌతికవిధానరూపకమైనదే—ఇందులో మనం విషయాన్ని వర్గీకృతరూపంలో యిమిడ్చి స్పష్టపరుప ప్రయత్నిస్తున్నాము. కాని మనమెప్పుడూ ఒక విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి. వాస్తవాన్నీ విధంగా మనం సూచీకరించి లేక వర్గీకరించి ఎప్పుడూ చెప్పజాలదు. మనం అనుకున్న దానికంటే, అవి కన్పిస్తున్న దానికంటే వాస్తవాలు ఎప్పుడూ ఎక్కువసంక్లిష్టతను కల్గియుంటాయి.

అందువల్ల చాలా అసమగ్రత యేర్పడుతుంది. తత్వశాస్త్రంలో ఆధిభౌతిక భౌతికవాదంనుండి గతితార్కిక భౌతికవాదానికి వచ్చినమార్పు ఇంత సులభమైనది కాదుకదా!

సమకాలికంగా విజ్ఞానశాస్త్రాలలో వచ్చినమార్పులను గమనించి హెగెల్ (1770–1831) అను ఆదర్శవాద తత్వవేత్త గతితార్కికములను వృద్ధి పరచాడు. ప్రాచీన గ్రీకుశాస్త్రజ్ఞుడు హిరాక్లిటస్ వలెనే ఇతడుకూడ ప్రపంచం చలనానికీ, మార్పుకూ గురయ్యియున్నదని శాస్త్రవిజ్ఞాన ఆధారంతో నిరూపించాడు. ఏ పదార్థమూ విడిగా (ఒంటరిగా) లేదనీ, ఒకదానినొకటి ఆశ్రయించి యున్నదనీ ఇతడు గతితార్కికములను ప్రారంభించాడు. ఇతడు 'భావాన్ని' దాని చలనరూపంలో గుర్తించి దాన్ని గతితార్కికమని నిరూపించాడు. ఈ చలనం ఒక వాదన లేక చర్చలోలా అన్యోన్య భావఘర్షణ రూపకమై యుంటుందనురీతిలో నిరూపణచేశాడు.

కాని హెగెల్ ఒక ఆదర్శవాది. అతడు ప్రథమ ప్రాధాన్యతను వస్తువుకాక 'మనస్సు' కు పాటించాడు. దీనిఫలితంగా భావ గతితార్కికమును ఆవిష్కరిస్తూ బాహ్యవస్తువులలో మార్పులు "భావం" లేక మనస్సులోని మార్పులవల్లనే కల్గుతున్నవని వాదించాడు

ఉదాహరణకు: పరిశోధకునికి ఒకభావం కల్గుతుంది. దాన్ని అతడు అమలుచేస్తాడు. ఈ భావం అమలురూపంగా వస్తువులోను మార్పు కల్గిస్తుంది.

కాబట్టి హెగెల్ గతితార్కికుడైనా తననూ, తనవాదాన్నీ ఆదర్శవాదానికి అనుబంధీకరించినవాడే.

అపిమ్మట, మార్క్స్ ఎంగెల్స్‌లు పై హెగెల్ నిరూపణలు భౌతికవాద పరంగా ప్రకృతికీ, మానవునికీ, చరిత్రకూ సరిగా అన్వయిస్తున్నట్లు కనుగొన్నారు; కాని తల్లక్రిందులుగా. ఎంగెల్స్ ఇలా అన్నాడు "హెగెల్ గతితార్కికవాదం తలక్రిందు, కాళ్ళు మీదుగా నిల్చియున్నది. దాన్ని తిరుగ కాళ్ళ క్రిందుగా భూమిపై నిల్పాలి"—అలాగే పదార్థ వాస్తవిక మూలాధారంపై హెగెల్ భావగతి తార్కికమును సమన్వయించి, దానికి గతితార్కిక భౌతికవాద నామకరణంచేశారు.

హెగెల్ భావంలోను సృష్టిలోను అనవరతమూ చలనమూ, మార్పూ జరుగుతున్నదని నిరూపించాడు. భావంలోని మార్పులే పదార్థాల మార్పులుగా పరిణమిస్తున్నాయని భావించాడు. నిజంలో అలాకాక వస్తువులుండే మన భావం యేర్పడి— వస్తువుల స్థితిలోని మార్పుల ద్వారానే మనస్సులోని భావాలు మార్పు జెందుతూ ఉంటాయి.

పూర్వకాలం ప్రజలు "బండ్ల" పైన ప్రయాణం చేసేవారు. ఈనాడు మనం మోటార్ కార్లలో ప్రయాణం చేస్తున్నాము. మనకు మోటార్ కార్లలో ప్రయాణం చేయాలన్న భావం కల్గినందువల్ల అలా జరగటంలేదు. మోటారు కారు ఈనాడు మనముందున్నందువల్లనే ఇలా జరుగుతూ ఉన్నదికదా! ఇలా పరిస్థితులు భావాలలో మార్పులు కల్గిస్తాయి.

ఐతే మనం మార్క్సు ఎంగెల్సూ ఒకవంక 18వ శతాబ్దపు ఫ్రెంచి భౌతికవాదాన్నీ, మరోవంక హెగెల్ గతితార్కికములనూ రెంటినీ కలిపి గతితార్కిక భౌతికవాదాన్ని తయారుచేశారనే సూచీకృత అధిభౌతిక ధోరణితో తృప్తిపడిపోరాదు. మార్క్సు ఎంగెల్సూ హెగెల్ గతితార్కికములను స్వీకరించినది వాస్తవమే. కాని దాన్ని పునరావిష్కరించారు. వారు అధిభౌతికవిధానాన్ని ప్రకృతిశాస్త్రాలతో, చరిత్రతో, విజ్ఞానంతో సమన్వయించి ప్రయోగాత్మకంగా నిర్మాణంచేశారని గమనించాలి.



# గతితార్కికసూత్రాలు: ప్రథమసూత్రం.

1. గతితార్కిక చలనం అనగా?...
2. గతితార్కికంగా "ఏదీ పరిపూర్ణం, స్వచ్ఛందం, పవిత్రం కాదు."—ఎంగెల్స్.
3. అనుక్రమం లేక Process:

## గతితార్కిక చలనం అంటే ఏమి?

గతితార్కిక ప్రథమసూత్రం "ఏవస్తువూ ఒకేస్థలంలో స్థిరమైయుండదు; మార్పుకు గురికాకుండా ఉండదు" అని.

...గతితార్కికం అనగా చలనమూ, మార్పూ; గతితార్కిక పరిశీలన అంటే చలనమూ, మార్పుల పరిశీలన; గతితార్కికదృష్ట్యా వస్తుపరిశీలన అంటే వస్తువుయొక్క చలనాన్నీ, మార్పునూ సక్రమంగా పరిశీలించటమన్నమాటే.

ఉదాహరణగా మనమొక జామపండును తీసుకుందాం. దీన్ని పరిశీలించటంలో రెండువిధానాలు—ఒకటి ఆధిభౌతిక విధానదృష్ట్యా; రెండు గతితార్కిక విధానదృష్ట్యా—

మొదట మనం జామపండు ఆకారాన్ని, రంగునూ వర్ణిస్తాము. ఆపిదప దాని గుణాలను, రుచినీ మొదలైనవాటిని లెక్కిస్తాము. ఆపిదప దాన్ని మరొకపండుతో పోలుస్తాము. తుదకు జామపండును జామపండుగా నిర్ధరిస్తాము. ఇది ఆధిభౌతికవిధానం.

ఇక గతితార్కికదృక్పథం; మనం జామపండులోని చలనాన్ని పరిశీలిస్తాము. అంటే స్థలంమార్పేకాక, పిందెనుండి పండువరకు దానిలో మార్పులు.

ఆపిదప ఈనాడు పండుగాకన్పించే జామపండు ఎల్లప్పుడూ 'పండినస్థితి' లో లేదని చెప్తాము. అది పిందెగాను, పూవుగాను, మొగ్గగాను ఉండియుండే దని గుర్తిస్తాము. అందుకే ఆపండు ఎల్లప్పుడూ పండుగా ఉండదనీ, అలాగే ఉంటే రాలిపోయి, మట్టిలో కలిసిపోతుందనీ—దానిగింజలు మొక్కల రూపాన్ని దాల్చవచ్చుననీ— జామపండుచరిత్రను పరిశీలిస్తాము.

చలనరూపకంగా వస్తు పరిశీలనంటే ఇదే. అనగా గతంద్వష్టితోను, భవిష్యత్తు దృష్టితోను వస్తుపరిశీలనన్న మాట. ఇలా పరిశీలించటంలో మనం జామపండు ప్రస్తుతస్థితిని పరిణామక్రమపు ఒకదశగా గుర్తిస్తాము.

ఈ పరిశీలనాక్రమాన్ని మరింత స్పష్టంగా అర్థంచేసికొనుటకు మనం మరి రెండు ఉదాహరణలను తీసుకుందాం—భూమి; సాంఘికవ్యవస్థ. మనం అధిభౌతికదృష్టితో పరిశీలిస్తే మనం భూమియొక్క ఆకారాన్ని సవివరంగా వర్ణిస్తాము. భూమి పైభాగంలో సముద్రాలు, మైదానాలు, పర్వతాలు ఉన్నాయని గమనిస్తాము—అలాగే భూమి గుణగణాలనుకూడా పరిశీలిస్తాము, ఆపిదప భూమిని ఇతర గ్రహగోళాలతో పోల్చుకొని భూమిని భూమిగా నిర్ధరిస్తాము—

ఐతే, గతితార్కికదృష్ట్యా భూమిచరిత్రను పరిశీలించినప్పుడు మనం భూమి అన్ని కాలాలలోను నేటిస్థితిలో లేదని గుర్తిస్తాము. భూమిస్థితిలో అనేక మార్పులు వచ్చినవి. అది ఇంకా అనేకమార్పులకు గురికాగలదు. కాబట్టి పరిణామక్రమంలో భూమియొక్క ప్రస్తుతస్థితి ఒక దశమాత్రమే. ఈ మార్పులు జామపండులోని మార్పులవలె అల్పకాలంలో జరిగేవి కానందున వాటిని గమ నించటమంత తేలిక కాదు. కాని విజ్ఞానశాస్త్రం ఆమార్పులను పరిశీలింపగలదు,

ఇక సాంఘికవ్యవస్థ:- అధిభౌతికదృష్ట్యా బీదలూ, ధనికులూ ఎల్లకాలా ల్లో ఉండేట్లుగా శాశ్వతీకరింపబడ్తుంది. పెద్దపెద్దబ్యాంకులూ, కర్మాగారాలూ ఉన్నట్లు వర్ణింపబడ్తుంది. ధనికవర్గ సమాజవ్యవస్థ సవివరంగా వర్ణింపబడ్తుంది. దానిని ఫ్యూడల్, బానిసరూపాలతో పోల్చబడ్తుంది. తుదకు ఇదీ, సమాజ వ్యవస్థ అని నిర్ధరింపబడ్తుంది...

ఇక, గతితార్కికదృష్ట్యా: సాంఘికవ్యవస్థ ఎల్లకాలమూ ఇలాగే ఉండ దని గుర్తింపబడ్తుంది.

సమాజ పరిణామంలో భిన్న భిన్న వ్యవస్థ లుండియుండెను. అవి మారి నేటివ్యవస్థ యేర్పడినది. ఇదికూడా మార్పుకు గురియౌతుంది. కాబట్టి నేటి సంఘ వ్యవస్థస్వరూపమొక 'దశ' మాత్రమే. ఈదశ గతానికీ, భవిష్యత్తుకూ మధ్యస్థమైయున్నది. ఇది శాశ్వతమూ, అటలమూ కాదు.

ఈ ఉదాహరణలద్వారా గతితార్కిక పరిశీలన అనగా ప్రతి వస్తుస్థితినీ ఒక తాత్కాలికదశగా, అనగా ఆ వస్తుచరిత్రక్రమపు గతానికీ, భవిష్యత్తుకూ మధ్యస్థమైన ఒక తాత్కాలిక చలనశీలదశగా—పరిశీలించటమన్నమాట. ఈ దృష్ట్యా ప్రతివస్తువుకూ ఒక ఆదీ, ఒక అంతమూ ఉండటం అనివార్యము—

“ గతితార్కికములకు ఏదీ శాశ్వతం, ప్రత్యేకం, స్థిరంకాదు. ”

“గతితార్కికములు ప్రతివస్తువుయొక్క ‘వస్తువులోని’ చలనాన్ని ప్రకటిస్తాయి. ప్రతివస్తువుయొక్క ప్రతిదశా వృద్ధినీ, క్షీణతనూ కల్గియుంటుంది”—

(ఎంగెల్స్.)

గతితార్కికములకు ఏవీ “ శాశ్వతం ” కాదు. అంటే ప్రతివస్తువుకూ గతమూ భవిష్యత్తూ ఉన్నవనీ, కాబట్టి నేటిదశ శాశ్వతదశ కాదనీ అన్నమాట.

గతితార్కికములకు ఈ ప్రపంచంలోకాని, మరెక్కడాకాని, ఒకవస్తువుకు ఒకేవిధంగా ప్రత్యేకించి అట్టిపెట్టే ఏశక్తి లేదన్నమాట. కాబట్టి ఏపదార్థానికీ ప్రత్యేకత లేదు. [స్వచ్ఛందత లేదు.]

గతితార్కికములకు ఏదీ “ స్థిరం ” కాదు....ప్రతివస్తువుకూ చరిత్ర ఉంది. చలనంఉంది. [చలనమంటే స్థలంమార్పూ, వస్తువుయొక్క మార్పూను.] ప్రతివస్తువూ వృద్ధి-క్షయాలను కల్గియుంటుంది. ఆద్యంతాలను కల్గియుంది. సృష్టిచరిత్రలో నిన్నటిది నేటిదీ, నేటిది రేపటిదీగా ఉండదు. ప్రతివస్తువుకూ పరిణామక్రమంలో ఆదీ-అంతమూ తప్పవు.

“ ఏవస్తువూ చలనమునకు అతీతంకాదు. వృద్ధి-క్షయములకు అతీతం కాదు.” ఐతే వృద్ధిఅనగా ఏమిటి? దీన్ని మనం ఒక ఉదాహరణతో పరిశీలిద్దాం.

ఒక పెన్సిలుంది. ఈ పెన్సిలీనాడు పాతది. ఒకనాడు క్రొత్తదిగా ఉండెను. ఇది కఱ్ఱతో చేయబడినది. కఱ్ఱ చెట్టునుండి వచ్చినది. ఇదీ పెన్సిలు చరిత్రక్రిమం—

మనమిదివరకు జామపండు చరిత్రను గమనించియున్నాము. ఇప్పుడు పెన్సిలు చరిత్ర గమనిస్తున్నాము. ఈ రెంటిలో భేదమేమిటి? జామపండు మొగ్గగా ప్రారంభమై—పిందెగా—కాయగా—పండుగా—మట్టిగా—తుదకు మొక్కగా మారినది. కాని చెట్టు కఱ్ఱగాను, కఱ్ఱ పెన్సిలుగాను—పెన్సిలు చెక్కబడినదిగాను స్వయంగా కాలేదు.

ఈ రెండుచరిత్రలలో భేదమున్నది. జామపండుచరిత్ర మధ్యలో ఏ అంతరాయమూ లేకపోతే దానికది స్వయంగా ముందుకు సాగుతూపోతుంది. కాని పెన్సిలుచరిత్ర అలాకాదు. అది దానంతటది జరిగే "ప్రయోగం" కాదు. జామపండుచరిత్ర సృష్టిక్రమాన్ని ప్రతిబింబిస్తున్నది. కాని పెన్సిలు చరిత్ర అలాలేదు. చెట్టు కఱ్ఱగాను, కఱ్ఱ పెన్సిలుగాను క్రిమంగా ఏర్పడవు.

జామపండు చరిత్రక్రిమం స్వయం 'నిర్మాణాన్ని' కల్గియుంది. పెన్సిలుచరిత్ర అలాంటి నిర్మాణాన్ని కల్గిలేదు—

## అనుక్రిమం: (Process)

జామకాయ పండుగా యెందుకు పండింది? దానిలోవున్న పదార్థాలూ, వాటి సంయోగాలక్రిమమూ అలావుంది కాబట్టి. అది జామ పండుకాక ముందు జామకాయగా ఉండెను...అదివరకు పూవుగా-మొగ్గగా నుండి క్రిమంగా మార్పునుపొందినది. ఈ మార్పుయొక్క అనుక్రమం స్వయం సిద్ధమైనది. దీన్ని మనం స్వయంసిద్ధ అనుక్రమంగా గమనించాలి. ఇలాంటి స్వయంసిద్ధ అనుక్రిమం పెన్సిలులో లేదు—

పెన్సిలులోవచ్చిన మార్పులు బాహ్య (మనుష్యుని) ప్రమేయముద్వారా వచ్చినవి. అవి స్వయంసిద్ధమైన మార్పులుకాక యాంత్రికమైన మార్పులుమాత్రిమే. ఈ తేడాను మనం గుర్తుంచుకోవాలి.

స్వయంసిద్ధ అనుక్రమాన్ని కల్గియున్న చలనము గతితార్కిక చలనము..

బాహ్య ప్రమేయముద్వారా కలిగే క్రమరహితమైన మార్పులు కేవలం యాంత్రికచలనముమాత్రమే—

ఉదాహరణకు: ఒకచీమను గతితార్కికంగా మనము పరిశీలిస్తున్నాము. అది గ్రుడ్డుగా, చిన్నచీమగా, పెద్దచీమగా...ఇలాంటి స్వయంసిద్ధ అనుక్రమాన్ని కల్గియున్నది. అది మరికొంతకాలానికి ముసలిచీమ కానుంది. ఐతే ఈమధ్యలో మనం దాన్ని నలిపివేశామనుకోండి. ఇక్కడజరిగిందేమిటి? యాంత్రికమైన మార్పువలని అవాంతరం. ఈ అవాంతరం జరుగకపోతే చీమ తప్పక ముసలిచీమ ఐయుండేది...

కాబట్టి మనం జామపండు, భూమి, సమాజవ్యవస్థలపై ఉదాహరణలను పరిశీలించినది స్వయంసిద్ధ అనుక్రమముద్వారానే. అది గతితార్కికము. ఐతే ఒకవేళ పెద్ద ప్రళయము సంభవించి ఈ అనుక్రమములలో మార్పు కలిగినదనుకోండి. అది గతితార్కికముకాక బాహ్య ప్రభావమగు యాంత్రిక పరివర్తన వలన కలిగినదిమాత్రమే....

దీన్ని మరోవిధంగాచూస్తే, స్వయంసిద్ధమైన అనుక్రమంకాక—బాహ్య ప్రభావమైనది యాంత్రిక అనుక్రమము. స్వయంసిద్ధమైన అనుక్రమం గతితార్కికము...యాంత్రిక అనుక్రమం బయటినుండి పడు ప్రభావము. ఈ ప్రభావాన్ని వేసేశక్తులు—స్వయసిద్ధ అనుక్రమ సంచాలనశక్తులకు బాహిరమైనవి. ఐతే, ప్రతివస్తువుకూ స్వయంసిద్ధ అనుక్రమం ఒకేలాగు వర్తింపదు కూడా—

ఇక్కడ మనం మరొకవిషయాన్ని జ్ఞప్తిచేసికోవాలి. గతితార్కిక భౌతికవాదమునకు విజ్ఞానశాస్త్రములూ, వాటి సంయుక్త క్రియాత్మక ప్రభావమూ ఆధారములు. కాబట్టి మనం దాన్ని ఆచరణభాగంనుండి విడదీయకూడదు—అంటే,

గతితార్కిక సూత్రాలను యాంత్రికంగా ఉపయోగపరచుకొనే అధిభౌతిక విధానానికి మనం లొంగిపోకూడదు. "వస్తువులు చలనశీలముల" ని చిలుకపలుకులుగా వల్లింపబడుటవల్ల ప్రయోజనంలేదు. గతితార్కికవిధానం పరిస్థితులకు వాస్తవంగా అన్వయింపబడాలి. పదార్థముల స్వయంసిద్ధ చలన

క్రమాన్ని పరిశీలించుటకు గతితార్కికము సాధనంమాత్రమే. కాబట్టి ఈ సాధనం ఆచరణక్షేత్రంలో ఉపయోగపరచుకోబడినప్పుడే ప్రయోజనం చేకూరగలదు. అలాకానిచో, మళ్ళీ ఆధిభౌతికవిధానం ప్రభావం వేసినట్లే కాగలదు ...

మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ సాంఘికవ్యవస్థను సాకల్యంగా సూక్ష్మంగా పరిశీలించారు. గతితార్కికములైన మార్పులను వారు చిన్నచిన్న విషయాల పరిశీలనద్వారాకూడా ఆచరణాత్మకంగా కనుగొన్నారు. సామ్రాజ్యవాద చరిత్రను గతితార్కికంగా నిర్ధరించుటకు లెనిన్‌కు ఎన్నో సమాజ, ప్రభుత్వశాఖల స్థితిగతులను—అంకెలతోసహా—అతిసూక్ష్మంగా గమనించి సమన్వయించి నిర్ణయింపవలసివచ్చింది.

కాబట్టి "స్వయంసిద్ధ అనుక్రమం" అనే పదాన్నొక "సామెత" గా మార్చి వాడటం నిరుపయోగంమాత్రమే—

ఒకవస్తువు స్వయంసిద్ధ అనుక్రమాన్ని గమనించి దాన్ని పరిశీలించటమే గాక, ఆ పరిశీలన ముగియగానే, ఆ అనుక్రమానికి ఆధారముల అనుక్రమాలను కూడాపరిశోధించుటకు విద్యార్థులు ప్రయత్నించాలి. ఐతే, గతితార్కికసూత్రములే వస్తువులనుగుర్తించి నేరుగాబోధించుటకూ లేక నేర్చుకొనుటకూ ఆధారం కావు. అవి ఆయా వస్తుపరిశీలనకు—దాని చరిత్రగతి పరిశోధనకు మాధ్యమమైన సాధనములుమాత్రమే....గతితార్కికసూత్రములు ఈదృష్టితో గమనింపబడాలి. ఈ సాధనలు ఉపయోగింపబడుటద్వారా ఆచరణకు సమన్వయం కావాలి. అప్పుడే సరియైనఫలితం చేకూరగలదు.



# ద్వితీయసూత్రం—అనుబద్ధ అనుక్రమము.

1. అనుక్రమాల పారంపర్యము—
2. నూతన పరిశోధనలు:- సెల్లు; శక్తి మార్పిడి; పరిణామక్రమం—
3. చారిత్రిక అభివృద్ధి లేక చక్రిక్రమ అభివృద్ధి—
4. పర్యవసానం:

అనుక్రమముల పారంపర్యము:

మనం జామపండు చరిత్రను చదివియున్నాము. దాని అనుక్రమాన్ని గమనించాము. ఆ సందర్భంలో జామపండు చెట్టునుండి వచ్చినట్లు తెలుసుకున్నాము. ఐతే ఆ సమస్య అంతటితో ఆగలేదు. చెట్టు ఎక్కడినుండి వచ్చినదను ప్రశ్నకు దారితీసినది. జామపండు అనుక్రమచరిత్ర, జామచెట్టు అనుక్రమచరిత్ర పరిశీలనకు దారితీసినది. చెట్టు ఎక్కడినించి వచ్చినది? జామపండునించి. పండు రాలి మట్టిలో కలిసి బీజములు మొక్కలై... ఈ విధంగా. ఐతే ఇక్కడ మరొక అనుక్రమముంది. రాలినపండు మట్టిలో ఎలా కలిసింది? ఇక్కడ మనం జామపండు మట్టిలో కలిసి మొక్కగా మారే అనుక్రమాన్ని పరిశీలిస్తున్నాము. వేడి, వాయువు, నీటిప్రభావాలనుగురించి చర్చిస్తున్నాము. ఇలాగే మనం జామపండుతో ప్రారంభించి, చెట్టు అనుక్రమాన్నీ, బీజపు అనుక్రమాన్నీ, భూమి వేడి వాయువు నీరు వీటి సంయోగ అనుక్రమాన్నీ... ఇలాగ అనేక అనుక్రమాలను పరంపరగా పరిశీలిస్తున్నాము. ఇదే రెండవ సూత్రము. ప్రతి అనుక్రమమూ అనేక అనుక్రమాలతో అనుబద్ధమై యున్నదన్నమాట.

మరొక ఉదాహరణ: మనం ఈ పుస్తకాన్ని చదువుతున్నాము. ఈ పుస్తకం ఎక్కడినుండి వచ్చినది? దీన్ని ఒక మార్క్సిస్టు తాత్వికుడు వ్రాశాడు. ఎందువల్ల? మార్క్సిజం ఉండకనుక. మార్క్సిజం ఎలావచ్చింది? ఇలా మనం క్రమక్రమంగా ఒక్కొక్క అనుక్రమాన్ని పరిశీలిస్తున్నాము. మార్క్సిజం శ్రామికవర్గ చైతన్యరూపకంగా వచ్చినది. ఐతే శ్రామికవర్గం ఎలావచ్చినది?...అదొక ఆర్థికవిధానంవల్ల యేర్పడింది. ఆవిధానమేమిటి? ధనికవాదం. ధనికవాదం ఎలావచ్చినది?...ఈవిధంగా మనం సమస్యనొక అనుక్రమముల పరంపరగా పరిశీలిస్తున్నాము.

ఈవిధంగా ఒక అనుక్రమంనుండి మరొక అనుక్రమానికి మన పరిశీలన వ్యాపిస్తున్నది. దీనివల్ల ప్రతిపదార్థమూ తదితరపదార్థములపై తన ప్రసరణను కల్గియున్నట్లు బోధపడ్తుంది. అదే రెండవసూత్రమగు అనుబద్ధ అనుక్రమము.

ఇక ఈ సూత్రపు ప్రయోగభాగాన్ని మనం విపులంగా చర్చించుకొందాము. జామపండు ఉదాహరణనొక అధిభౌతికవాది ఎలాచూచేవాడు? అతడు జామపండు ఎక్కడినుంచి వచ్చిందని ప్రశ్నించుకునేవాడు. "చెట్టునుండి" అని సమాధానంపొందేవాడు.—అంతే.

అట్లాగే ఈపుస్తకం. దీన్నొక మార్క్సిస్టు రచయిత వ్రాశాడనుకునేవాడు. అథవా మరొకమెట్టు వెనుకపోయినా జామపండు చెట్టునుండీ, ప్రకృతినుండీ వచ్చినదనీ, పుస్తకం మార్క్సిస్టు రచయితనుండీ, కమ్యూనిజంనుండీ వెలువడినది అనేవాడు.

ప్రకృతి అనైనా, కమ్యూనిజం అనైనా అనటంలో అధిభౌతికుడీ ప్రపంచాన్నొక 'స్థిర', 'వర్గీకృత' వస్తుసమూహరూపంలో చూస్తున్నట్లు తెలుస్తుంది. కాని గతితార్కికునిదృష్టి వేరువిధంగా ఉన్నది. అతడీ ప్రపంచాన్ని చలనాత్మకమైన అనుక్రమపరంపరగా చూస్తున్నాడు. ఈ దృక్పథమే విజ్ఞానశాస్త్ర ఆధారములకూ, ప్రకృతి సాదృశ్యములకూ సరిపోతున్నది..... అందుకే అది సమాజమునకు సరిగా అన్వయిస్తుంది.

"ఆలోచనయొక్క లేక పరిశీలనయొక్క పాతవిధానం లేక అధిభౌతిక విధానం, ఏదైతే వస్తువులను ఉన్నవున్నట్లుగాను, వర్గీకృతంగాను, "శాశ్వతములు

స్థిరములుగాను చూచుచుండెనో, తన కాలంలో తాను చాలా చారిత్రక ప్రాముఖ్యతను కల్గియుండెను. ”—ఎంగెల్స్.

ఈ ఎంగెల్స్ ఉద్ఘాటన వాస్తవమైనది. అలాగే 18 వ శతాబ్దంలో ప్రకృతినీ, సమాజవ్యవస్థనూ ప్రత్యేకిత వర్గీకృతరూపాలలో విజ్ఞానశాస్త్రాలూ, తత్వశాస్త్రమూ విలోకిస్తుండెను. ఆ దృష్ట్యా సమాజవ్యవస్థలో మార్పులు కల్గుట అసంభవవిషయముగా తోచుచుండెను.

దీన్ని ఎంగెల్స్ ఇలా సూచించాడు—

“ ఈ ప్రపంచం తయారు ‘ సరుకుల ’ ప్రదర్శనశాలకాక నానాముఖ అనుక్రమాల సమ్మేళన అనే మౌలికభావమూ, మన స్థూలదృష్టికి స్థిరరూపంలో తోచే పదార్థాలూ, వాటినిగురించిన మన భావాలూ ఎడతెగని మార్పుకు గురి యౌతూ, ఏ అంతరాయా లెలాఉన్నా అవిచ్ఛిన్నంగా వృద్ధినీ, క్షయాన్నీ పొందుతూ మధ్యన ఎలా కన్పించినా తుదకొక పురోగాముకమైన అభివృద్ధిని చేకూర్చుకోక తప్పవు. ”—ఎంగెల్స్.

అలాగే ధనికవాద సమాజంకూడా ఒక తయారుసరుకుల ప్రదర్శనగా భావింపబడకూడదు. ఇందుకు ప్రతిగా అదొక విభిన్న అనుక్రమాల సమ్మేళనగా గుర్తింపబడాలి.

ఒక అధిభౌతికవాది ధనికవాదసమాజం గతంలో ఎల్లకాలాలలో లేదని అంగీకరిస్తాడు. దానికి నిర్మాణానికొక చరిత్ర ఉందనికూడా అంగీకరిస్తాడు. కాని ఈ చరిత్ర ఇంతటితోనే ముగిసిందని భావిస్తాడు. ఈ వాటిస్థితిని స్థిరమని వాదిస్తాడు.....అలాగే ఈ ప్రపంచంలోని వస్తుకోటికూడా ఒక తయారు సరుకులప్రదర్శనగా భావింపబడుతివి. కాని ఒకక్రొత్త అనుక్రమానికి ప్రారంభములుగా స్వీకరింపబడవు. ఈ ప్రపంచాన్ని దేవుడు సృష్టించాడనేభావంకూడ ఇట్లాంటిదే. అదీ ప్రపంచంలోని వస్తుకోటిని ‘ తయారుసరుకుల ’ ప్రదర్శన అనే నిష్కర్షకే దారితీస్తుంది; దేవుడు ఒక్కొక్క పదార్థాన్ని ఒక్కొక్క విధంగా ఉత్పత్తిచేశాడంటూ శాశ్వతీకృత వర్గీకరణకు దారులుతీస్తుంది. కాని,

గతితార్కికవిధానం ఈదృష్టికి వ్యతిరేకంగా పరిశీలిస్తుంది. ఇది వస్తుకోటిని అచలములుగా కాక అవి చలనమునూ, మార్పునూ పొందుతున్నట్లు విలో

కిస్తుంది. గతితార్కికవిధానంలో ఏదీ తయారుసరుకు కాదు; ప్రతిపదార్థమూ ఒక పాత అనుక్రమానికి అంతముగానూ, క్రొత్త అనుక్రమానికి ఆరంభంగాను ఉంటూ, ఎల్లప్పుడూ మారుతూ, అభివృద్ధిని పొందుతూ ఉంటుంది. అందుకే ధనికవాదసమాజం సామ్యవాదసమాజంగా రూపొందుతుందనీ — నేటి "దశ" సమగ్రమైనది కాదనీ, అది సమగ్రతవంకకు సాగుతుందనీ సిద్ధాంతీకరిస్తుంది. అందుకు దోహదం చేయాలంటుంది.

కాని గతితార్కికచలనం "అనివార్యమైనది" గా అంచనా వేయబడి, "వీరు సమాజంలో మార్పులు జరుగుట అనివార్యమైనదని భావిస్తున్నారు. ఐనప్పుడు వీరు ఊరుకోకూడదూ? విప్లవంవిప్లవం అని కలవరించటమెందుకు?" అని భావింపబడకూడదు. సమాజం మారుతుంది. కాని నూతన సమాజం జన్మించుటకై ఒక మంత్రసానీ అవసరమే. అందుకని విప్లవంయొక్క ఆవశ్యకత ఉంది. ఐతే, ఇక్కడ సమాజపు స్వయంసిద్ధ అనుక్రమ చరిత్రను ముందుకుకాని, వెనుకకుకాని మార్చగల 'మానవుని' పాత్రను మనం మరచిపోకూడదు. ఈ వివరాలను మనం చారిత్రిక భౌతికవాద పరిశీలనసందర్భములో వివరముగా పరిశీలింపగలము—

ఇప్పుడు మనం పరిశీలిస్తున్నది వస్తువుల అంతర్గతమైనశక్తుల స్వయంసిద్ధ అనుక్రమ పరంపరనుగూర్చి. గతితార్కికములలో ఏదీ పరిపూర్ణము కాదు— వస్తువుల అభివృద్ధిక్రమానికి అంతం ఉండదు. ఈ ప్రపంచంలో ఒక ఆట ముగింపు, మరొక ఆటకు ప్రారంభంమాత్రమే—

## 19 వ శతాబ్దపు విజ్ఞానశాస్త్ర వికాసము:

19 వ శతాబ్దపు విజ్ఞానపరిశోధనలే మార్క్స్, ఎంగెల్స్‌లు అప్పటి అధిభౌతికవిధానాన్ని ఖండించి నూతన గతితార్కిక భౌతికవాదవిధానాలను ఆవిష్కరించుటకు దారితీసినవని మనమిదివరకే గమనించాము. అట్టి విజ్ఞాన పరిశోధనలలో మూడు చాలా ముఖ్యమైనవి.

## 1. జీవకణ పరిశోధన; అభివృద్ధి:

జీవకణపరిశోధనలు 19 వ శతాబ్దారంభంలో గొప్ప అభివృద్ధిగాంచినవి.

అంగమపూర్వం ఆధిభౌతిక స్థిరీకరణయే [తర్క విధానం] అమలులో నుండెను. ప్రతివస్తువూ ఒకటికొకటి భిన్నమని భావింపబడుచుండెను. జంతుసముదాయమూ, వృక్షసముదాయమూ వేరువేరుగ వర్గీకరింపబడియుండెను. ఇంతలో 18 వ శతాబ్దపు శాస్త్రకారులు సూచనగా సూత్రీకరించిన పరిణామవాదం విస్పష్టాకారమునుపొందినది. ప్రాణం అనేకజీవకణ జనన-మరణాల సమ్మేళన యనీ—అనేక జీవకణముల కూడలి మన దేహమనీ నిర్ధరింపబడినది. ఈ పరిశోధన జంతువులకూ, వృక్షములకూ మధ్యగల అడ్డుగోడలనుకూడ ఛేదించివేసి ఆధిభౌతికవిధానాన్ని తరిమివేసినది.

## 2. శక్తుల మార్పిడి:

వెలుతురు, వేడి, శబ్దం ఇవన్నీ విడివిడియైనశక్తులని అదివరకు భావం. కాని ఈ శక్తులను ఒకటిని మరొకటి క్రింద మార్చవచ్చునని కనుగొనబడినది. జీవకోటిలోనే కాక అచేతన పదార్థములలోను అనుబద్ధ అనుక్రమముందని నిరూపితమైనది. ఇది ఆధిభౌతికవిదానానికి మరొకపరాజయం. [రేడియం స్వయంగానే సీసంగా మారుతుంది.]

## 3. మనుష్యుని, జంతువుల పరిణామవాదం:

డార్విన్ పరిశోధనవల్ల ప్రపంచంలోని జీవకోటియంతా ఒకానొక కాలంలో ఒకే సెల్లుగల 'ప్రాణు' ల రూపంలో నుండేవనీ, ఆ సూక్ష్మ ప్రాణుల సుదీర్ఘ కాల (స్వయంసిద్ధ) అనుక్రమపరంపరయే నేటి జీవకోటికంతకూ దారితీసినదనీ నిరూపింపబడినది.

ఈ ఆధారంపై ఎంగెల్స్ "అన్ని ప్రకృతి పదార్థాలనూ ఆయా వర్గీకృతరూపాలలో కాక సమన్వయరూపంలో మేళవించేఅవకాశం చేకూరినద" ని కనుగొన్నాడు. విజ్ఞానశాస్త్రం ఈ నూతనదృష్టిని అలవరచుకోసాగింది.

అనగా వృక్ష, జంతు, ధాతుపదార్థాల ఆయా సముదాయాలమధ్య విరామములేని అనుక్రమపరంపరల లంకె ఉన్నదన్నమాట. ఈ అనుక్రమపరంపర అన్యోన్యాశ్రితమైకూడా కొనసాగుతుంది. సమాజవ్యవస్థకూడా అంతే.

మానవసమాజ పరిణామక్రమ చరిత్రలోగల ఆయా సమాజస్వరూపాల మెట్లన్నీ ఒక బారుతీరిన అనుక్రమాల పరంపరమాత్రమే. ఈ సుదీర్ఘానుక్రమ పరంపరలో ఒక స్థితిఅంతమే మరొకస్థితి ఆదిగా చలనం ముందుకు సాగుతుంటుంది.

కాబట్టి విజ్ఞానశాస్త్రిలూ, ప్రకృతీ, సంఘమూ ఇవన్నీ సంక్లిష్ట అనుక్రమాల పరంపరరూపకమైన ఒక రైలుబండియైతే, దాన్నినడిపే మూల సంచాలకశక్తి స్వయంసిద్ధ అనుక్రమరూపకమైన ఆవిరిశక్తియే యని మనమిక్కడ జ్ఞాపకముంచుకోవాలి.

## చారిత్రికాభివృద్ధి; చక్రిక్రమాభివృద్ధి:

మనమిదివరకే జామపండు ఉదాహరణను పరిశీలించాము. జామపండు జీవితమొక అనుక్రమమని తెలుసుకున్నాము.

ఇక్కడ మరొక ముఖ్యవిషయాన్ని మనం గమనించాలి. జామపండు ఎక్కడినుండివచ్చినది? చెట్టునుండి. జామచెట్టు ఎక్కడినుండివచ్చినది? పండునుండి. ఇలాగే గ్రుడ్డునుండి కోడివస్తుంది. మళ్ళీ కోడినుండి గ్రుడ్డు వస్తుంది. గుండ్రగా తిరిగి మళ్ళీ మొదటికే వస్తుందన్నమాట. కాని, ఇక్కడ మనమొక పొరపాటుచేస్తున్నాము. ఎలాగ?

మనం అధిభౌతికధోరణిలో ఈ "చెట్టూ-గింజా, కోడీ-గ్రుడ్డూ; గింజా-చెట్టూ, గ్రుడ్డూ-కోడీ" వలయక్రమాన్ని మొదటిస్థలానికే తిరిగిరావటంగా యాంత్రికీకరించి శాశ్వతీకరిస్తున్నాము. కాని ఈక్రమంలో మనం చారిత్రక అభివృద్ధిని గణించటంలేదు. ఎలాగ? ఈక్రింద ఉదహరిస్తాము.

1. ఒక జామపండు.

2. అది మట్టిలోకలిసి ఒక మొక్క లేక కొన్నిమొక్కలుగా క్రొత్త రూపు దాల్చింది.

3. ఒక జామచెట్టు లేక కొన్నిచెట్లు ఎన్నోజామపండ్లు వేసినవి.

ఇక్కడ మనం మరచిపోయిందేమిటి? మొదటి జామపండే మళ్ళీ చెట్టుకు కాసినదని మనం భ్రమపడ్డాము. నిజంలో ఆపండుకాక అట్టి

ఎన్నో పండ్లు కాసి గొప్ప అభివృద్ధికల్గినది. ఇక్కడ జామపండు జీవితచరిత్ర ఒకచుట్టు తిరిగిరావటంతో చారిత్రిక అభివృద్ధికల్గినది.

1. ఒక జామచెట్టు కాసినది.

2. దానికి కాసిన ఎన్నో జామపండ్లు తిరుగ

3. ఎన్నో జామచెట్లను మొలిపిస్తున్నవి.

ఇక్కడకూడా జామచెట్టుచరిత్రలో గొప్ప అ భి వృ ద్ధి కల్గినదికదా! ఐతే, ఒక జామపండుచరిత్రలోను, ఒక జామచెట్టుచరిత్రలోను మనం గమనింపదగినఅంశం చారిత్రిక అభివృద్ధిఅని మనమిప్పుడు తెలుసుకున్నాము. ఐతే ఈ అభివృద్ధి ఏక్రమంలో వస్తుంది?

ఒక జామపండు చరిత్రవలయం ఒక్కచుట్టు తిరగటంతో చారిత్రికాభివృద్ధికల్గినది. ఒకజామచెట్టు జీవితవలయం ఒకచుట్టుతిరగటంలోను చారిత్రికాభివృద్ధి వచ్చినది. ఇలా చరిత్రక్రమపు ప్రతి తిరుగుడులోను అభివృద్ధి కల్గుతున్నది. ఈవిధంగా తన అభివృద్ధి 'గుర్తును' వేయకుండా కాలం ముందుకు సాగదు. అంటే, కాలం గడుస్తుంది, కాని పాతఫలితమే మరొకసారి తిరిగి రాదు. ప్రతిసారీ అభివృద్ధియుత నూ త న చారిత్రికఫలితం వస్తుంది. ఈ చారిత్రికాభివృద్ధిస్తరం ఎప్పుడూ ఒకలాగేఉండక ప్రతిచుట్టుకూ "ఉన్నత తర" మౌతుంటుంది...

ఈ ఉదాహరణలవల్ల తేలేదేమిటి? పదార్థాలజీవనం గుండ్రని చక్రక్రమ గమనాన్ని కల్గియున్నది. కాని ఈ చక్రక్రమంలో నడక మళ్ళీ పూర్వపు ప్రదేశానికి వచ్చేసరికి చరిత్ర తనగుర్తును వేస్తుంది. అక్కడినుండి భ్ర మ ణ పు "స్తరం" చారిత్రిక అభివృద్ధిరూపంలో ఉన్నతతరమైపోతూ ఉంటుంది. ప్రతి భ్రమణములోను క్రొత్త ఉన్నతతర స్తరం ఏర్పడుతుంటుంది.

ఇలా, కాలంయొక్క గమనం చక్రాకృతిలో కొనసాగి, చారిత్రిక అభివృద్ధి ప్రతిపదార్థపు జీవితగతిలోను క్ర మం గా ఉన్నతదశకు చేరుతూ ఉంటుంది.

[అభివృద్ధి నిచ్చెన మెట్లవలె సూటిగా వరుసగా సాగక ఒడుదొడుకు లుగా ముందుకు సాగుతుంటుంది. దీనికి కారణం అభివృద్ధిచరిత్రలో వచ్చే వివిధానుక్రమాల వైవిధ్యమే అనునది ఇక్కడ ప్రత్యేకంగా గమనింపదగినది.]

ఈ అవిచ్ఛిన్న చలనక్రమానికి ప్రకృతీ, సంఘమూ భావమూ లోబడి యున్నవి. కాబట్టి ఇవన్నీ చక్రక్రమబద్ధమైన చారిత్రికాభివృద్ధిని పొందుతూ అనవరతం ముందుకు సాగుతుంటాయి. ఐతే, దీనంతటికీ మూలవిరాట్టుమాత్రం పదార్థ అంతర్గతమైయున్న స్వయంసిద్ధ అనుక్రమగతియే—

పర్యవసానం;

ఇప్పుడు మనం (1) చలనాన్నీ, అనుబద్ధ అనుక్రమమునూ పరిశీలించాము. ఈ రెండూ తెలియకుండా మనం మూడవసూత్రమైన వ్యతిరేకతా సూత్రాన్ని అర్థంచేసికోలేము. ఎందుకంటే ఆసూత్రం వివరించేది గతితార్కిక చలనాన్నీ లేక స్వయంసిద్ధ అనుక్రమాన్నీ దాని ఆధారాన్నీ.

మొదటిప్రకరణంలో గతితార్కికవిధానాన్ని ఇటీవలివరకూ అధిభౌతిక విధానం ఎందువల్ల అణచియుంచగల్గిందో, 18వ శతాబ్దపు భౌతికవాదం ఎలా అధిభౌతిక భౌతికవాదమో గమనించాము. ఆపిదప 19వ శతాబ్దపు మూడు గొప్ప పరిశోధనలు, భౌతికవాదాన్ని ఎలా గతితార్కిక భౌతికవాదంగా నిర్మాణంచేసినవో గమనించి, భౌతికవాదంయొక్క (1) గ్రీకులకాలంనాటి 'అణు భౌతికవాద' స్వరూపాన్నీ (2) 18వ శతాబ్దపు అధిభౌతికమైన భౌతికవాద స్వరూపాన్నీ (3) ఆధునిక గతితార్కిక భౌతికవాద స్వరూపాన్నీ పరిచయం చేసికొనియున్నాము.

భౌతికవాదం విజ్ఞానశాస్త్రాలతో పుట్టి, విజ్ఞానశాస్త్రాలతోపాటు ముందుకుసాగిందనీ, వాటితో గాఢ సమన్వయాన్ని కల్గియున్నదనీ గమనించాము. దాన్ని పై మూడుప్రకరణాలలో సోదాహరణంగా నిరూపించుచున్నాము. గతితార్కిక చలనసూత్రంతోను, అనుబద్ధ అనుక్రమసూత్రంతోను విజ్ఞానశాస్త్ర సమన్వయాన్ని అర్థంచేసికొన్నాము. ఈ విధంగా మనం విజ్ఞానశాస్త్రాల ఆధారాలపైననే ముందుకు కొనసాగిపోతున్నాము.

శాస్త్రీయ పరిశోధనలు తరుచు గుప్తంగా ప్రత్యేకింపబడియున్న ఈ రోజులలో, పైగా శాస్త్రజ్ఞులే తమతమ శాస్త్రాల సంచయాలను సమన్వయించి అవి గతితార్కికశీలములైయున్నవని తెలిసికొనలేని పరిస్థితులలో, సువ్యాప్తమైన ప్రపంచసమస్యలనూ, సృష్టిక్రమమునూ బోధింపవలసినదగు గతితార్కిక భౌతికవాదం (తత్వశాస్త్రం) విజ్ఞానశాస్త్ర అధునాతన పరిశోధన పరంపరల వృద్ధిక్రమంతో సమన్వయరూపకంగా, తన ఆదర్శాన్ని నిశితతరంగా సానపెట్టుతూ డెస్కార్టెస్ కలగాంచినట్లు "మానవుణ్ణి సృష్టియొక్క యాజమానిగాను, నియంతగాను" తీర్చిదిద్దుటకు ఎలా అనవరతకృషి కొనసాగిస్తూ ముందుకు కొనసాగుతున్నదో మనమీ ప్రకరణాలలో క్రమక్రియంగా గమనిస్తున్నాము.



# మూడవసూత్రం; వ్యతిరేకత.

1. బ్రతుకూ, చావూ:
2. వస్తువులు తమ వ్యతిరేకతలుగా మార్పుబొందుతవి:
3. సిద్ధాంతం, పూర్వపక్షం, పూర్వపక్ష పూర్వపక్షం:
4. పదార్థమునకు మూలంఏమి?
5. వ్యతిరేకతల కలయిక:
6. కొన్ని పొరపాట్లు—
7. పర్యవసానం:

పదార్థము సంతతమగు మార్పును కల్గియుంటుందనీ, నిరంతర పరిణామ క్రమాన్ని కల్గియున్నదనీ, అంటే గతితార్కిక చలనాన్ని కల్గియున్నదనీ (1వ

సూత్రం) మనం గమనించాము. ఈ గతితార్కిక చలనం ఎలా సాధ్యమన... మనం పరిశీలించే ప్రతివస్తువూ, ఆ పరిశీలిస్తున్న సమయంలో, తత్పూర్వ అనుక్రమపరంపరయొక్క అప్పటిదశనీ, అనుక్రమపరంపరల ఆదశ ఇంకా భవిష్యత్తువంకకు పరిణమిస్తుందనీ తెలుసుకున్నాము. ఇలా ప్రస్తుతదశ పాతఅనుక్రమాల గొలుసుకుఅంతిమనీ, క్రొత్త అనుక్రమాలగొలుసుకు ప్రారంభమనీ గుర్తించాము. ఇది స్వయంసిద్ధ అనుక్రమమూలకమైనదనీ అనివార్యమూ, అవిచ్ఛిన్నమైన చలనమనీ అర్థంచేసికొన్నాము.

ఈ అనుక్రమపరంపర చక్రాకారంలో కొనసాగుతుందనీ, అది ప్రతి తిరుగుడులోను చారిత్రిక అభివృద్ధిని చేకూర్చుకుంటుందనీ గమనించాము ఈ చలనచరిత్ర స్వయంసిద్ధ అనుక్రమమూలకమైనదని చదివాము. ఐతే ఇక ఈ స్వయంసిద్ధ చలనపు అనుక్రమానికి గుణధర్మాలేమిటి ?... లేక గతితార్కిక చలనానికి మూలసూత్రాలేమిటి ? అనుప్రశ్న ఉదయిస్తుంది.

పదార్థం శాశ్వతమైనదికాదనీ, దానికొక ఆదీ, మధ్యా, అంతమూ (జననం, వృద్ధి, నాశం) కలిగిస్తాయనీ గతితార్కికవిధానం చెప్తుంది. ప్రతివస్తువూ ఈ దశలన్నిటినీ గడుస్తుంది....ఎందువల్ల ?...పదార్థాలు శాశ్వతమైనవి యెందుకుకావు ?...

ఈ ప్రశ్న చాలా ముఖ్యమైనది.... "మనకీ పుట్టుకా, చావూ ఎందుకున్నాయో" అనుప్రశ్నను మానవుడు వేలేండ్లుగా వేసుకుంటూనే ఉన్నాడు. చావులేకుండు స్థితిని ఊహించుకొని ఎన్నో వింతకథలల్లుకుంటూనే ఉన్నాడు. ఆయుర్వృద్ధికి మంత్ర-తంత్రాలనూ ఆశ్రయిస్తూనే ఉన్నాడు. కాని పుట్టుకా, చావూమాత్రం తప్పటంలేదు....

## బ్రతుకూ, చావూ:

అసమగ్రదృష్టిని కల్గియున్న ఆధిభౌతికవిధానం ఈ సమస్యనెలా చూస్తుంది ? ఏకపక్షదృష్టితోమాత్రమే. ఒక ఆధిభౌతికుడు చావును చావుగాను, బ్రతుకును బ్రతుకుగాను విడివిడిగా, వర్గీకృతంగా, అసమగ్రతతో చూస్తాడు. చావును చావుగాను, బ్రతుకును బ్రతుకుగాను విడివిడిగా శోధిస్తాడు. ఈ రెంటికీ అన్యోన్య సమన్వయం లేదని శాశ్వతీకరిస్తాడు. ఒకడు చచ్చీ, బ్రతికీ

ఉండటం ఒకే కాలంలో అసంభవమని తర్క వాదం చేస్తాడు... విరుద్ధాలను కలప కుండా మడికట్టుకుంటాడు.

ఇది అసమగ్రమైన పైపై పరిశీలనమాత్రమే. ఒకవేళ విషయాన్ని సూక్ష్మంగా విలోకిస్తే వెంటనే అలా రెంటినీ విడదీయటానికి వీలులేదని తెలుస్తుంది. "చావు సజీవ పదార్థంలోనుండియే కల్గుతుంది. చావులేకుండా బ్రతుకు అసంభవం. చావు బ్రతుకును ముందుకు కొనసాగిస్తుంది. చావు నుండి బ్రతుకు యేర్పడటం సహజమే. ఒక శవం భూమిలో సంయోగమై, ఎరువుగా మారి నూతనజీవాలను అంకురిస్తుంది. శవంనుండి ఎన్నో సూక్ష్మ జీవులూ, క్రిములూ జీవితాన్ని పొందుతవి. ఒక ప్రాణి జీవితపు అవిరతక్షణాలలో ఎడతెగకుండా నూతన జీవకణాలను తమ స్థానాన్నిస్తూ మరణిస్తున్న అనేక జీవకణాల మరణపుఅంశం గర్భితమైయుంటుంది."... ఈ వివరాలవల్ల తేలేదేమిటి?

బ్రతుకూ చావూ ఎప్పుడూ ఒకటి మరొకటిగా మారిపోయే చక్రక్రమాన్ని కల్గియున్నదని. ఎల్లప్పుడూ ఇట్లే పదార్థము తన వ్యతిరేకరూపమును చేకూర్చుకుంటుంది. ఇది గతితార్కిక తృతీయసూత్రము.

## పదార్థాలు తమనుతాము తమ వ్యతిరేకపదార్థాలుగా మార్చుకుంటాయి:

మనం నిజాన్నీ, అబద్ధాన్నీ పరిశీలిస్తే ఈ రెండూ సంబంధం లేనివిగా కనపడుతవి. "నిజం నిజమూ; అబద్ధం అబద్ధమూ" అని ఈ రెండూ విడిపోయి, పరస్పర వ్యతిరేకములుగా శాశ్వతంగా వర్గీకరింపబడటం జరుగుతుంది. ఐతే, ఇక్కడకూడా పై చావు-బ్రతుకులసమస్యలోవలెనే మనదృష్టి అసమగ్రమైయున్నది.

ఒక ఉదాహరణ: ఆకాశంలో మెరుపు మెరుస్తుంది. మనం "అదిగో మెరుపు మెరుస్తోంది" అనే అంతలోనే అది మాయమౌతుంది. మనం చెప్పటం ప్రారంభించిన తక్షణంలో మెరుపు నిజం — ముగించినక్షణంలోనో? అ నిజం తప్పుగా మారిపోయింది. ఈ విషయాన్ని గ్రీకులు ఏనాడో గమనిం

చారు. వారిలా అనుకునేవారు. "నీవు తప్పువిషయాలు చెప్పకుండా ఉండాలంటే, ఏమీ చెప్పకు" అని. ఇది నిజమేనేమో!

...జామపండు ఉదాహరణను మనం మరొకమారు తీసుకుందాము. ఒక జామపండు నేలపైరాలి పడియుండి కొంతకాలమైనది. దాన్ని చూచి "అదిగో జామపండు రాలియున్నద"ని మనమంటాము. కాని వాస్తవంలో అదివరకే అది కొంత కుళ్ళిపోసాగింది. మరికొంతకాలానికి పూర్తిగా కుళ్ళి మట్టిలో కలిసిపోతుంది. ఇలా నిజం అబద్ధంగా మారిపోతూఉంటుంది.

విజ్ఞానశాస్త్రాలలోను ఎన్నో సూత్రాలు, ఒకప్పుడు వాస్తవములని భావింపబడినవి, తిరిగి శాస్త్ర పరిణతతరదశలో, అసత్యములని విసర్జింపబడినవి. ఈ విధంగా వాస్తవం కాలక్రమంలో అవాస్తవంగా మారిపోయినది.

ఇట్లాగే అవాస్తవం వాస్తవంగాను మారుతుంటుంది. ఈజిప్టులో పూర్వకాలంలో సూర్యుని చలనం గుర్తింపబడి, సూర్యుని అస్తమయ ఉదయాలకు దేవతలయుద్ధాలు కారణమని భావింపబడుచుండెను. ఐతే సూర్యుడిని ఆ దేవతలు అటూ-ఇటూ లాగి కదలించినమాట అసత్యమే. కాని, నేడు విజ్ఞానశాస్త్రంకూడా సూర్యునిచలనానికి కొన్ని గొప్పశక్తులు ఆధారమని అంగీకరిస్తున్నది. దీనివల్ల పొరపాట్లు యధార్థానికి సరిగా విరుద్ధమైయుండనక్కరలేదని తెలుస్తుంది. కాగా, మధ్యకాలంలో విజ్ఞానశాస్త్రజ్ఞులే సూర్యునికి చలనంలేదని భ్రమపడ్డారు.

మొత్తంమీద, పదార్థానికే శాశ్వతస్థితి లేనప్పుడు, దాన్నిగూర్చు భావానికి "నిత్యసత్య" రూపం ఎలాగూ ఉండదని ఇక్కడ మనం మరొకమారు జ్ఞాపకంచేసుకోవాలి. వస్తుస్థితి మార్పుతో దాన్నిగూర్చు భావపు సత్యత్వంకూడా మారకతప్పదు. పై మార్పుసత్యాన్ని అసత్యంగామార్చి దాని నిత్యత్వాన్ని భ్రమగా నిరూపిస్తుంది....

ఐతే, పదార్థాలు తమనుతాము తమ వ్యతిరేకతలుగా మార్చుకుంటాయి. జీవితం—మరణంగా మారుతుంది. ఎలాగ?

దీనికి సాముదాయికమైన సమాధానమిది. ఒకవేళ నూటికినూరుపాళ్ళు బ్రతుకేఐతే, ఇక చావుండకూడదు. లేక నూటికినూరుపాళ్ళు చావేఐతే,

బ్రతుకుండగూడదు. కాని ఈలోకంలో చావూ–బ్రతుకూ రెంటినీ మనం చూస్తున్నాము. కాబట్టి చావులో బ్రతుకు, బ్రతుకులో చావుల అనుక్రమం మనకీ ప్రపంచంలో స్పష్టంగా కనపడ్తున్నది.

ఇలాగే ఒక జీవజంతువుశరీరంలో జీవకణాలు అనవరతం ఎలా చస్తూ–పుడ్తూఉంటారో మనమిదివరకు గమనించియేయున్నాము. అది బ్రతుకులో చావునే నిరూపించిందికదా !...గతయుద్ధంలో, ప్రత్యేకపరిస్థితులలో, చని పోయినవారి రక్తాన్ని నిలువచేసి, నీరసించిన సైనికులకు దానితో నూతనశక్తి చేకూర్చబడినది. దీనివల్ల చనిపోయినవారి రక్తంకూడా జీవశక్తిని ప్రసాదించునట్లు తెలుస్తున్నది చావులో బ్రతుకుకు ఇదొక వైజ్ఞానికనిదర్శనం.

వస్తువుయొక్క చలనమూ, మార్పూ కేవలం ఆ వస్తువును మరొకవస్తువుగా పరిణమింపజేయక, దాని వ్యతిరేకవస్తువుగానే పరిణమింపజేస్తుంది. ఎందుకంటే, ప్రతివస్తువూ తనవ్యతిరేకతను తనలోకల్గియుంటుంది. ప్రతివస్తువు తానూ, తన వ్యతిరేకవస్తువుగా సమన్వితమైయుంది. [అంటే తనస్థితీ, తన నాశమూతోనన్న మాట.]

ఒకవేళ మనం వస్తువునొక బంతిగాభావిస్తే, ఆబంతి (లోపలి) మధ్యభాగంనుండి పైకి ఉబుకుతున్న జీవశక్తితోనూ, పైభాగంనుండి (లోపలి) మధ్యభాగమునకు అదుముతున్న మరణశక్తితోనూ సమన్వితమైయున్నట్లు గ్రహింపవలసియుంటుంది.

ఇలాగే ప్రతివస్తువూ జీవన, మరణ (పరస్పర వ్యతిరేక) అనుక్రమ సమన్వయంగా ఉంటుందన్న మాట.

ఐతే, వస్తువులోఉండే ఈ పరస్పర వ్యతిరేక (జీవన, మరణ) శక్తులు ఏంచేస్తాయి ? ఈ రెంటిమధ్యా పరస్పర విరుద్ధమైన ఎడతెగనిఘర్షణ కొనసాగుతుంటుంది. ఒకటి అస్తిత్వంవైపూ మరొకటి నాస్తిత్వంవైపూ సిద్ధాంత పూర్వపక్షములవలె అన్యోన్య వ్యతిరేక పోరాటాన్ని సాగిస్తుంటవి. ఈ వ్యతిరేకతయే ప్రతివస్తువులోనూ ఉంటుంది.

ఇందులో అస్తిత్వ (సిద్ధాంత) శక్తులు జీవితాన్ని కాపాడుటకూ, నాస్తిత్వ (పూర్వపక్ష) శక్తులు జీవితాన్ని తుదముట్టించుటకూ పోరాడుతుంటవి.

ఈ ఉభయశక్తుల మధ్యభాగమే వ్యతిరేకత లేక విరుద్ధత. ఈ వ్యతిరేకత లేక విరుద్ధతమూలంగానే పదార్థంలో చలనం కల్గుతున్నదని గతితార్కికములు నిరూపిస్తవి.

పదార్థముల (స్వయంసిద్ధ) అనుక్రమమూ, చరిత్రా ఆ పదార్థాలలోని జీవన, మరణశక్తుల విరుద్ధతవలననే. పదార్థములు మారుటకు వాని అంతర్గతములైయున్న విరుద్ధతలే హేతువులు—ఇదే గతితార్కికముల మూడవసూత్రం.

## సిద్ధాంతము—పూర్వపక్షము; పూర్వపక్ష పూర్వపక్షము:

సర్వసాధారణంగా సిద్ధాంతమనగా ఒకవస్తువును 'ఔను' ని నిరూపించటమూ, పూర్వపక్షమనగా అది కాదని వ్యతిరేకించటముగా అనగా ఒక 'పదాల' ఘర్షణగా భావింపబడ్తుంది. కాని గతితార్కిక సిద్ధాంత పూర్వపక్షఘర్షణ అట్లుకాక పదార్థములలోని విరుద్ధతల అంతర్గతపోరాటమని మనము పైన తెలిసికొనియున్నాము.

సమాజంలోను 'వ్యతిరేకత' ఉంది. అంటే అది కొన్ని సమస్యల విషయంలో కొందరు "ఔననటమూ," కొందరు "కాదనటమూ" గా 'మాటల' రూపంలోనే ఉందని భావింపబడకూడదు. అట్లుకాక వ్యతిరేకత సమాజాంతర్గతమైన ఆయా పరిస్థితులు, వ్యవస్థలలో ఉంటుంది. ఒకటి ధనికవాదం తననుతాను కాపాడుకొను వైఖరి. మరొకటి ధనికవాదాన్ని ఖండించు వ్యతిరేకవైఖరి; లేక సామ్యవాదవైఖరి. ఈ రెంటివిరుద్ధత సమాజ వ్యవస్థలోనే నిహితమైయున్నది. అందువల్ల ధనికవాదం తన వ్యతిరేకతయగు సామ్యవాదాన్ని సృష్టింపకుండా కొనసాగుతూ ఉండజాలదు. మార్క్స "ధనికవాదం తనంతతానే తన గోరీలు త్రవ్వేవారిని సృష్టించుకుంటుంది." అని అందుకే అన్నాడు.

అంటే ధనికవాదం తనంతతానే అంతమైపోతుందని కాదు. అది తనను తాను కాపాడుకొనుటద్వారానే తనకు వ్యతిరేకతను పుట్టించుకొని దాన్ని పెంచుకుంటుంది.

ఉదాహరణ: ఒకకోడి గుడ్డుపెట్టి దాన్ని పొదుగుతుంది. గుడ్డులో ఒక కీటకం ఉంటుంది. అది కొంత వేడి, మొదలగు కొన్ని పరిస్థితులలో

ఎదుగుతుంది. గుడ్డులోని కీటకం క్రమంగా ఎదుగుతూ, నశిస్తూ కోడిపిల్లగా మారుతుంది. ఐతే ఈ ఎదిగే క్రమంలో కీటకం అస్తమయమూ, కోడిపిల్ల ఉదయమూ సమన్వయమైయున్నవి. గుడ్డు గుడ్డుగా ఉండుటనూ, కోడిపిల్లగా మారుటనూ ఘర్షణ కొనసాగి తుదకు గుడ్డు తన వినాశక్రమానికి లొంగిపోయి, కోడిపిల్లగా మారుతుంది....ఇలాగే, ప్రతివస్తువూ ఈ క్రిందిక్రమానికి లోనౌతుంది.

(1) సిద్ధాంతం లేక స్థితి (Thesis.)

(2) పూర్వపక్షం లేక నాశం (Anti-thesis.)

(3) పూర్వపక్షపూర్వపక్షం లేక నాశంయొక్క నాశం (Synthesis)

గుడ్డు, స్థితి దాని సిద్ధాంతం. దాని పూర్వపక్షం లేక నాశం కోడిపిల్లగా మారే క్రమం. కాని కోడిపిల్ల (పూర్వపక్షం) ఎల్లకాలమూ కోడిపిల్లగానే ఉండదు. అదిఎదిగి క్రమంగా పెద్దకోడి ఔతుంది. ఇలా పూర్వపక్షం పూర్వపక్షమైపోతుంది.

గతితార్కిక చలనం ఈ క్రమంలో కొనసాగుతుంటుంది. మరొక ఉదాహరణ:

ఒకబీజం నేలలోకలిసి మొక్క ఔతుంది. బీజం సిద్ధాంతం లేక స్థితియైతే దీని వ్యతిరేకత మొక్క. ఐతే ఈ మొక్క క్రమంగా పెరగటంలో తిరిగి వ్యతిరేకత యేర్పడుతుంది. మొక్క మళ్ళీ బీజాలరూపాన్ని దాల్చి పూర్వపక్షం పూర్వపక్షమైపోతుంది.

పై ఉదాహరణలవల్ల మనం గమనింపవలసిందేమిటి ? గతితార్కిక వ్యతిరేకత అనగా (పూర్వపక్షం లేక) నాశమని. ఏదైతే నశిస్తుందో లేక ఏదైతే నశింపజేయబడుతుందో అది వ్యతిరేకతను లేక పూర్వపక్షాన్ని కలిగియున్నదని. సమాజచరిత్రలో—

(1) భూస్వామ్యవిధానం బానిసవిధానపు వ్యతిరేకత లేక పూర్వపక్షం.

(2) ధనికస్వామ్యవిధానం భూస్వామ్యవిధానపు వ్యతిరేకత లేక పూర్వపక్షం.

(3) సామ్యవాదవిధానం ధనికస్వామ్యవిధానపు వ్యతిరేకత లేక పూర్వపక్షం.

ఈ క్రమపరిణామాన్ని మనం చూస్తున్నాము.

ఇక్కడ గమనింపవలసిందేమిటి? బానిససమాజపు స్థితిగతులే భూస్వామ్య సమాజావిష్కరణకు దారితీసినవి. అలాగే భూస్వామ్యసమాజమే తన విరుద్ధతయగు ధనికస్వామ్యసమాజాన్ని ఆవిష్కరించింది. అలాగే ధనిక స్వామ్యసమాజమే సామ్యవాద విరుద్ధతను కల్పించుచున్నది. పుత్రాదిచ్ఛేత్ పరాజయమన్నట్లు తమ వ్యతిరేకతలతో తుదివరకు పోరాడి ఆయా సమాజ వ్యవస్థలు అంతరించాయి.

ఈ వ్యతిరేకతలఘర్షణ ఎల్లప్పుడూ కొనసాగుతుంటుంది. ఐతే ఈ గతి తార్కిక వ్యతిరేకతకూ కృత్రిమ వ్యతిరేకతకూ భేదముంటుందని మనమిక్కడ గమనించాలి.

వ్యతిరేకత లేక పూర్వపక్షం అంటే గతితార్కికమగు "నాశ"మే. కాని ప్రతి "చావూ" కాదు. మనమొక ఈగను చంపుతాము. అది గతితార్కిక నాశం లేక పూర్వపక్షంవల్ల చనిపోలేదుకదా. కాబట్టి అది యాంత్రికమైనచావేకాని గతితార్కిక చలనానికి సంబంధించినదికాదు. అట్టి చావులో స్వయంసిద్ధ అనుక్రమంలేదు. కాబట్టి అది కేవలం యాంత్రికమే.

గతితార్కిక చలనం సంఘటనపరంపరగా కొనసాగుతుంది. స్థితినుండి స్వయంసిద్ధ అనుక్రమంలో వచ్చిన నాశమే గతితార్కిక పూర్వపక్షం లేక వ్యతిరేకత ఔతుంటుంది. పొదుగబడిన గ్రుడ్డు గ్రుడ్డుయొక్క స్థితి (లేక సిద్ధాంతంగా) దాని (పూర్వపక్షాన్ని లేక) వ్యతిరేకతయగు కోడిపిల్లగా మారుతుంది. కోడిపిల్ల రావటంతో గ్రుడ్డు నశించిపోతుందికదా!

అలాగే కోడిపిల్లలోను ఘర్షణ కొనసాగుతుంది. గ్రుడ్డునుండి కోడి పెట్టగా పెరిగి తిరిగి గ్రుడ్లుపెడ్తుంది. ఈ గ్రుడ్లు కోడిపిల్లయొక్క లేక వ్యతిరేకతయొక్కవ్యతిరేకత. ఇలా తిరిగి గ్రుడ్డులో మరొక సంఘర్షణపరంపర ప్రారంభమౌతుంది....ఒక బీజంలోను ఇలాంటి స్థితి, నాశం, నాశస్థితి నాశం (లేక పూర్వపక్ష పూర్వపక్షం) కొనసాగుతుందని మనం పైన చదివియున్నాము.

ఇక మరొక ఉదాహరణను పరిశీలింతాము.

తొలిదశలో భౌతికవాదం తగిన విజ్ఞానశక్తిని కల్గలేక తన వ్యతిరేకత యగు ఆదర్శవాదాన్ని బలపరచింది. పూర్వం భౌతికవాదాన్ని రూపుమాపిన ఆదర్శవాదం తిరిగి నేడు శాస్త్రీయపరిణతిని చేకూర్చుకున్న ఆధునిక భౌతిక వాదంచే అణగద్రొక్కబడుచున్నది. ఇలా వ్యతిరేకతకు వ్యతిరేకత కలుగు తున్నది....

ఇలాంటి క్రమాన్నే సమాజంకూడా కల్గియున్నది. మొదట 'స్వంత' ఆస్తివిభేదాలులేని ఆదిమకమ్యూనిజం ఉండెను. ఆవ్యవస్థలో భూమి సమష్టి యాజమాన్యంక్రింద ఉంటుండేది. ఆస్థిత అధికోత్పత్తికి ఉపకరింపక తన వ్యతిరేకతయగు వస్తుమార్పిడి సమాజస్థితిని ఆవిష్కరించింది. ఇది క్రమంగా తన వ్యతిరేకతయగు బానిససమాజంగాను, అలాగే భూస్వామ్యవిధానంగాను దాని ప్రతిఘాతగా రాచరికంగాను, దాని ప్రతిఘాతగా ధనికవాద సమాజం గాను మారుతూవచ్చినది. ఈవాదు తిరుగ శ్రామిక ప్రజాస్వామ్యంద్వారా కమ్యూనిజంవంకకు కొనసాగుతున్నది.

ఇక్కడ ఒక్కొక్క సమాజస్థితి క్రమంగా మరొక సమాజస్థితికి వ్యతి రేకంగా లేక ప్రతిఘాతగా యేర్పడుతూవచ్చినది. తుదకు తిరుగ 'కమ్యూ నిజందశ' పునరావిష్కరణ యగుటతో ఒక చక్రక్రమంలో దాని చరిత్ర పూర్తి యగుచు చారిత్రికాభివృద్ధి యేర్పడుచున్నది. ఆదిమ సమాజకాలంలో ఉత్పత్తి క్షీణదశలో నుండెను. కాని నేడు బ్రహ్మాండమైన అర్థికోత్పత్త్యభి వృద్ధి యేర్పడినది...ఇదే చారిత్రిక అభివృద్ధి.

ఇక్కడ పొందుపరుపబడిన (పై) ఉదాహరణలన్నిటిలోను మనం చక్ర క్రిమ అనుక్రమాన్ని—తన్మూలకమైన చారిత్రికాభివృద్ధిని సమన్వయించుకో వచ్చును. కాని ఇక్కడొక హెచ్చరిక చేయకతప్పదు. మనం మనముం దుకువచ్చు ప్రతివస్తువుకూ చాదస్తంగా "సిద్ధాంతం, పూర్వపక్షం, పూర్వ పక్ష పూర్వపక్షం" అనేసూత్రాన్ని "గీటురాయి" గా ఉపయోగింపకూడ దు. ఈ క్రమం గతితార్కిక పరిణామమునకు సంబంధించినది. మనం ప్రతి అంశానికీ ఈ క్రమాన్ని పూర్తిగా సమన్వయింపజాలము. ఆయా పరిణామ క్రమాలు పరిపక్వంకాని కారణాన, అనేకచోట్ల మనకు మొదటి రెండుదశలు

మాత్రమే కన్పింపవచ్చును. లేక ఒక్క మొదటిదశమాత్రమే కూడ. అట్టి విషయాలనుమనం మూడవదశతో సమన్వయించుట కుదరజాలదు. అందుకై యాంత్రికంగా మనం పై మూడుసూత్రాలనూ ప్రతిదానికీ అంటగట్ట ప్రయత్నింపరాదు. ఇంతకూ మనం గమనింపవలసిన ముఖ్యాంశం గతితార్కికము లలో అతిముఖ్యమైన (స్వయంసిద్ధ అనుక్రమమూలకమగు) వ్యతిరేకతమాత్రమే. గతితార్కికములలో వ్యాఘాతరూపకమైన ఈవ్యతిరేకత చాలా ప్రధానమైన సూత్రము.

(1) పరిణామం లేక చలనం, (2) చారిత్రిక అభివృద్ధిమూలకమైన చక్రక్రమచరిత్ర. ఈ రెండూ వ్యతిరేకతల ఘర్షణమూలముగా కొనసాగునట్టివే. ప్రతివస్తువునందూ అంతర్గతమైన వ్యతిరేకశక్తులఘర్షణ కొనసాగుతున్నందువల ననే దానికి పరిణామమూ, చరిత్రా యేర్పడుచున్నవి.

పదార్థముయొక్క మూలము:

గతితార్కికవిధానం మన ఆలోచనకు సూక్ష్మతరమైన మార్గమనీ, దీని మూలంగా మనవాదన, విశ్లేషణ, పదార్థముల మౌలికదశవరకు కొనసాగి, వాటిచరిత్రను వివరించేందుకు సమర్థమైయుండునని మనమిదివరకే తెలిసికొని యున్నాము.

ఒకప్పటి " ఆలోచనల పాతవిధానం " అప్పటి కాలపరిస్థితులకు అను గుణ్యమైయుండెను. ఇప్పుడు మనం చలనవిధానంలో ఆలోచిస్తూ ఏవస్తువూ చలన (మార్పుకూడా) రహితమైనదికాదనీ, అది పైకి చలనరహితంగా కన్పించి నా అనుక్రమాల నిరంతరపరంపరను కల్గియున్నదనీ, ప్రతివస్తువుయొక్క ప్రతి దశా ఆదినీ, అంతమునూ కల్గియున్నదనీ—[మధ్యన అవాంతరాలువచ్చినా తుదిని చారిత్రికమైన అభివృద్ధి రాకమానదనీ] గమనించాము.

కాబట్టి గతితార్కికవిధానమే వస్తువు పురోగతినీ, అభివృద్ధినీ గమనిం చుటకు సమర్థమైయున్నది. ఆవిధానమే మనకు పాతవస్తువుల నాశాన్నీ, క్రొత్తవస్తువుల పుట్టుకనూ విదమరుస్తుంది. గతితార్కికములే ప్రతివస్తువు యొక్క వృద్ధిపరిణామాలను ఆవస్తువు అంతర్గత వ్యతిరేకతఘర్షణద్వారా నిరూ

పించగలదు...గతితార్కికదృష్ట్యా వస్తువుల సహజాభివృద్ధిక్రమం లేక పరిణామం వాటి అంతర్గతశక్తుల లేక ధర్మాల అనవరత పరస్పర వ్యతిరేకఘర్షణ మూలకమైనది...ఇది ప్రకృతికీ, మానవునికీ, భావానికీ సమన్వయిస్తుంది.

కాబట్టి ప్రతివస్తువూ చలనాన్నీ (మార్పునూ) కల్గియున్నదనునది గతితార్కికముల ప్రథమసూత్రము. "ఎప్పుడూ ఏదీ ఒకేరీతిగా నుండదు, ఒకే స్థలంలో ఉండదు."—[ఎంగెల్స్.] పదార్థం తనరూపాన్ని తాను ఏదో విధంగా కాక తనవ్యతిరేకతగా మార్చుకొనితీరుతుంది ఐతే వస్తువుల ఈమార్పును స్పష్టంగా నిర్దేశించేసూత్రమైన వ్యతిరేకత అతి ప్రధానమైనది.

మనం గతితార్కిక 'వ్యతిరేకత' లేక విరుద్ధత నిప్పుడు తెలిసికొనియున్నాము. ఐతే ఈ సూత్రాన్ని వస్తువులకు మనం యాంత్రికంగా సమన్వయించే ప్రమాదానికి గురికాగూడదు. మనం వస్తువుయొక్క స్థితిగతులను, గుణధర్మాలను, దాని చరిత్రలోని అనుక్రమపరంపరను సూక్ష్మంగా పరిశీలించి వాస్తవికదృష్ట్యా దానిదశను నిర్ణయించ ప్రయత్నించాలి.

అధిభౌతికవిధానపు పాత అలవాటువల్ల వస్తువులలోని వ్యతిరేకతల సమన్వయాన్ని పరిశీలించుట మన సామాన్యబుద్ధికి వింతగాను, విచిత్రంగాను తోచవచ్చు. క్రొత్తదనంవల్ల తడబాటు కల్గవచ్చు. ఐతే, ఒక భౌతికవాది వాస్తవికనిర్ణయాలకు ఆచరణయే సమన్వయరంగమని మనమిక్కడ మరొకమారు జ్ఞాపకంచేసికోవాలి. వస్తువుయొక్క ఆచరణక్షేత్రపు వాస్తవిక పరిణామ చరిత్రతో మన పరిశోధన సమన్వయమైయున్నప్పుడే ఈ గతితార్కికసూత్రములవలని చైతన్యం ఫలప్రదం కాగలదు—

మనం వస్తువుయొక్క స్వయంసిద్ధ అనుక్రమాన్నీ—దాని కారణాన్నీ, పరిణామాన్నీ, అభివృద్ధిక్రమాన్నీ, (చరిత్రనూ) ఆవస్తువుయొక్క "అంతర్గతమైన వ్యతిరేకతల కలయిక లేక యేకత్రితవల్ల" నేనని గుర్తించాము. ప్రతి వస్తువూ వ్యతిరేకతల కూడలియని అర్థంచేసికొన్నాము. పదార్థంయొక్క మూలం ఈ అంతర్గత వ్యతిరేకతయేనని మనమిక్కడ గుర్తించాలి.

## వ్యతిరేకతల కలయిక:

ప్రతిపదార్థమూ వ్యతిరేకతల కూడలి. అలా అనగానే వింతగొల్పు

తుంది. ఎందుకంటే తర్కము ఒకవస్తువుకూ దాని వ్యతిరేకవస్తువుకూ సాపత్యం లేదంటుంది. కాని గతితార్కికదృష్ట్యా ప్రతివస్తువూ విరుద్ధతల కూడలికదా !

అధిభౌతికదృష్ట్యా వ్యతిరేకతల సమన్వయం అసంభవము. ఒక అధిభౌతికవాదికి ప్రతిపదార్థమూ ఒకే (అదే) పదార్థము...లేక అదేపదార్థముయొక్క అణువులసముదాయము. కాని ఇక్కడ రెండు వ్యతిరేక పదార్థముల కూడలిగా చెప్పబడుతున్నది. అలా ఎందుకంటే, అవి రెండూ ఘర్షణ సాగిస్తున్నవనీ చెప్పబడుతున్నది. ఆపదార్థం అదేపదార్థంగా ఉండక తన వ్యతిరేకరూపాన్ని చేకూర్చుకుంటున్నదనీ చెప్పబడుతున్నది...ఇదంతా క్రొత్తధోరణివలె యుంటుందికదా !

అధిభౌతికదృక్పథంలో అజ్ఞానానికీ—విజ్ఞానానికీ పొసగదు. ఇవి రెండూ భిన్నములూ, పరస్పర వ్యతిరేకములు. "ఒక విజ్ఞానశాస్త్రజ్ఞుడు అజ్ఞానికాడు. ఒక అజ్ఞాని విజ్ఞానశాస్త్రజ్ఞుడూ కాడు."... కాని వాస్తవాన్ని పరికిస్తే అట్లాంటి వర్గీకరణ సరికాదనే తేలుతుందికదా ! "ముందు అజ్ఞానం ఉండేను...ఆపిదప విజ్ఞానంవచ్చింది" అంటే, ఒక మనిషిలోని అజ్ఞానం, విజ్ఞానంయొక్క స్వరూపాన్ని చేకూర్చుకున్నట్లేకదా !

పోతే, విజ్ఞానం నూటికినూరుపాళ్ళుండి అజ్ఞానం అసలే లేకపోవటం అనేదశ ఉండదు. మనిషి ఎంత అజ్ఞానుడైనా అతనికి కనీసం కొద్దివస్తువుల పరిజ్ఞానమైనా ఉండకపోదు. కాబట్టి పరిపూర్ణ అజ్ఞానస్థితి ఊహాతీతం. అలాగే విజ్ఞానంకూడ. విజ్ఞానం అగాధమైనది. మన విజ్ఞానశాస్త్రమే అపరిపూర్ణమైనది ! విజ్ఞానశాస్త్రానికింకా తెలియని ఎన్నెన్నో విశేషాలున్నవి. లెనిన్ అన్నట్లు 'విజ్ఞానపులక్ష్యం ఎన్నటికీ ఎడతెగనిది'...కాబట్టి కేవలం విజ్ఞానంమాత్రమే అన్నదశ ఉండదు !...కాబట్టి విజ్ఞానమూ అజ్ఞానమూ ఈ రెండూ అన్యోన్యాధారితములైయుంటవి.

ప్రపంచంలో విజ్ఞానం అజ్ఞానం విడివిడిగా అన్యోన్యసంబంధం లేనివిగా ఉండక అన్యోన్యసంబంధితములై అన్యోన్యప్రభావముగలవై ఒకదానివెంటనే మరొకటి యుంటుంది. కాబట్టి మనం విజ్ఞానాన్ని, అజ్ఞానాన్ని పరస్పరాధారంపైననే అర్థంచేసుకుంటాము. విడివిడిగా ఒకదానికొకటి సంబంధం

లేకుండా వ్యవహరింపము. అంటే సమస్యయొక్క ఏకత్వాన్ని, భిన్నత్వాన్ని సమన్వయించియే మనం దాన్ని అర్థంచేసికొంటాము..

ఈ ఉదాహరణ భావం తనను తాను తన వ్యతిరేకతవంకకు మార్చుకుంటున్నదనుటకు కాదు. ఇక్కడ మనకు కన్పిస్తున్నది భావంలో వ్యతిరేకతల ఐక్యత. ఇదేవిధంగా జీవనమరణాలలోను, సత్యాసత్యములలోను పరస్పర వ్యతిరేకతలు ఐక్యమైయున్నవి...

ఈదృష్టితో ఆలోచిస్తే భావక్షేత్రంలోను 'శాశ్వత సత్యాన్ని' కనుగొనాలన్న మన భ్రిమలన్నీ అంతరిస్తవి. మానవుని విజ్ఞానపు అసమగ్రత... [ఆవిజ్ఞానం అది గడింపబడినప్పటి పరిస్థితులపై ఆధారపడియుండుటగల్ల అసమగ్రితకు హేతువౌతుంది.] గుర్తింపబడుతుంది. అంతేకాక మంచికీ చెడుకూ, నిజానికీ అబద్ధానికీ, భేదానికీ అభేదానికీ 'అధిభౌతికవిధానంచేసే స్థిర శాశ్వత వ్యతిరేక వర్గీకరణ తప్పై అన్యోన్యాధారితంగామాత్రమే మిగిలిపోతుంది. ఎందుకంటే ప్రతిఅంశమూ తనలోనే తన వ్యతిరేకతనుకూడా కల్గియున్నది. ఈనాటి అవాస్తవం తనలోని వాస్తవికతమూలాన ఒకానొకనాడు (పూర్వం) వాస్తవంగా భావింపబడియుండుటా, తిరిగి తనలోని వాస్తవంమూలాన ఒకానొకనాడు (భవిష్యత్తులో) వాస్తవంగా భావింపబడగల్గుటా సంభవమని తేలిపోతుంది. ఇలా భావం అన్యోన్యాధారితం (relative) గా గమనింపబడుతుంది. కాబట్టి మన అన్నినిర్ణయాలు అన్యోన్యాధారితములుగా గ్రహింపబడేవిమాత్రిమే. అవి నిత్యసత్యములుకావు...

ఇప్పుడు మనం గతితార్కికవిధానాన్ని సరిగా గమనించి వ్యతిరేకతల ఐక్యత ఎలా అన్వయిస్తుందో చూచాము....

## పరిహరింపవలసిన పొరపాట్లు:

మనం అపోహలకు గురికాకుండా ఉండాలంటే గతితార్కికములలో అతిప్రధానమైన 'వ్యతిరేకత' ను స్పష్టంగా అర్థంచేసికోవాలి. దాన్ని యాంత్రికరీతిలో అపోహపడకూడదు. కాని ప్రతి విజ్ఞానాంశంలోను వాస్తవం, అవాస్తవం కలిసియున్నవనికూడా యాంత్రికంగా సిద్ధాంతీకరింపకూడదు.

ఈసూత్రాన్ని ఇలా అపోహపడటంవల్ల—ప్రతి వస్తువులోనూ మంచీ చెడూ ఉంటే మనం చెడును వదిలివేసి మంచిని తీసుకుందాం అన్న ధోరణి యేర్పడే అవకాశముంటుంది. ఉదాహరణకు మార్క్సిజమే తీసుకుందాం. "మార్క్సిజంలో కర్మాగారాలు, బ్యాంకులు, కంపెనీలు, ట్రస్టులు అన్నీ ఏ కొందరు ధనికవాదుల చేతుల్లోనో ఉన్నవని చెప్పబడ్తుంది. దీనివలన ఆర్థిక దోపిడీవిధానం ఖండింపబడ్తుంది. ఇది వాస్తవం. దీన్ని మనం బాగుపరిస్తే సరిపోతుంది. కాని వర్గపోరాటం అనివార్యమని మార్క్సిజం చెప్తుంది. ఇది వాస్తవంకాదు. కాబట్టి వర్గపోరాటపుభాగాన్ని తొలగిస్తే మార్క్సిజం సులభతరంగా సరిగా సమన్వయం కాగలదు. అంటే మార్క్సిజం సాంఘిక విలోకన సరియైనదే. కాని దానితో గతితార్కికములను కలపటం అనవసరం"—అనుధోరణి యేర్పడుతుంది.

ప్రౌఢాన్ ఇలాగే భావించాడు. కొందరు గుత్తపెట్టుబడిదార్ల దోపిడీవల్ల శ్రామికవర్గం ఆందోళనచెందుతుందికదా? కాబట్టి శ్రామికవర్గానికి కూడా ఆ కర్మాగారాలషేర్లు అందుబాటులోకి తేబడి, వారిని పెట్టుబడిదార్లుగా మారిస్తే వర్గసమస్య తొలగిపోతుందని ఈతనిపథకం.

కాని ఇదొక అపోహామాత్రమే. ఈసంఘంలో కొందరు పెట్టుబడిదార్లూ, శ్రామికవర్గ ప్రజలూ సమన్వితమైయున్నారు. ఒకరులేకుండా మరొకరు ఉండటం అసంభవం. సమాజంలోని అంతర్గత వ్యతిరేకతలఘర్షణ కృత్రిమమూ, యాంత్రికమైనదికాక స్వయంసిద్ధ అనుక్రమము. కాబట్టి ధనికవర్గమూ శ్రామికప్రజల వ్యతిరేకతలఐక్యత అనివార్యమైనది. అందుకని వ్యతిరేకతలను తగ్గించటం—లేక ఒకదానినుండి ఒకదాన్ని విడదీయుటం సరియైనదికాదు. మనిషిని మనిషి దోపిడీచేసే ఈసమాజంలో ధనికవర్గమూ, శ్రామికవర్గమూ ఈ యిరువురి ఘర్షణా అనివార్యమైనది.

అందుకై ధనికస్వామ్యసమాజం అంతమైపోవటమంటే, ధనికవర్గమూ, శ్రామికవర్గమూ ఈ రెండూ ముగింపబడాలి. అప్పుడే వర్గరహితసమాజం వస్తుంది. అప్పుడే విమోచితుడగు మానవుడు, నూతనసమాజాన్ని నిర్మాణం చేసికొని ఆర్థికంగా వైజ్ఞానికంగా ఉన్నతతరమగు సామ్యవాదదశవఃకను కొనసాగగలడు; కమ్యూనిజంవంకకు సమాజం ఇలా సహజసిద్ధంగా కొనసాగాలి.

అంతేకాని ప్రౌధాన్ భావించినట్లు ధనికవర్గాన్ని వెనుకకునెట్టి కర్మాగారాల షేర్లు కార్మికులపేరున మార్పిడిచేసి "బీదతనంలో సమానత్వాన్ని" సృష్టించటం ప్రయోజనవంతం కాజాలదు. ఇది సమాజంలో బీదతనాన్ని పంచుటే కాగలదు.

ప్రతివిషయానికీ, ప్రతిఅంశానికీ, ప్రతిసమయంలోను గతితార్కికసూత్రాలను సమన్వయించాలన్న 'చాదస్తం' పనికిరాదని ఇదివరకే హెచ్చరింపబడినది. మన సర్వసాధారణమైన విజ్ఞానం చాలా అసమగ్రమైయున్నదనీ, అది మనను అయోమయంవంకకు లాగుకొని పోవచ్చుననీ ఎప్పుడూ గుర్తింపబడాలి.

ఇక్కడ మనకు ప్రధానమైనది సిద్ధాంతం. గతితార్కికసూత్రములు పదార్థముల పరిణామక్రమాన్నీ, ఆ పరిణామక్రమాన్ని అనుశాసించే వ్యతిరేకితల ఘర్షణనూ బోధపరచగలవన్న అంశాన్ని మనం గమనించాలి. వస్తువులలోని 'వ్యతిరేకితల ఐక్యత' ను గుర్తించి, వస్తుస్వరూపం 'శాస్వతీకృత వర్గీకరణకు' భిన్నమైనదని మనం అర్థంచేసికోవాలి. ప్రతివస్తువులోనూ దాని విరుద్ధత ఉందనీ, అది వస్తువుమార్పుకు హేతుభూతమైనదనీ గుర్తించాలి. వస్తువులో 'వ్యతిరేకిత' లేకపోతే అది మార్పుకు గురికాదనీ... ఈ గతితార్కిక సూత్రాలకు పరిణామక్రమంలో నిరతమూ జరుగుతున్న మార్పు ద్వారా ప్రకృతీ, సమాజమూ, భావమూ నిదర్శనలుగా నున్నవనే సామాన్యాంశాన్ని గమనించటమే మనకిక్కడ ప్రధానం—

## గతితార్కికముల ఆచరణాత్మక ఫలితములు:

గతితార్కికవిధానం మనమొక వస్తువును పరిశీలిస్తున్నప్పుడు దాని ఇరుపక్షాలనూ పరిశీలించుటకు దారితీస్తుంది. జ్ఞానాన్ని అజ్ఞానంతో విడిగాను, సత్యాన్ని అసత్యంతో విడిగాను ఆలోచించే అధిభౌతికవిధానపు అసమగ్రతనది నివారిస్తుంది.

ఆదర్శవాదం మనుష్యుల భావంలోనే జగత్తుందని చెప్తుంది. అది ఒకవిధంగా నిజమే. మన ఆలోచనలలో వస్తుసముదాయం వ్యవహరించేది వాస్త

వమే. కాని ఆదర్శవాదం ఏకపక్షవాదంచేసి వస్తువుకు బాహ్యస్థితి లేదంటుంది. ఇది తప్పు. ఆదర్శవాదం మనుష్యుని కర్తృత్వమును సరిగానే గణించింది. కాని దానికి 'ఆచరణ' గీటురాయి వర్తింపనందున అంతమాత్రమే గుర్తించి, పెడదారిన పడినది. ఇదీ దాని అసమగ్రత.

ఆధిభౌతిక భౌతికవాదంకూడ ఇలాగే ఏకపక్షవాదనకు గురియైనది. అది ప్రపంచాన్ని యాంత్రికదృష్టితో సమన్వయించింది. ప్రపంచంలో యాంత్రికత ఉన్నదా? ఉన్నది. ఈ యాంత్రికత ఘనమైనపాత్ర వహిస్తున్నదా? ఔను. ఆంతవరకు యాంత్రికవాదం నిజమే. కాని అంతకుపరమైన చలనంలేదని భావించటమే పొరపాటు; లేక అసమగ్రత. దీనికి ఆధిభౌతిక భౌతికవాదం లొంగిపోయింది.

మనం ప్రతివిషయాన్నీ సామాన్యంగా ఏకపక్షదృష్టితో చూస్తుంటాము. రాముడు మంచివాడు. అన్నప్పుడు కేవలం మంచినే చూస్తాము. లేక చెడ్డవాడన్నప్పుడు కేవలం చెడ్డనే చూస్తాము. కాని ఈ రెంటినీ సమన్వయరూపంలో చూడటాన్ని మనం అలవరచుకోవాలి.

ఉదాహరణ: ఒక గుత్తపెట్టుబడిదారు నిరంకుశుడు ప్రజల శ్రమను దోపిడీచేస్తాడు. అతడు కార్మికులకు వ్యతిరేకి. ఐతే, ఆ గుత్తపెట్టుబడిదారు కార్యాలయంలో పనిచేసే ఒక గుమస్తా ఉన్నాడు. అతడు యజమానికి చాలా అనుకూలుడూ, కార్మికులపట్ల నిరంకుశుడూ. ఐనా, పెట్టుబడిదారుకూ గుమస్తాకూ భేదంఉంటుంది. ఈ గుమస్తాకు తగు చైతన్యం లేకపోయినా, అతడుకూడా శోషణకు గురియౌతున్నవాడే. అతడు కార్మిక వ్యతిరేకపక్షంలో ఉన్నా, గుమాస్తాకూ, పెట్టుబడిదారుకూ చాలా భేదంఉంది. ఈ యిరువురికీ సమానన్యాయం పొసగదు.

పెట్టుబడిదారుడు స్వతహాగా కార్మికవ్యతిరేకి. కాని గుమాస్తావర్తన ద్విముఖమైయున్నది. అతడు ఉద్యోగరీత్యా శోషితుడూను, నిరంకుశుడూను. కాబట్టి అతడు నిరంకుశుడుగా వ్యవహరించు కారణాలు వేరు ఆధారంపైనున్నాయి. దీన్ని మనం సరిగా గుర్తింపవలసియుంటుంది.

ఇలా మనం గతితార్కికదృష్ట్యా పరిస్థితులను విభిన్నదృక్కోణాలతో విభిన్నముఖ వీక్షణద్వారా పరిశీలింపవలసియుంటుంది.

ఐతే, వస్తువులు అంతర్గత విరుద్ధతలఘర్షణవలన మారుతుంటాయి. ఈ అంతర్ఘర్షణకు పర్యవసానం మార్పు లేక చరిత్ర; చరిత్రకు కారణం తిరిగి అంతర్గత ఘర్షణ. ఇదే మూడవసూత్రం.

ధనికస్వామ్యంలో ధనికవర్గాలకూ, శ్రామికవర్గాలకూ ఘర్షణలున్నవి. ఈ ఘర్షణలఅంతమే "మార్పు" గా సామ్యవాదరూపాన్ని చేకూర్చుకుంటుంది. వ్యతిరేకతలకు కారణమైన మూలపరిస్థితియొక్క వినాశమే నూతనరూపపు ఆవిష్కరణ. అనగా వ్యతిరేకతయొక్క అంతరించటమే నూతనస్వరూపము... ఇలాటి మార్పు లేక చలనమే నేటిసమాజంలోను కొనసాగుతూఉన్నది....

పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయనశాస్త్రం, జీవశాస్త్రం ఆయా శాస్త్రీయసమస్యలను చర్చిస్తవి. అలాగే గతితార్కికవిధానం చలనప్రక్రియాన్ని సిద్ధాంతీకరిస్తుంది...గతితార్కిక చలనానికి ఆధారాన్ని వివరించేది మూడవసూత్రమగు ఈ వ్యతిరేకతయే —ఐతే, ఈ గతితార్కికసూత్రములను మనమిక్కడ తత్వశాస్త్రదృష్ట్యా ప్రకృతతోనూ, మానవునితోనూ, భావంతోనూ సమన్వయిస్తూ పరిశీలిస్తున్నాము...ఇక రాబోయేప్రకరణంలో సమాజంలో వచ్చువట్టి మార్పులస్వభావాన్ని మనం గమనింపగలము.—



# పరిమాణ అనుక్రమం: గుణానుక్రమంగా...

1. సంస్కరణలా? విప్లవమా?
2. తాత్వికంగా.... శాస్త్రీయంగా....
3. చారిత్రిక భౌతికవాదం
4. చరిత్ర ఎలా కొనసాగుతుంది?

గతితార్కిక చలనంయొక్క గత మూడుసూత్రాలను గమనించాక మనం నాల్గవసూత్రాన్ని చాలా తేలికగా అర్థంచేసికోగలము—ఇప్పుడు ఉదాహరణలద్వారా మనం ముందుకుసాగుదాం...

## సంస్కరణలా? విప్లవమా?

గత ప్రకరణాంతంలో మనం చదివినట్లుగా—ధనికస్వామ్యాన్ని సామ్యవాదసమాజంగా మార్చుట సంస్కరణలద్వారా సాధ్యమా? లేక విప్లవంద్వారానా? అనుప్రశ్న సాధారణంగా చర్చింపబడ్తుంటుంది.

ఈ ప్రశ్న విషయంలో, మనం వస్తువు చలనానికి మూలకారణం దాని అంతర్గత వ్యతిరేకశక్తుల ఘర్షణనీ, ప్రతి పదార్థంలోను వ్యతిరేకతలఘర్షణ కొనసాగుతుంటుందనీ—క్రమంగా వస్తువు తన వ్యతిరేకతగా పరిణమిస్తుందనీ, ఇదివరకు తెలిసికొనియున్నాము—ఐతే, ఈ మార్పు లేక చరిత్ర వాస్తవంలో ఎలా జరుగుతుంది? అనేదే ఇప్పుడు మనప్రశ్న—

ఒక జామకాయ జామపండుగా (పండటం) మారటం చిన్న చిన్న మార్పులద్వారా కొంచెంకొంచెంగా కొనసాగుతుంది. అలాగే సంఘంకూడా

కొస్తా కొస్తా గా మారి తనరూపాన్ని మార్చుకుంటుందని సాధారణంగా భావింపబడ్తుంది. పరిణామక్రమంలో, మెల్లమెల్లగా, ధనికస్వామ్యం సామ్యవాదంగా మారుతుందని భావింపబడ్తుంది. అంటే చిన్న చిన్న (శాసన) సంస్కరణలద్వారా సమాజం క్రమక్రమంగా మార్పుజెందుతుందని అన్నమాట. ఈ భావననే సంస్కరణవాదమంటారు.

ఈ దృక్పథాన్ని కల్గినవారు సంస్కరణవాదులనబడుతారు. అంటే, వీరు సంస్కరణలను కోరువారు గాక, చిన్న చిన్న సంస్కరణలతో తృప్తి పడువారుగాను, క్రమంగా, మెల్లగా తెలియబడకుండా సమాజం మారాలని ఆశించేవారుగాను ఉన్న కారణాన సంస్కరణవాదులన్నమాట. వీరు సమాజం వేగంగా మార్పుజెందటాన్ని నిరోధిస్తారు.

## 1. రాజకీయంగా...

మనం "ధనికస్వామ్యం శాసనరీత్యా, సంస్కరణలద్వారా క్రియక్రమంగా తెలియకుండానే సామ్యవాదంగా మారగలదా? అలా మారుచున్నదా?" అనునది దేశచరిత్రలద్వారా తెలుసుకోవాలి. ప్రజాస్వామ్య దేశాలు అలా మారియున్నట్లు మనం చూడటంలేదు. కాని విప్లవంద్వారా (అంటే వర్గపోరాటరూపకమైన ధనికస్వామ్య నిర్మూలనద్వారా) రష్యాలో, చైనాలో సామ్యవాద సమాజమేర్పడియున్నట్లు నిదర్శనంగా చూస్తున్నాము.

## 2. తాత్వికంగా...

తాత్వికదృష్ట్యా, వస్తువులు చిన్న చిన్నమార్పులుతేక క్రమక్రిమమైన సంస్కరణలద్వారా తమ వ్యతిరేకస్వరూపాన్ని చేకూర్చుకుంటున్నాయా? వస్తువులలోనిమార్పు ఎప్పుడూ ఒకేవేగాన్నీ లేక క్రమాన్నీ కల్గిలేదు. వస్తువుల వ్యతిరేకతలఘర్షణ క్రమక్రమంగా కొనసాగీ, కొనసాగీ, ఒకదశలో అతివేగమైన ఉద్గమనరూపకవిప్లవం వస్తుంటుంది. ఈ మార్పును మనం ప్రకృతిలోను, మానవునిలోను, భావంలోను స్పష్టంగా గమనింపవచ్చును.

ఉదాహరణకు భూగోళంలోని మార్పులు. భూగర్భగోళంలో కొన్ని మూలపదార్థాల అణురూపకమైన మార్పులవల్ల ఎల్లప్పుడూ కొన్ని అను

క్రమాలు కొనసాగుతూ నేఉంటాయి. కాని పరిణామచరిత్రలో, ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా గొప్పగొప్ప వైప్లవికమైన ప్రక్రియాలుకూడా వచ్చినట్లు నిదర్శనాలున్నవి. భూగోళం గురియైన ఈ ప్రక్రియాలు, మానవచరిత్రలో బ్రహ్మాండమైన మార్పులుకల్గించాయి.

[ఇక సమాజం. సమాజంలో 'మతాలు' ఎలా వచ్చాయి? ఒక్కొక్క మతాన్ని వెనుకకునెట్టి మరొకమతం వ్యాప్తిగాంచుటవెనుక ఎన్నెన్ని యుద్ధాలు, దాడులు, రక్తపాతాలు చరిత్రలో కొనసాగియుండలేదు?]

ఇక పరిణామదృష్ట్యా— అరణ్యజీవనంతో ప్రారంభమైన ఆదిమ మానవుని జీవితచరిత్రను భూగోళం (ప్రకృతి) లోని గొప్పగొప్ప ప్రక్రియాలవల్ల ఉత్పన్నమైన క్రొత్తపరిస్థితులు అమూలాగ్రం మార్చి అతణ్ణి కొండ గుహల మనుష్యునిగా రూపందించినట్లు నిదర్శనపూర్వకంగా ప్రకటమౌతున్నది.

ఇటీవలిచరిత్రలోను మనం సమాజంలో ప్రక్రియ సదృశమైన విప్లవాలను చూస్తాము. 17 వ శతాబ్దంవరకు ఇట్టి విప్లవాలు జరుగవనే భావింపబడినది. కాని చరిత్ర అవి సంభవములనీ, మానవ ప్రకృతికూడా అకస్మాత్తుగా పైకెగురగలదనీ నిరూపించినది. యూరప్ ఖండంలో అనేక దేశాల్లో అంతర్విప్లవాలు వచ్చాయి.

ఐతే, అట్టి విప్లవాలను కేవలం యాదృచ్ఛికఘటనలుగా భావించి కొందరు తృప్తిపడుతున్నారు. 16 వ లూయీ పతనం (ఫ్రెంచి విప్లవం) ఒక యాదృచ్ఛికఘటనగా అనేకులచే నేటికీ భావింపబడుతూ ఉన్నది. [ఆ విప్లవానికి ఆధారమగు విప్లవశక్తులైన ప్రజలూ, విప్లవకారులూ వారి జీవనపరిస్థితులూ కాక లూయీ దుర్బలశీలతా, లేక అతడు వారెన్నులో భోజనం చేయుటంలో ఆలస్యం జరగటంవల్ల పట్టుబడటమూ కారణమనీ, లేనిచో ఫ్రాన్సు చరిత్ర మరోవిధంగా కొనసాగేదనికూడా వాదింపబడ్తూఉన్నది.]

కాని గతితార్కికవిధానంమాత్రం అట్లుకాక "విప్లవాలు" అనివార్యమూ, సహజమైనవని భావిస్తుంది. క్రమక్రమంగా కొనసాగే సామాజిక (వర్గ) ఘర్షణలరూపకమైన మార్పు, మెల్లమెల్లగా కొనసాగుతూ, కొనసాగుతూ, ఒకానొకదశలో సద్యోద్గమనమగు విప్లవరూపాన్ని దాలుస్తుందని నిరూపిస్తుంది.

శాస్త్రీయంగా...

ఇక దీన్ని మనం పదార్థ విజ్ఞానశాస్త్రరీత్యా చూద్దాము. ఉదాహరణగా నీటిని తీసుకుందాము—

మనం నీటిని కాస్తాము. 1 డిగ్రీనుండి 98 డిగ్రీలవరకూ నీరు కాగుతుంది. 98 వ డిగ్రీనుండి తుకతుక ఉడికి 99 వ డిగ్రీకడచి పొంగి తుదకు 100 డిగ్రీలకు ఆవిరిగా మారుతుంది. ఇలాగే నీటిని చల్లారిస్తే 0 డిగ్రీవరకు చల్లబడి అక్కడినుండి మంచుగడ్డగా మారిపోతుంది.

నీరు నీటిదశలోఉండి వేడిని చేకూర్చుకోవటం, లేక చల్లారటం పరిమాణపు అనుక్రమమనబడుతుంది. అది ఆవిరిగామారటం లేక మంచుగా మారటం గుణరూపక అనుక్రమము. గుణరూపక అనుక్రమంలో వస్తువు గుణధర్మాలు పూర్తిగా మారిపోతవి.

"ఇలాగే పదార్థాలు క్రమక్రమమైన పరిమాణానుక్రమాలను ఎప్పుడూ పొందుతూనేఉంటాయి. అవి తుదకొకదశలో గుణరూపకానుక్రమానికిగురియై తమ స్వరూపాన్ని మార్చుకుంటాయి. ఇలా పరిమాణ అనుక్రమం ప్రత్యేక పరిపక్వదశలో గుణరూపకానుక్రమంగా విజృంభిస్తుంటుంది."—ఎంగెల్స్.

దీనికి మనం ఎన్నైనా ఉదాహరణల నీయవచ్చు. పార్లమెంటుకు పోటీచేసే ఒక అభ్యర్థిని తీసుకుందాం. నియోజకవర్గంలో ఇద్దరు పోటీచేస్తున్నారు. మొత్తం 10,000 ల ఓట్లుపడ్డవి. కాబట్టి 5,001 ఓట్లు ఎవరికి వస్తే వారు మెజారిటీ చేకూర్చుకుంటారు. 4,999 ఓట్లు చేకూర్చుకొన్నా ప్రయోజనంలో తేడా ఉంటుంది.

ప్రతి అభ్యర్థికీ వచ్చే ఓట్లుక్రమం పరిమాణాత్మకమైన ఒకటినుండి 5,000 ల వరకూ కొనసాగుతుంది. ఆపైనపడే ఒక్కఓటు గుణాత్మకమైనది. ఈ ఒక్కఓటే అభ్యర్థిని పార్లమెంటుసభ్యునిగా చేస్తుంది. మిగిలినఓట్లకు ఈ శక్తిలేదు....కాబట్టి 5,001 వ ఓటు ఈవిధంగా విప్లవాత్మకమైనది.

మరొక ఉదాహరణ: 'చిన్నపిల్లలు పారవశ్యంలో బాగా నవ్వుతారు. ఈ పారవశ్యం పెరిగినకొద్దీ నవ్వు హెచ్చుతుంది. తుదకొకదశలో ఈ పారవశ్యం నవ్వుకుబదులు హఠాత్తుగా ఏడ్పుగా పరిణమిస్తుంది...'

అలాగే, పిల్లి చాలా పిరికిజంతువు. అది మనిషికి భయపడుతుంది. కాని ఈ భయం ప్రాణభయంగా పరిణమించినసందర్భంలో పిల్లి తిరుగబడ్తుంది—

...ఈసూత్రాన్ని సంస్కరణవాదులు 'అసంభవవాద' మని విమర్శిస్తుంటారు. కాని, విజ్ఞానశాస్త్రం ఈసూత్రానికికూడా ప్రత్యక్షసాదృశ్యాలను ఆధారాలను చరిత్రద్వారా చూపుతూ నేఉన్నది.

ఇట్లాంటి గుణరూపక అనుక్రమం లేక విప్లవదశలో మనపాత్ర ఏమిటి? ఈప్రశ్నతో మనం చారిత్రిక భౌతికవాదంవంకకు మరలవలసియుంటుంది...

[ఇక్కడ ప్రశ్న విప్లవవాదం మార్గమెటు? సంస్కరణవాదం దారి ఎటూ అనేది. దీన్ని కేవలం 'వాదం' ద్వారా కాక మనం ఆచరణదృష్ట్యా సరిగా పరిశీలించాలి. ఈ పరిశీలనయే చారిత్రిక భౌతికవాదమనబడ్తుంది.]

## చారిత్రిక భౌతికవాదం:

గతితార్కికసూత్రముల నిప్పుడు మనం తెలిసికొనియున్నాము. ఈ సూత్రములను మానవచరిత్రకు సమన్వయించుటయే భౌతికవాదమనబడుతుంది.

"చరిత్ర సమాజపు చలనాన్నీ మార్పునూ ప్రకటీకరిస్తుంది. మానవ సంఘానికీ చరిత్రఉంది. అది సంఘపు పరిణామాన్నీ, మార్పునూ గుర్తువేసియుంచుతుంది." ఎంగెల్స్.

## ...చరిత్రను బోధపరచేదేమిటి?

మనమెప్పుడూ అనుకుంటుంటాము. "యుద్ధాలెందుకు వస్తాయి? మనిషి శాంతితో హాయిగా ఉండాలి!" ఇలాంటిసమస్యలకు భౌతికవాదం సమాధానాలను కల్గియున్నదా?... ఔను.

...ఒకవేళ యుద్ధాలు ప్రపంచంలో "పాపం పండినందున దేవునిచే మానవునకు విధింపబడేశిక్షగా జరుగుతుంటాయ" ని చెప్తే అది ఆదర్శవాదం. అది చరిత్రకాదు. ఊహాచరిత్రమాత్రమే. "కర్మ" సిద్ధాంతంకూడా అలాంటిదే. అదీ విధిపేరుచెప్పి తప్పుకుంటుంది. ఈ రెండూ అశాస్త్రీయములు.

భౌతికవాదం చరిత్రను కర్మకూ, దైవమునకూ కాక మానవులకు అన్వయిస్తుంది. మానవుల "చర్య" లకు సమన్వయిస్తుంది... మానవులు తమ చర్యలద్వారా యుద్ధంచేయటమూ, మానటమూ, మాన్పించటమూ కూడా సంభవము అని విజ్ఞానశాస్త్రాధారంతో నిరూపిస్తుంది.

## చరిత్ర మానవచర్యయే:

మనుష్యులే చరిత్రను నిర్మిస్తారు. ఎలా? తమచర్యలద్వారా. ప్రతి మనుష్యుడూ ఒకలక్ష్యాన్ని కల్గియుంటాడు. ఆ లక్ష్యసాధనకై కోరికలను కల్గియుంటాడు. ఇలా సమాజంలో అనేక దృక్పథాలు, సంకల్పశక్తులూ ఉంటాయి. ఐతే మానవసమాజపు విభిన్న "దృక్పథాల" లోని సమన్విత "సంకల్పశక్తుల" వలన కల్గే ఐక్య "చర్య" యే సమాజపరిస్థితులను మార్చుట ద్వారా చరిత్రను నిర్మాణంచేస్తుంది. ఐతే ఇక్కడ మనకెదురయ్యే "ప్రతి మనుష్యుడూ ఏదో ఒకలక్ష్యాన్ని పొందగోరుతాడు. ఐతే, అందరు వ్యక్తుల లక్ష్యాలూ ఒకేవైపు ఉండవు. ఐనప్పుడు ఏ సత్తా చరిత్రను నిర్మాణం చేస్తుంది?...మనుష్యుల కోరికలు ఎందుకు భిన్నభిన్న దశలలో ఉంటాయి? ఇంతకూ మానవుని చర్యలను నిర్ధరించేది ఏమిటి?" అనే ప్రశ్నలు చాలా ముఖ్యమైనవి—

దీనికి మన సమాధానం యిది. "మనుష్యునిభావం బాగా బలపడినప్పుడు, అందొక నిశ్చయంగామారి కోరికగా పరిణమించి చర్యగా ప్రతిఫలిస్తుంది"... ఇక దీన్ని ఆధిభౌతికవాదం ఎలా వ్యాఖ్యానిస్తుందో చూద్దాం...

ఒక ఆధిభౌతికవాది ఇలా వాదిస్తాడు. "మొదట మనుష్యుల భావం. ఆపైన నిశ్చయమూ కోరికా. ఆపైన చర్య. సరి. ఐతే ఇక భావం ఎలా యేర్పడుతుంది?... దీనికి వాదన ఇలా కొనసాగుతుంది. మానవుల హక్కులనుగూర్చి కొందరు "మేధావులు" ప్రచారం చేస్తారు. హక్కులకోసం ప్రజలు పోరాడుతారు. ఇలా భావం ఆకాంక్షగామారి చర్యగా చరిత్రను నిర్మించింది." కొందరు చరిత్రకారులు చరిత్ర "రాజుల అభిప్రాయాలు, ప్రణాళికలు, సంస్కరణలద్వారా నిర్మాణమైనద"ని చెప్తారు. అంటే రాజుల అభిప్రాయాలు ప్రజల చర్యలుగా పరిణమించాయన్నమాట. కాని

భౌతికవాదం చరిత్రను ఈరీతిగా అంగీకరింపదు.

18 వ శతాబ్దపు భౌతికవాదంకూడా "ఉద్దేశశక్తియే" కార్యరూపం దాల్చి చరిత్రను నిర్మాణంచేసినట్లు భావిస్తుంది. కాని ఈవాదంకూడా పై ఆధిభౌతికవాదననే పోలియున్నది. అసలు ప్రజల భావములకు ఆధారమైన పరిస్థితులవంకకు ఈవాదం తనదృష్టిని ప్రసరించుటలేదు. కాబట్టి ఆదర్శవాదమూ, లేక అసమగ్రమైన భౌతికవాదమూ ఈసమస్యను సరిగా విశ్లేషించుటలేదు. భావం, సంకల్పం, చర్య ఇదంతా నిజమే. కాని భావం దేనిపైన ఆధారపడియుంది? మనుష్యుని భావానికి ఆధారం లేక మూలశక్తి ఏమిటి? ఈ ప్రశ్నను గూర్చి 18 వ శతాబ్దపు భౌతికవాదం గతితార్కికంగా ఆలోచింపలేకపోయింది. ఒకవేళ 18 వ శతాబ్దంలోనే మార్క్సిస్టుసూత్రాల నెవరైనా ఆవిష్కరించగల్గియుండినా, అప్పుడవి అంగీకరింపబడజాలకపోయేవే. కేవలం 'భావం' యేర్పడటమే ప్రధానంకాదు. ఆ భావం అంగీకరింపబడవలెను. అంగీకరింపబడుటకు తగు పరిణతీ, పరిస్థితులూ ఆసన్నం కావలెను. అప్పుడుమాత్రమే భావం, సరియైన హేతువాద ఆధారంపైన, చర్యకు సంచాలకసత్తాగా పనిచేస్తుంది. అప్పుడే సమాజం నిశ్చయశక్తితో ఒకత్రాటకదలి విజృంభించి చర్యకు తలపడుతుంది. [18 వ శతాబ్దంలో ధనికవాదమింకా తన క్షీణదశను సమీపించలేదు. ఆనాటిధనికవాదమింకా వృద్ధిదశలోనుండెను. ఈ స్థితిని మనం మరచిపోకూడదుకదా!]

18 వ శతాబ్దంలో పరిస్థితులింకా మార్క్సిస్టు సిద్ధాంతాలను అనుసరించే దశకు పరిపక్వమైయుండలేదు. కాబట్టి ఆకాలంలోనే అథవా మార్క్సె తన సిద్ధాంతాలను ప్రకటించియుండినా అవి సమాజంచే, ప్రజలచే అంగీకరింపబడియుండేవేకావు. కాబట్టి, పరిస్థితుల ఆధారంలేకుండానే, భావం చర్యగా మారుతుందని మనం పొరపడకూడదు.

ఇక, రాబోయే ప్రకరణాలలో మనం మానవుని భావానికి మూలాధారమేమిటో—సమాజచరిత్ర ఎలా నిర్మాణమౌతుందో—శాస్త్రీయంగా పరిశీలింతాము. విప్లవవాదం, సంస్కరణవాదం ఈ రెంటిలో యేది సరియైనదో చూద్దాము.



# పంచమభాగం.

# చారిత్రిక భౌతికవాదం.

1. పొరపాటు పడకూడదు:
2. సాంఘిక స్థితీ చైతన్యమూ:
3. ఆదర్శవాద సిద్ధాంతాలు:
4. సాంఘికస్థితి; దాని లక్షణాలు:
5. వర్గపోరాటం చరిత్రకు సంకల్పశక్తి:

## పొరపాటు పడకూడదు:

చరిత్ర మానవసమాజపు భావం—నిశ్చయం—చర్యద్వారా ముందుకు సాగుతుంది. ఐతే భావాలు ఎలా కల్గుతాయి? ఈప్రశ్నకు మనం సరియైన సమాధానాన్ని కల్గియుండాలి. భౌతికవాదులంగా మనం ఇలా అనుకోవచ్చు.

ఎవరో ఒక గొప్పమేధావి లేక ప్రవక్త తన 'మెదడు' లో కలిగిన గొప్పభావాలను ప్రజల్లో ప్రచారంచేస్తాడనీ—అతనిమాటలు ఒక సిద్ధాంతం లేక మతంగా ప్రజల్లోకి ప్రాకిపోయి నిశ్చయంగా బలపడి వారితో చర్యలు జరిపిస్తవనీ మనం సామాన్యంగా భావిస్తాము.

లేక శ్రామికప్రజలు తాము శ్రామికప్రజలుగనుక—శ్రామికులు కాని ధనికవర్గాన్ని ద్వేషించి దానితో పోరాడాలని కోరుతారుగనుక విప్లవం కొన సాగుతుందనికూడా భావిస్తాము.

కాని పై రెండు ఉదాహరణలూ సరియైన సమాధానాలు కావు. ఒక ప్రవక్త మెదడులో కాని, లేక శ్రామికుని హృదయంలో కాని ఇలాంటిభావం ఎందు కేర్పడ్తుందని కాని, అలాంటిభావం ఎందు కేర్పడదని కాని మనకు పై సమాధానాలు రెండూ వివరించటంలేదు.

ఒకవేళ అధికసంఖ్యాకుల అభిమతం లేక వారి భావం, నిశ్చయంగా బలపడి చర్యగా పరిణమిస్తుందని కాని మనం అనుకోకూడదు. అందువల్లకూడ అసలు అధికసంఖ్యాకులు ఒకే అభిమతాన్నెందుకు కల్గియున్నారన్న మనప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోతున్నది.

## సాంఘికస్థితీ చైతన్యమూ:

మన భావాలెలా యేర్పడుతున్నాయి? పరిస్థితుల ఆధారంపైనని మనకు తెలుసు. ఐతే మన భావాలకూ, నిశ్చయాలకూ, చర్యలకూ ఆధారం మన పరిస్థితులేకాని, ఏపరిస్థితులన్నదే మనం గమనింపవలసిన విషయం. అంటే మనం మనిషి ఎక్కడ నివసిస్తాడో, ఎక్కడినుండి తన భావాలను పొందుతున్నాడో ఆ ఆధారాన్ని గుర్తించాలి.

మనిషి ధనిక స్వామ్యసమాజంలో ఉన్నాడు. కాబట్టి అతని భావాలు ధనిక స్వామ్యంలోనుండి యేర్పడుతున్నవి. ఈ ఆధారాన్ని మనం విశ్లేషించిచూడాలి. మార్క్సు అన్నట్లుగా మనిషియొక్క (భావం) చైతన్యం అతని (స్థితి) పరిస్థితులను కల్పించదుకదా?

ఇక మనముందుకు అసలుప్రశ్న "(1) మనిషి ఎవరు? (2) ఎలా ఆలోచిస్తున్నాడు? లేక ఏమికోరుతున్నాడు?" అన్న రూపంలోవస్తుంది. ఇది అతని భావానికి పునాది అన్నమాట. కాబట్టి ఈ పునాదిపై మనం ఆలోచించాలి.

..."మనం బాగా చైతన్యాన్ని కల్గియున్నాము. కాబట్టి సంకల్పాల కొరకు బాగా పోరాడగలము." అనుకోవటం భావంద్వారా స్థితిని సమన్వయించే తలక్రిందుమార్గమే.

ఇక్కడ మనం మన చైతన్యానికి మూలాధారాన్ని విస్మరిస్తున్నాము. కాబట్టి సమాజంలో "మనస్థానం ఎక్కడ?" అన్న అసలుస్థితిని మనమెప్పుడూ గమనించుకోవాలి. సమాజంలోని మన స్థాయీ లేక స్థానమే మన చైతన్యానికి ఆధారమై మన భావాలను నిర్మాణంచేస్తుంది....

ఇలా మనుష్యుని సమాజస్థితియే అతని భావానికీ, నిశ్చయానికీ, చర్యకూ మూలాధారంగా పనిచేస్తుంది. ఒక శ్రామికుడు శ్రామికుడుగా ఆలోచిస్తాడు. ఒక ధనికుడు ధనికుడుగా ఆలోచిస్తాడు. ఒకే మనిషియైనాసరె "ఒక గుడిసెలోను ఒక భవనంలోను ఒకే రీతిగా ఆలోచించడు." దీన్ని మనం గుర్తుంచుకోవాలి.

## ఆదర్శవాద సిద్ధాంతాలు:

సమాజంలో మానవుని స్థితియొక్క పరిస్థితులే అతని సాంఘిక చైతన్యాన్ని నిర్మాణంచేస్తవి.

అట్లు కాక ఒకడు శ్రామికుడో లేక ధనికవాదియో యవటమంటే అతడు తనను తాను శ్రామికుడుగానో ధనికుడుగానో భావించుకొనుటవల్లనేని ఆదర్శవాదం చెప్తుంది. దీన్ని అంగీకరిస్తే మనం చాల పెద్దచిక్కులో పడిపోతాము. దీనివల్ల ఒక ధనికవాదికూడా, తాను ధనికుడైయుంటూకూడా తనను తాను "శ్రామికుణ్ణి" అని చాటుకునే అవకాశమేర్పడ్తుంది. ఒకడు ధనికుడైనా పరవాలేదు. అతడు తనను తాను శ్రామికుడని భావించి అలా చెప్తే సరి తీరపోతుందనేవరకూ ఈ వాదం ముందుకు నెట్టబడ్తుంది. ధనికుడై ధనికుడుగా ఉన్నాసరె అతనిలో 'మానసిక పరివర్తనం' ఉందన్న ధోరణి ఏర్పడ్తుంది. ఈ ధోరణులన్నీ సామ్యవాద నిర్మాణాన్ని వెనుకకునెట్టి సమాజాభివృద్ధిని నిరోధించుటకు ఎత్తుగడలుగామాత్రమే ఉపకరిస్తవి.

ఒక ధనికుడు తాను ధనికుడైనాసరే భావాల్లో శ్రామికుడే, లేక శ్రామికవర్గంతో అన్నివిధాలా సన్నిహితుడే అనుకొని అలా చెప్పుకుంటేచాలుననే పై ధోరణి మత సామ్యవాదం లేక ఊహాసామ్యవాదం అనబడ్తుంది. ఫాసిస్టుల మూలసూత్రం ఇదే. ప్రజాస్వామిక సోషలిస్టుల ధోరణికూడాయిదే. ఈ ధోరణి ధనికస్వామ్యాన్ని [వ్యక్తియాజమాన్య బహిష్కరణద్వారా] అంతం

చేయుటకుబదులు దాన్ని పాలుపోసి పెంచుటకే ఉపకరిస్తుంది. ఒక పెట్టుబడిదారు మానవజాతిని దోపిడీచేస్తూనే నేను దోపిడీ చేయటంలేదు — అలా చేయుటం తప్పు అనుకుంటే చాలునన్న పెడధోరణికిది దారితీస్తుంది. దీనివల్ల "ధర్మకర్తృత్వ" వాదం పుడ్తుంది. ఒక పెట్టుబడిదారు పెట్టుబడిదారుగా ఉన్నంతవరకూ—శోషణ చేస్తూ ఉన్నంతవరకు—ఆచరణలో అతని పై సద్భావాలన్నీ పొసగనివిషయాలేకదా!

## సాంఘికస్థితి; దాని లక్షణాలు:

సాంఘికస్థితిని మార్క్స్ ఇలా నిర్వచించాడు. "ఒకడు సాంఘిక వ్యవస్థలో తానే భౌతిక జీవనపరిస్థితులను చెందియున్నాడో దాన్నిబట్టి అతని సాంఘికస్థితి (వర్గం) యేర్పడ్తుంది." ఆ వర్గాన్నిబట్టి అతని చైతన్యం ఏర్పడ్తుంది. ఇలా చైతన్యం స్థితిని కాక స్థితియే చైతన్యాన్ని కల్పిస్తూంటుంది.

ఒక ధనికునికీ శ్రామికునికీ లేక నిరుద్యోగికీ ఆలోచనలో చాలా భేదముంటుంది. ఉదాహరణకు 'రైలుప్రయాణం.' ఒక బీదవానికి అది వైభవంగా తోస్తే ఎప్పుడూ మోటారుకారుపై విహరించేధనికునికి ఇబ్బందిగానే ఉంటుంది. ఇక్కడ బీదవాడు బీదస్థితిలో ఉన్నాడు. అందుకని రైలుప్రయాణం అతనికి వైభవంగా ఉంటుంది. కాని అతడు రైలుప్రయాణాన్ని "హాయి" గా భావించటంవల్ల బీదవాడుకాడుకదా?

ఒకని వర్గస్థితిని నిరూపించుటకు మనం సమాజంలోని అతని భౌతిక పరిస్థితులను సూక్ష్మంగా పరిశీలింపవలసియుంటుంది.

ఒకేవిధమైన జీవనపరిస్థితులుగలవారు ఒక వర్గముఅన్నమాట. ఐతే, వర్గనిర్ణయం ఒకడు ఆర్జించే ఆదాయంపైనమాత్రమే ఆధారపడదు. ఒక మధ్యతరగతి పేదవానికంటె ఒక కర్మాగారంలోని కార్మికుడు ఎక్కువ సంపాదించుకోవచ్చు. కాని ఒక కార్మికుని వర్గపరిస్థితులెలాఉన్నాయి. అతనికి సమీకరింపబడిన సంఖ్యాబలముంది. అతను స్వతంత్రుడుకాడు. కాయకష్టం అధికంగా చేస్తాడు. వృత్తికి నిలకడలేదు. అతని ఆర్థికస్థితి అభివృద్ధి అవకాశాలు శూన్యం. అతనిపై యజమానులఒత్తిడి అధికం. సమాజంలో గౌరవంకాని,

ఆధారపడుటకు ఆస్తిపాస్తులు కాని అతనికిలేవు. ఈ పరిస్థితులన్నీ అతని వర్గ స్థితికి ఆధారంగా, వర్గం చైతన్యాన్ని నిర్మాణంచేస్తాయి.

## వర్గపోరాటం చరిత్రకు సంకల్పశక్తి:

మనుష్యులు తాము భావాలు కల్గియున్నందున ఆచరణను కొనసాగిస్తారు. వారిభావాలు వారి సాంఘికస్థితిపై ఆధారపడియున్నాయి. లేక వర్గంపై ఆధారపడియున్నాయి. సమాజంలో రెండే రెండు వర్గాలున్నాయని కాదు—అనేక వర్గాలున్నవి. కాని అన్యోన్యఘర్షణలలో అగ్రపాత్రవహించేవి రెండువర్గాలుమాత్రమే. ఇవే పాలిత పాలకవర్గాలు లేక శ్రామికులూ, ధనికవర్గమూ. ఇలా శ్రామికవర్గ ధనికవర్గాలఘర్షణకు—దారితీసే భావాలకు—ఆయా వర్గాల సాంఘికవ్యవస్థలలోని ప్రత్యేకతలే కారణము.

సమాజంలో ఒకవర్గం మరొకవర్గంతో [తమతమ అభివృద్ధి పోరాట రూపంలో] ఘర్షణ పడ్తూంటుంది. ఈఘర్షణ భావాలలోకూడా ప్రతిబింబిస్తుంది. చరిత్రను నిర్మాణంచేసే లేక ముందుకునడిపే ప్రధాన సంకల్పశక్తి ఈ వర్గపోరాటమే. ఇక వర్గపోరాటం భావంలో ఎలా ప్రతిబింబిస్తుందో ఒక ఉదాహరణద్వారా చూద్దాం.

ఒకవేళ బడ్జెట్‌లో తరుగువచ్చిందనుకుందాం. దాన్ని పూడ్చుటకు రెండుమార్గాలు. (1) ఖర్చులు తగ్గించుకోవటం, (2) ప్రజలనుండి అప్పులు తీసుకోవటం, (3) పరోక్షపన్నులు వేయుంట. ఈమార్గం ధనికవర్గానికి అనుకూలమైనది. పోతే, ధనికులపై ప్రత్యక్షపన్నులు విధించటం లేక తరుగును వారినుండి నేరుగా రాబట్టటం. ఈమార్గం శ్రామికవర్గాలకు అనుకూలమైనది. ఇందులో మొకటిమార్గం సంస్కరణవాదమునకు రెండవమార్గం విప్లవవాదమునకూ సంబద్ధితమైయున్నది.

ఐతే అసెంబ్లీలో జరిగే ఈ రాజకీయఘర్షణకు మూలమేమిటి? సాంఘికఘర్షణ. లేక వర్గపోరాటం. ఈ రెండుమార్గాలలో ఒకటికొకటికి విరుద్ధతవుంది, అది చాలా ముఖ్యమైనది.

దీనికి " ఆధునికచరిత్రలో అన్ని రాజకీయఘర్షణలూ వర్గపోరాటాలు

మాత్రమే. ఈ వర్గపోరాటాలు పైకి రాజకీయస్వరూపాన్నే కనపరచినా (నిజంలో) ఆర్థిక విమోచనకొరకే" అన్నాడు ఎంగెల్స్.

ఇలా చరిత్ర చర్యద్వారా, చర్య నిశ్చయశక్తిద్వారా, నిశ్చయం భావం ద్వారా, భావాలు వర్గస్థితిద్వారా, వర్గాలు భౌతిక (జీవన) పరిస్థితులద్వారా యేర్పడియున్నవి. కాబట్టి మనం చరిత్రను గతితార్కికదృష్ట్యా చూడాలంటే ఒక చారిత్రిక పరిణామంవెనుక పనిచేసిన వివిధ విరుద్ధభావాల ఘర్షణను, దానికి ఆధారమైన విరుద్ధ వర్గపరిస్థితుల స్వరూపాలను, ఆ వర్గనిర్మాణాలకు ఆధారమయ్యే ఆర్థికపరిస్థితులను [ఉత్పత్తి పంపిణీవిధానముల స్థితిగతులను] సూక్ష్మంగా పరిశీలించినగాని సరియైన నిష్కర్షలకురాలేము...

ఇక్కడ మరొకప్రశ్న వస్తుంది. " ఈ వర్గాలూ, ఆర్థికప్రత్యేకతలూ ఎలా యేర్పడ్డాయి? ఈప్రశ్నకు మీ వద్ద సమాధానముందా?" అని. ఔను ఉంది.

వర్గాల నిర్మాణాన్ని పరిశీలించుటకు మనం సాంఘికచరిత్రను పరిశీలించాలి. దానిద్వారా మనకు అవేవర్గాలు, ఎప్పుడూ అవే ఆర్థిక స్థితిగతులతో కొనసాగనట్లు స్పష్టమౌతుంది. ప్రాచీన గ్రీకులయుగంలో యజమానులూ బానిసలసంఘం; మధ్యయుగంలో భూస్వాముల కౌలుదార్లసంఘం; ఈ నాడు పెట్టుబడిదారీ, కార్మికసంఘం ఇలా వివిధరూపాలలో సమాజచరిత్ర అంతర్గత వ్యతిరేకతఘర్షణతో నిరంతరం ముందుకుసాగినట్లు ప్రకటమౌతుంది.

పై వివిధవర్గాల స్వరూపాలలో మార్పులువచ్చినవి? ఎందువల్ల? దీనికి ఆధారం ఆర్థిక పరిస్థితుల మార్పులు. అంటే ఉత్పత్తి, సంచాలన, పంపిణీ వినియోగవిధానాలలో వచ్చినమార్పులన్నమాట. దీనివల్ల వర్గపరిస్థితులలో వచ్చిన మార్పులకు ఆర్థికవిధానాలలోవచ్చిన మార్పులు ఆధారమౌతవని తెలుస్తున్నది.

ఇలాగే ఆర్థికపరిస్థితుల మార్పులవలననే నేటి మన ధనికవాదసమాజం యేర్పడియుంది. ఉత్పత్తివిధానాలు క్రమంగా మార్పునకు గురియైనవి. కుటీర పరిశ్రమలు పెద్దపరిశ్రమలుగా, పెద్దపరిశ్రమలు యాంత్రికవికాసంవలన పారిశ్రామిక పెట్టుబడిగా మారి, నేటి ధనికవర్గ స్వరూపాన్ని నిర్మాణంచేసినవి. ఈవిషయాన్ని మనం ముందుప్రకరణంలో విపులంగా గమనింపగలము.

ఐతే, చరిత్రయొక్క సంకల్పశక్తి నిర్మాణం ఈ క్రిందిక్రమంలో ఉన్నదని మనమిక్కడ మరొకసారి జ్ఞప్తిచేసుకుందాము.

(1) చరిత్ర మానవులచర్య

(2) చర్య సంకల్పశక్తి (నిశ్చయం) పై ఆధారపడియున్నది.

(3) సంకల్పశక్తి భావాలవల్ల కల్గినది.

(4) భావాలు సాంఘికపరిస్థితులనుండి కల్గినవి.

(5) సాంఘికపరిస్థితులు వర్గాలకూ, వర్గపోరాటానికీ ఆధారం.

(6) వర్గాలు ఆర్థికపరిస్థితుల లేక ఉత్పత్తి పంపిణీవిధానాలపై ఆధారపడినవి. వీటిక్రమం ఈ క్రిందిమార్గాలలో వ్యక్తమౌతుంటుంది.

(1) భావాలు తమనుతాము రాజకీయక్షేత్ర జీవితంగాను,

(2) భావాల వెనుకగల వర్గకలహం సాంఘికరంగ జీవితంగాను,

(3) ఆర్థికపరిస్థితులు తమనుతాము ఆర్థికక్షేత్రంగాను యేర్పరచుకొంటవి. ఈవిధంగా మూడుక్షేత్రాలద్వారా సమాజ చరిత్ర గమనం సాగుతుంటుంది.



# వర్గాలూ ఆర్థిక పరిస్థితులూ ఎలా ఏర్పడ్డాయి.

1. మొట్టమొదటి శ్రమ పంపకం.
2. వర్గవిభజన:
3. ద్వితీయశ్రమ విభాగదశ:
4. ఆర్థికపరిస్థితులను శాసించేదేమి ?

గతప్రకరణంలో మనం చరిత్రయొక్క సంకల్పశక్తి సమాజంలోని వర్గములూ, వాటి వ్యతిరేకతలవలని ఘర్షణలమూలంగాను—వాటి ఆధారానికి మూలమైన ఆర్థికపరిస్థితులవలనా యేర్పడుతవని చదివియున్నాము.

మనం ఈ క్రిందివిధంగా వాదించాము. "మనుష్యుల మెదడులో భావాలున్నాయి. అవి వారి నిశ్చయాలుగా పరిణమించి వారిచే చర్యలు జరిపిస్తవి. మనుష్యులభావాలు వారు నివసించే భౌతికజీవన పరిస్థితులపైన లేక సామాజికస్థితిపైన ఆధారపడియున్నాయి. ఈ సామాజికస్థితి వర్గమనబడ్తుంది. ఇప్పుడు మనప్రశ్న సమాజంలో వర్గాలెలావచ్చాయి ? అనేది. లేక సమాజం యొక్క ఆర్థికనిర్మాణమూ దాని ఆధారమూ ఏది ? అను సమస్య. ఇదే మనకిక్కడ చర్చనీయాంశం—

## మొట్టమొదటి శ్రమ పంపకం:

గతితార్కికవిధానం వస్తువుల స్వభావాన్ని వాటి ఉత్పత్తి, వృద్ధి, క్షయాలద్వారా లేక చరిత్రద్వారా విశ్లేషిస్తుంది. కాబట్టి ఆదిమ సమాజ

స్థితి ఎలా ఉండేను ? అనునది చాల ముఖ్యమైనప్రశ్న. సమాజ పరిణామ శాస్త్రం ఆదిమయుగంలో సమాజం వర్గముల క్రింద విభజింపబడి యుండలేదని నిరూపిస్తున్నది. "కుటుంబమూ, దాని ప్రారంభం" అన్న గ్రంథంలో ఎంగెల్స్ ఇలా వ్రాశాడు.

"ప్రాచీనసంఘంలో ఉత్పత్తి సమిష్టికి (వ్యక్తులకు కాదు) చెందియుండేను. అప్పుడు వర్గస్వరూపంలేదు. శ్రామికులూ పాలకులూ అనే తేడా లేదు. ఉత్పత్తి చేయబడ్డ సంపదల పంపిణీకూడా సమిష్టిగా కొనసాగుతుండేను. ఇది ఆదిమ కమ్యూనిజంయొక్క దశ"—

పై సమాజంలో ప్రజలంతా ఉత్పత్తిలో పాల్గొంటారు. ఎవరవరి (చేతి) పనిముట్లువారివి. లేక సమిష్టిగా వాడబడేవి సమాజానివి. ఈ సమాజంలో ఆడ, మగ, బాల, వృద్ధ, లింగ వయోభేదాలుతప్ప కుల, వర్గభేదాలేవీ లేవు. ఇంటిపనులు స్త్రీలూ, అడవులలో వేటాడి ఆహారాన్ని సేకరించటం పురుషులూ ప్రధానంగా చూచుకోవటమే ఆనాటి 'శ్రమ పంపకము'— వ్యక్తుల ప్రత్యేక ఆస్తుల లేక (ఆర్థిక) హక్కుల చింతా చీకూ ఆనాటి సమాజంలో లేదు. ఈ ఆటవిక సమాజస్థితియే మానవసమాజపు ఆదిమ దశ... [నేడుకూడా కోయ, చెంచు, సవరాది ఆటవికజాతులు ఇంకా ఈ లక్షణాలతో మనకు కన్పిస్తూనేఉన్నవి.]

పై ఆర్థికసమాజపు ప్రధాన ఆర్థికోత్పత్తివిధానం వేట. ఈ వేట స్థానాన్ని క్రమక్రమంగా "పశువులమందల పెంపకం" వృత్తి ఆక్రమించింది. మందల పెంపకం అభివృద్ధిజెందటంతో, పశువుల కాపర్లవర్గం ఆవిష్కరణైనది.

## వర్గ విభజన:

ఆటవికదశలో ఒకకుటుంబం తనఅవసరాలవరకే ఉత్పత్తిచేసికొని తృప్తిపడ్తుండేది. ఐతే ఆనాటి ఆర్థికోత్పత్తివిధానం చాలా కాయకష్టంతో కూడియుండేది. కాని పశువుల పెంపకం, ఆదిమ వ్యవసాయం, ఆదిమ కుటీరపరిశ్రమలు క్రమక్రమంగా పైకిరావటంతో కొంత ఉత్పత్తిసౌలభ్య మేర్పడగల్గింది. ఈ వృత్తులద్వారా మానవుడు తన అవసరంకంటే అధికంగా ఉత్పత్తిచేయ

గల్గాడు. ఇలా అభివృద్ధి రాసాగింది. ఐతే ఆ కాలంలో ఆర్థికోత్పత్తి చాల శ్రమతోనూ, ఆలస్యంతోనూ కూడియుండేది. కాబట్టి కొన్ని కుటుంబాలు లేక తెగలవారు తమ శ్రమతోపాటు ఆర్థికోత్పత్తికై అదనపు "శ్రమ" కోసం ప్రయత్నించారు. బలమైన తెగలు యుద్ధాలుచేసి ఇతర దుర్బలమైన తెగలవారిని ఓడించి వారిని తమ బానిసలుగా ఉపయోగపరచుకోసాగారు. రానురాను ఈ బానిసలను పెంచటం, వారి శ్రమను గరిష్ఠపరిమాణంలోకూడ ఉపయోగించటం ఒక సమాజవ్యవస్థగా మారి భూస్వాముల బానిసల సమాజపు ఆవిష్కరణకు పునాదులువేసింది. మొదటిసారి బానిసలూ యజమానులు లేక పాలిత పాలకవర్గాలు సమాజంలో ద్వైవిధంగా ఏర్పడ్డాయి. మనుష్యుని వ్యక్తిగత ఆస్తిభావనా, ఆస్తి మార్పిడిభావనా పశువుల పెంపకంమూలకంగా నిర్మాణమైనది. ఈ భావనలు క్రమక్రమంగా బలపడ్తూపోయినవి.

[ఈ నాటికీ పశువుల పెంపకం, అమ్మకం ప్రధానవృత్తిగా పనిచేసే ఇండ్లు, వాకిళ్ళు, స్థిరనివాసంలేని లంబాడీలూ, ఇలాగే ఇనుం మొదలైన లోహపుపనులుచేసే బయటికమ్మరులూ మనకు తమ ఆదిమ సమాజలక్షణాలతో ఇంకా కన్పిస్తూనేఉన్నారు.]

## ద్వితీయ శ్రమ విభాగదశ:

ఆర్థికోత్పత్తివిధానాలు క్రమక్రమంగా వికసింపసాగినవి. చేనేత, 'విశ్వకర్మవృత్తి, ఇతర చేతిపనులు నానాముఖంగా అభివృద్ధిజెందసాగినవి. వ్యవసాయరంగంలోను పండ్లు, బియ్యం, పప్పులేకాక నూనెగింజల, సారాయపు వైగ్గ లాభసాటి సాగుబడి వృద్ధిజెందసాగినది. ఇలా పారిశ్రామికరంగమూ, వ్యవసాయరంగమూ విస్తృతమై పెరిగినవి. దీనితో మానవుని శ్రమవిలువ మరింత స్పష్టపడటం జరిగినది. అన్నిరంగాలలోను క్రమక్రమంగా యజమాన, దాసవిభేదం బాగా వ్యాపించింది. ఇది ఒక సమాజవ్యవస్థగా పరిణమిస్తూ వ్యవసాయపు పొలాలలోను, కుటీర కర్మాగారాలలోను కార్మికవర్గం అసంఖ్యాకంగా పెరిగిపోసాగింది. ఉత్పత్తిలోని ఈ మార్పుకు అనుగుణ్యంగా పంపిణీలోను "వస్తుమార్పిడి" విధానం వృద్ధిజెంది క్రమంగా వర్తకరూపాన్ని దాల్చింది.

శ్రమ విభాగపు మొదటిదశలో కార్మిక సమీకరణ బాగా పెరిగిపోయి ఆర్థికఉత్పత్తిని పెంచుటకుపకరించినది. ఈ ఆర్థికోత్పాదన శ్రమవిలువను తిరిగి పెంచింది. ఈదశలో వ్యవసాయమూ, పరిశ్రమలూ బాగా విడిపడిపోయినవి. పారిశ్రామికులూ (నిపుణ కార్మికులు), వ్యవసాయదారులూ విడిపడ్డారు. వస్తుమార్పిడిఆధారంపై ఉదయించిన వర్తకవర్గం ప్రాధాన్యతకు రాసాగింది. ఈ వర్తకవర్గం వస్తూత్పత్తిపై కాక కేవలం వస్తుమార్పిడిపైననే ఆధారపడసాగింది. ఐతే త్వరలో నే ఈ వర్తకవర్గం పారిశ్రామికులనూ, వ్యవసాయదార్లనూ వెనుకకు నెట్టివేసి సమాజంలో అగ్రస్థానాన్ని చేకూర్చుకోసాగింది....

మూడవదశ:

ఆదిమకాలపు వస్తుమార్పిడి మారి వాణిజ్యరూపాన్ని చేకూర్చుకోవటంతో వర్తకుడు అధిక ప్రాధాన్యతను చేకూర్చుకున్నాడు. ఇలా పల్లెలూ, పట్టణాల విభేదం క్రమక్రమంగా అతిశయింపసాగింది. పట్టణాల్లో నివసిస్తూ వర్తకవర్గం పంపిణీని తమ గుప్పిట్లోకి తెచ్చుకొని ధనికులుగా బాగా బలపడిపోయారు. వ్యవసాయదారూ, పారిశ్రామికుడూ వర్తకవర్గానికి బాగా లొంగిపోయారు. వర్తకులు అధిక లాభాలద్వారా, ఉత్పత్తి స్తంభనలద్వారా మరికొంత బలపడ్డారు. "వ్యాపారస్వేచ్ఛ, ధనిక శ్రామిక తారతమ్యంలేని సమానహక్కుల" నినాదంతో ధనికవర్గం పాలకవర్గంగా రూపొందింది. ఇలా ధనికస్వామ్య చరిత్ర నిర్మాణమైంది. ధనికవాదం బ్రహ్మాండమైన వేగంతో వ్యాప్తిగాంచి ఒక కీలక అంతర్జాతీయ స్వరూపాన్ని చేకూర్చుకోగల్గింది.

పై సాంఘికచరిత్రలోని వివిధదశలు ఈ క్రిందివిధంగా ఉన్నాయి.

(1) ఆదిమ కమ్యూనిజందశ (వర్గాలు లేనిదశ.)

(2) యజమాన దాస్యసంఘమూలకమైన
[పశువుల పెంపకయుగపు యజమాన దాస్యవర్గాలు.]

(3) భూస్వాములూ, పారిశ్రామికులదశ.
[ఇది రెండవశ్రమ విభాగదశ.]

(4) వర్తకవర్గదశ

[మూడవశ్రమ విభాగపు కాలం.]

(5) ఉత్పత్తి స్తంభనదశ

[పెట్టుబడిదారీ సమాజదశ.]

### ఆర్థికపరిస్థితులను శాసించేదేమి ?

ప్రాచీన గ్రీకుసమాజంనాటికే [మన వైదికయుగంనాటికి] బానిస యజమానసమాజం యేర్పడియున్నట్లు మనకు స్పష్టం. ఆ నాటికే వర్తక [వైశ్య] వర్గ మేర్పడియుండెను. అపిదప మధ్యయుగంలో భూస్వాములు పాలకవర్గంగా యేర్పడ్డారు. తుదకు వర్తకవర్గం అభివృద్ధిజెందటం జరిగినది. వీరు పట్టణాలను నిర్మించి భూస్వాముల పంటలను పంపిణీచేస్తూ లాభాలు గడించేవారు. అంతవరకు ఉత్పత్తిసాధనలు చిన్నవిగా (పరిమితంగా) మాత్రమే ఉండేవి. కాని వర్తకులు బలపడటంతో భారీ వ్యవసాయాలూ, ఘన పరిశ్రమలూ వికసించినవి. ఇటీవలి యాంత్రిక వికాసంలో పరిశ్రమల ఉత్పాదకశక్తి బ్రహ్మాండమైన అభివృద్ధిని చేకూర్చుచున్నది. యంత్రాలు అతిస్వల్ప కాలంలో, అతి స్వల్ప కార్మికసంఖ్యతో సమాజావసర పదార్థాలనన్నిటినీ ఉత్పత్తి చేయగల్గుతున్నాయి. అతివేగవంతమైన రవాణాసౌకర్యాలు పంపిణీ సౌలభ్యతను వేలరెట్లు పెంచాయి. ఇలా ఘనపరిశ్రమలీనాడు సాంఘిక ప్రాధాన్యతనూ స్థాయినీ చేకూర్చుకొనియున్నాయి. పరిశ్రమలు పై మార్పులతో వ్యక్తుల (వర్తకుల) చేతులనుండి జారిపోయి గుత్తపెట్టుబడి స్వరూపాన్ని చేకూర్చుకున్నాయి. ఉత్పత్తివిధానంలోని ఈ ఆధునిక మార్పులు నేటి అంతర్జాతీయ సామాజిక ఆర్థికజీవనాన్ని శాసిస్తున్నాయి. ఈ క్రమాన్ని ఈ క్రింది ఉద్ధరణలు వివరంగా సమీక్షిస్తున్నవి.

"గృహపరిశ్రమలకాలంలో వేలకువేల కార్మికులు చేతిపనిముట్లతో వస్త్రోత్పత్తి చేసేవారు. వ్యవసాయరంగంలోను ఎద్దులతోనో, గుర్రాలతోనో దున్నేవారు. కాని ఆవిరియంత్రాలు రావటంతో, విద్యుచ్ఛక్తిసహాయం చేకూరటంతో బ్రహ్మాండమైన మిల్లులు, [టీతోటలు, కాఫీ, రబ్బరుతోట

లు—అమెరికాలోని పెట్టుబడిదారీ లాభపాటి వ్యవసాయక్షేత్రాలవంటి] భారీ వ్యవసాయాలు పైకిరావటంతో వేలమంది కార్మికులు నిరుద్యోగులు కావలసివచ్చింది ”

ఇలా ఉత్పత్తివిధానంలోని మార్పులు సాంఘిక ప్రాధాన్యతను చేకూర్చుకొనియున్నాయి. కాని ఈనాడు ఆస్తిమాత్రం వ్యక్తులపరంగా [గుత్త స్వరూపంలో] నిల్చియున్నది. వేలాది కార్మికుల శ్రమను అతివేగంగా పూరించే పెద్దపెద్ద కర్మాగారాలు [కొద్దిమంది] పెట్టుబడిదార్ల (స్వంత) ఆస్తిరూపంలోనే శేషించియున్నవి. ఈ వ్యతిరేకత చాలా తీవ్రమైనది—

“ గుత్త పెట్టుబడిదార్లు పెద్ద పెద్ద పరిశ్రమలకూ, కర్మాగారాలకూ లిమిటెడ్‌కంపెనీల స్వరూపమిస్తున్నారు. కంపెనీలషేర్లను అమ్మటంద్వారా సమిష్టి యాజమాన్య స్వరూపాన్ని కల్పింప ప్రయత్నిస్తున్నారు. కాని ఈ విధానం మౌలికంగానే అసమగ్రమైయున్నది. [కంపెనీల మేనేజింగు డైరెక్టర్లుగాని లేక షేరు హోల్డర్లుగాని కావలసింది వారిలాభాలు. వీరి నినాదం “ అధికోత్పత్తిద్వారా—అధిక శోషణద్వారా—తమ అధికలాభాలు.” అంతేకాని అధికోత్పత్తిద్వారా మానవుల అవసరాలు తీర్చటంకాదు.] నేటి యాంత్రికోత్పత్తియుగంలో ఉత్పత్తిసాధనలు సమాజపరం కావలసిన అవసరముంది. ఎందుకంటే వాటి నేటి యజమానులైన గుత్త పెట్టుబడిదార్లు తామేపని చేయకుండానే అన్నిపనులూ తమ ఉద్యోగులద్వారా చేయిస్తూ [తాము లాభాలను పొందుతూ] ఉన్నారు. ”

ధనికస్వామ్యం అంతర్గతమై ఈనాడు మనకు వ్యతిరేకత క్రిందివిధంగా స్పష్టంగా కనపడ్తూఉన్నది.

మరొక ఉదాహరణ: “ ఈనాడు శ్రమ [కూడా] సాంఘిక స్వరూపాన్ని దాల్చియుంది. ఉత్పత్తిసాధనలు (యంత్రాలు) వ్యక్తుల ఆధీనంలో ఉన్నవి. కాబట్టి అవి సమాజాన్ని పెద్దపెట్టున నిరుద్యోగానికి (నిర్ధనతకూ) గురిచేస్తూఉన్నవి. (వేలమంది చేసేపనిని కొద్ది కార్మికులతో యంత్రాలు అతివేగంగా చేయగల్గుతున్నాయి.) ఉత్పత్తి వేలరెట్లు పెరిగింది. ఇటు ఉత్పత్తీ అటు నిరుద్యోగమూ (అవసరాలూ) పెరిగిపోయాయి. ఇది తీవ్రమైన విరు

ద్ధత." ధనికవాద ఆర్థికవిధానంవల్ల యేర్పడ్డ ఈ సాంఘిక విరుద్ధతయే ఈ నాడు సాంఘిక విప్లవరూపాన్ని చేకూర్చుకొని వర్గఘర్షణ ముందుకు కొనసాగుతున్నది. ఈనాడు ఉత్పత్తి సమాజపరం కావలసియుంది.

" ఈనాడు ఉత్పత్తిసాధనలు యంత్రాలూ, క్రమా సాంఘిక స్వరూపాన్ని చేకూర్చుకొనియున్నవి. కాని అవి వ్యక్తి యాజమాన్యమునకు లోబడియున్నవి. ఈ తీవ్ర వ్యతిరేకత ధనికస్వామ్య అంతానికి దారులుతీస్తున్న దృశ్యం స్పష్టంగా కనపడ్తున్నది." ఎంగెల్స్.

ఉత్పత్తియొక్క రెండవలక్షణం, దానిలోని మార్పులూ, అభివృద్ధి ఎప్పుడూ ఉత్పత్తిశక్తుల మార్పూ అభివృద్ధిపైనా, అంతెకంటే మౌలికంగా ఉత్పత్తిసాధనల మార్పూ వికాసంపైనా ఆధారపడియున్నవి. ఉత్పత్తి యొక్క అతివేగవంతమైన విప్లవశక్తులు ఉత్పాదకశక్తులు. మొదట సమాజంలోని ఉత్పాదకశక్తులు మార్పుద్వారా అభివృద్ధిజెందుతవి. పిదప వాటిమార్పుకు అనుగుణ్యంగా ఉత్పత్తితో సంబంధించిన సామాజిక ఆర్థికసంబంధాలు మార్పుజెందుతవి. అంటే, ఉత్పత్తిశక్తులు ఉత్పత్తిసంబంధాలపై నుతరాం ఆధారపడియుండవనికాదు. లేక ఉత్పత్తిసంబంధాలు ఉత్పత్తిశక్తులపై అసలే తమ ప్రభావాన్ని కల్గలేవనీకాదు. ఉత్పత్తిసంబంధాల అభివృద్ధి ఉత్పత్తిశక్తుల స్వరూపంపై ఆధారపడియున్నందున, అవి ఉత్పాదకశక్తులతో అనుకూలతనో లేక ప్రతికూలతనో తప్పక ప్రకటిస్తుంటవి.

...ఇక్కడ గమనింపవలసిందేమి ?...ఉత్పత్తిసాధనలు గొప్ప అభివృద్ధిని సాధించియున్నప్పుడు ఉత్పత్తిసంబంధాలు నోరుమూసుకొని అట్టే కాలం వెనుకబడినస్థితిలో ఉండజాలవు. ఇలా ఉత్పత్తిశక్తుల పురోగమనం ఉత్పత్తిసంబంధాల అనుకూలత లేక వ్యతిరేకతపైన ఆధారపడక తప్పదు. కాబట్టి వెనుకబడియున్న ఉత్పత్తిసంబంధాలు ఎలాగైనా ఉత్పత్తిశక్తులు చేకూర్చుకొన్న అభివృద్ధికి అనుగుణ్యమైన అభివృద్ధిని తామూ చేకూర్చుకొనక తప్పదు. లేకపోతే ఉత్పాదకశక్తుల, ఉత్పత్తిసంబంధాల సంబంధాలు తెగిపోయి ఆర్థిక ప్రతిష్టంభన యేర్పడి ఉత్పత్తియంత్రం కూలిపోయే పరిస్థితికి దారితీస్తుంది !....

[ఆర్థిక ప్రతిష్టంభన అంటే మార్కెట్‌లో సరుకులు విరివిగా ఉన్నా

గిరాకీ లేకపోవటం. అందువల్ల ఉత్పత్తి కుంటుపడి ఉత్పత్తిశక్తులలో— స్తబ్ధతా నిరుద్యోగతకూ దారితీయటంఅన్నమాట.]

"ఉత్పాదకశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ అసంబద్ధత తన్మూలక మైన ఘర్షణ ధనిక స్వామ్యదేశాలలో ఈనాటి మౌలిక సంక్లిష్ట సమస్యగా కనపడ్తుంది. ఉత్పత్తి వ్యవస్థ సాంఘిక స్వరూపంలోను దాని యాజమాన్యం వ్యక్తులపరంగాను ఉండటమే దీనికి మూలం. అందువల్ల తీవ్రమైన ఆర్థిక సంక్షోభాలేర్పడ్తున్నాయి. [అమెరికా పెట్టుబడిదార్లు తమ లాభాలను కాపాడుకొనుటకు ప్రపంచం తీవ్రమైన ఆహారకొరతకు గురియైయున్న కాలం లో కోట్లబస్తాలు గోధుమలు సముద్రంలో పారబోస్తారట! ఇటు ఉత్పత్తిని ఇలా చేస్తూ చాలక పైగా అటు ప్రజల అవసరాలను పెంచటానికి (గిరాకీ) కోసం యుద్ధాలూ కావాలంటూంటారువాళ్ళు! ఇలా ఉంటుంది ఆర్థిక సంక్షోభ స్వరూపం.] సమాజవ్యవస్థనుండి సహజంగా యేర్పడ్తున్న ఈ సంక్షోభాలు యాంత్రికంగా ఎంత నిరోధింపబడినా నానాటికి పెరిగిపోయి నేటి ఆర్థిక ఉత్పత్తిశక్తుల స్వరూపాన్ని కూలద్రోయక తప్పదు. ఇలా ధనికస్వామ్యవిధా నం అంతమై సామ్యవిధానం రూపందటానికి ఈనాడు సన్నపరిస్థితు లున్నాయి."

యూ. యస్. యస్. ఆర్‌లో ఉత్పాదకశక్తులు సంఘపరం చేయబడి యున్నవి. అక్కడ సామ్యవాద స్వరూపాన్ని దాల్చిన ఘనోత్పత్తివిధానం సమాజపరం చేయబడియున్నది. అందుకని అక్కడ ఆర్థిక సంక్షోభాలూ, ఉత్పత్తిశక్తుల పతనమూ అను సమస్యల ప్రసక్తిలేదు.

ఉత్పాదకశక్తులు వేగవంతములూ, విప్లవాత్మకములగు ఉత్పత్తిఅంగము లే కాక, అవి ఉత్పత్తి అభివృద్ధికినీ నిర్ణాయకములుగా నుండును. కాబట్టి ఉత్పాదకశక్తులు ఏస్వరూపంకల్గియుంటే, ఉత్పత్తిసంబంధాలు తదనుగుణ్యంగా ఉండటంమాత్రమే సామాజికాభివృద్ధిని సహజంగా నిర్మాణం చేయగలదు. ఏపదార్థాల ఉత్పత్తిద్వారా ప్రజలు తమ అవసరవస్తువులను సిద్ధముచేసుకుంటూ రన్నప్రశ్నకు—ఉత్పాదకశక్తుల యాజమాన్య స్థితిగతులే సమాధానము. అనగా ఉత్పత్తిసాధనలగు భూమి, అడవులు, నీరు, గనులు, ముడిపదార్థాలు, ఘనో త్పత్తిసాధనాలు, ఉత్పత్తి ఆవరణలు, రవాణాలు, రాకపోకలకు యజమాను

లేవరు? అన్న ప్రశ్నలకు ఉత్పత్తిసంబంధాలే సమాధానమన్నమాట. ఉత్పత్తి సాధన లెవరిచేతిలో ఉన్నాయి? సాముదాయకంగా సమాజమా? కొందరు వ్యక్తులా? ముఠాలా? లేక వర్గాలా? వాటిని శాసించేది...అలాగే వాటిని వినియోగించడంద్వారా శోషణచేయబడ్తున్నదికూడా వ్యక్తులా? ముఠాలా? వర్గాలా? అన్నవి మౌలికమైన సమస్యలు. వీటిని పరిశీలించటంద్వారా మనం సరియైన నిష్కర్షలకు రాగల్గుతాము.

## పర్యవసానం:

మనం కొద్దిఅవకాశంలో సాంఘిక విధానాల, వర్గాల ఆర్థిక విధానాల నన్నిటినీ సింహావలోకన చేశాము. ఇందులో మనము ఇదివరకు చదివిన గతితార్కిక సూత్రాలన్నీ ఇమిడియున్నవి. ఈ పాఠ్యాంశాలలో ఒకభాగం ఇంకోభాగంతో అవిచ్ఛిన్న సంబంధాన్ని కల్గియున్నది. ఈ చరిత్రంతా చలనాత్మకతను కల్గియున్నది. సాంఘిక పరిణామాల పై చరిత్రలోని ప్రతిమార్పు అంతర్గతమైన నిరోధక, పురోగామికశక్తుల అన్యోన్య ఘర్షణద్వారా కొనసాగినది. ప్రతిఘర్షణా పాతసమాజ స్వరూపాన్ని ధ్వంసంచేసి, క్రొత్త సమాజాన్ని నిర్మాణంచేసినది. ప్రతి నూతన సాంఘికస్వరూపమూ దాని పూర్వరూపమునకు భిన్నమైయున్నది. ఈ సామాజికమైన మార్పులు పైకి స్తబ్ధములుగామాత్రమే తోచు అనేక ప్రభావాల సంచయనంయొక్క సాముదాయక విప్లవపరిణామాలద్వారా జరిగినవి. ఇందులో,

(1) వస్తువుల లేక భావాల అన్యోన్యాశ్రయం;

(2) గతితార్కిక చలనమూ మార్పు:

(3) స్వయంసిద్ధ అనుక్రమం:

(4) వ్యతిరేకత:

(5) అనుకూలచర్య [అనుబద్ధ అనుక్రమం:]

(6) పరిణామపు హఠాద్విజృంభణ: నిరూపితమైనవి.



## షష్ఠమభాగం.

# సిద్ధాంతాలకు గతితార్కికవిధానపు సమన్వయం.

1. సిద్ధాంతం అంటే ?
2. ఆర్థిక నిర్మాణం; దృక్పథాలు.
3. సరియైన చైతన్యం; తప్పుడు చైతన్యం.
5. సిద్ధాంతభాగాల చర్య; ప్రతిచర్య.

మార్క్సిజమనగానే అదొక రాజకీయార్థికవాదమనీ, అది చరిత్రలోని భావాల వికాసక్రమాన్ని పాటింపదనీ, సిద్ధాంతాల పాత్రను నిరాకరిస్తుందనీ, కేవలం ఆర్థికపరిభావాలనే లక్షిస్తుందనీ సామాన్యంగా భావింపబడుతుంది.

కాని అది నిజంకాదు. మార్క్సిజం మానవజీవితంలో విజ్ఞానమూ, కళలూ, సంస్కృతీ, సాంప్రదాయాలు వహించే ముఖ్యమైనపాత్రలను నిరాకరించదు. అలా నిరాకరించడం సంకుచిత శకత్వ (సెక్టేరియన్) ప్రవృత్తియే ఔతుంది. మార్క్సిజం సిద్ధాంతాల స్వరూపాలకు తప్పక ప్రాధాన్యత నిస్తుంది. ఇక్కడ మనం మార్క్సిజాన్ని సిద్ధాంతాలకు ఎలా సమన్వయించాలో చదువనున్నాము. మనం చరిత్రలో సిద్ధాంతాల లేక దృక్పథాలపాత్ర ఎలాంటిదో సరిగా గమనించాలి. సిద్ధాంతపు ఆచరణాత్మకపార్శ్వం, సిద్ధాంతపు మౌలిక స్వరూపం వీటిని సరిగా పరిశీలించాలి. (లేనిచో నేలవిడిచి సాముచేయుటే కాగలదు).

ఇప్పుడు మనం చదువనున్న మార్క్సిస్టు తత్వశాస్త్రపార్శ్వం చాలా తక్కువ ప్రచారాన్ని పొందియుంది. రాజకీయార్థికములకుచెందిన మార్క్సిస్టు సూత్రాలు చాలా ప్రచారాన్నీ, ప్రత్యేకతనూ గాంచియున్నవి. ఐతే సిద్ధాంతాలకు గతితార్కికవిధానపు సమన్వయం వెనుకకు నెట్టబడటంతో మార్క్సిజంయొక్క పరిపుష్టత కొంత లోపించటమేగాక అది తనభూమికనుండి (యాంత్రికంగా) తొలగింపబడటంకూడ జరుగుతున్నది. రాజకీయార్థికములకు మూలం చారిత్రిక భౌతికవాదమనీ లేక చరిత్రకు గతితార్కికసూత్రముల సమన్వయమనీ మనకు తెలుసు. కాబట్టి చరిత్రలోని విభిన్న సిద్ధాంతాల, దృక్పథాలపాత్రను విస్మరించటం అసమగ్రతకు దారితీస్తుంది. విషయాన్ని అసమగ్రవిలోకనంతో చూచే అధిభౌతికవిధానంవలెనే పైనకూడా గతితార్కిక భూమికనుండి దిగజారుతూ మార్క్సిజంను కేవలం రాజకీయార్థికంగామాత్రమే ప్రత్యేకించుట జరిగినది. ఇట్లు ఒకపక్షాన్ని పట్టుకొని ప్రాకులాడే సంకుచితత్వం తప్పుడు నిష్కర్షలకు, ఫలితాలకు దారితీస్తుంది. మార్క్సిజాన్ని జీవితంలోని లేక చరిత్రలోని సిద్ధాంతాలపాత్రకు అలిప్తంగా, కేవలం రాజకీయార్థికంగామాత్రమే అన్వయించుట అసమగ్రతద్వారా తప్పుడుఫలితాలకే దారితీస్తుంది. కాబట్టి మనం మార్క్సిజంను గతితార్కిక దృక్పథంనుండి దిగజారనీయకూడదు. అంటే దాని సమగ్ర విలోకనకు లోపం కల్గింపకూడదు—

ఇక్కడ మనం కొన్ని నిర్వచనాలతో ముందుకు పోవలసియుంటుంది.

సిద్ధాంతం లేక దృక్పథమంటే ఒక మూలసూత్రమన్న మాట. మూలసూత్రమైన ఒక భావం, ఒక భావ సముదాయపు కీలకంగా ఉంటుంది. లేక ఒక మనస్తత్వపు లేక అభిప్రాయపు భావసముదాయానికి మూలాధారమైయుంటుంది. ఈ మూలాధార భావం భావసముదాయం లేక పరంపర ద్వారా నిర్మాణాన్ని చేకూర్చుకొని తన 'వ్యక్తీకరణను స్పష్టపరచుకొని వృద్ధి పొందుతుంది.

అలాగే గతితార్కిక భౌతికవాదంకూడా (ఒక సిద్ధాంతంగా) వ్యాప్తి చేకూర్చుకొని అన్ని సమస్యలను ఆవరించి వాటికి తగు సమాధానాలిచ్చే సమగ్ర స్వరూపాన్ని కల్గియున్నది....

ఏ దృక్పథమైనాసరే అది (రాగద్వేషాలను) అభిరుచులను, సాను భూతులను, వ్యతిరేకతలను, ఆశలూ—నిరాశలూ మొదలగు మానవీయ ప్రవృత్తులను అలిప్తమై అతీతమైనదిగా ఉండదు. అట్లాగే మార్క్సిజంకూడా. మార్క్సిస్టు శ్రామిక దృక్పథాన్ననుసరిస్తాడు. అతడు పీడితవర్గంతో సాను భూతికీ, శోషకవర్గంతో వ్యతిరేకతకూ లోనైయుంటాడు. శోషణను ఎదిరించి నిల్చే పీడితులపై పక్షపాతం వహించియుంటాడు. ఇదంతా సిద్ధాంత మూలకంగా యేర్పడినదే. అలాగే ఒక రిపబ్లికువాది రిపబ్లికీయ దృక్పథాన్ని కల్గియుంటాడు. కాబట్టి మార్క్సిజం—లేక ఒక సిద్ధాంతం—మానవీయ ప్రవృత్తులకు; మనస్తత్వానికి అతీతమైనదిగా ఉండదు.

ఇప్పుడు మనం దృక్పథంయొక్క ఆచరణపార్శ్వాన్నీ, దృక్పథపు స్వరూపాన్నీ పరిశీలించాలి. దృక్పథంయొక్క ప్రయోగాత్మక పార్శ్వం ఆచరణకు దారితీస్తుంది. అది మానవులపైన తన ప్రభావాన్ని వేస్తుంది. కార్య క్షేత్రానికి సంకల్పశక్తిగా పనిచేస్తుంది. ఉదాహరణకు మతాలను తీసుకుందాం. ఈనాడుకూడా మతాలు క్రియాత్మక పార్శ్వాన్ని కల్గియుంటూ—ప్రభావోత్పాదకమైన నైతిక కట్టుబాట్లకు ఆధారమౌతూ ఉన్నవికదా? దృక్పథం ఇలా తన ఆచరణపార్శ్వాన్ని కల్గియుంటుంది.

ఇక మనం సిద్ధాంతపు స్వరూపాన్ని పరిశీలింతాము. ఒక ప్రత్యేకిత సీమలో ఒక సర్వోపరి భావాన్నాశ్రయించిన అనేక భావాల (వాక్యాల) సముదాయమే సిద్ధాంతం. మతమూ, నీతీ సిద్ధాంతాలే. అలాగే శాస్త్రం, తత్వశాస్త్రం, కళా, సారస్వతమూను.

ఐతే, ఆయా సిద్ధాంతాల చరిత్రను మనం పరిశీలించాలంటే—లేక సమాజ చరిత్రలోని వాటి పాత్రను గమనించాలంటే, మనం చరిత్రనుండి దృక్పథాలను విడదీయకుండా, సమాజ జీవితక్రమంనుండి వాటిని వేరుపర్చకుండా, సమన్వయరూపకంగా విశ్లేషించాలి.

## ఆర్థిక నిర్మాణం; దృక్పథాలు:

చారిత్రిక భౌతికవాద ప్రకరణంలో మనమీ క్రింది క్రమాన్ని గమనించాము.

మనుష్యులు తమ చర్యలద్వారా చరిత్రను నిర్మిస్తారు. చర్య సంకల్ప శక్తి (ఇచ్ఛ లేక నిశ్చయం) వలనా, సంకల్పశక్తి భావాలవలనా యేర్పడు తుంది....ఇక్కడ మన ప్రస్తుతప్రశ్న వస్తుంది. భావా లెలా యేర్పడుతవి? అని. లేక దృక్పథం ఎలా యేర్పడుతుందని. దీనికి సమాధానం మనుష్యులు వర్గాలుగా యేర్పడియున్నట్టి సమాజంలోనుండి అని. వర్గాలకు ఆధారం ఆర్థిక విధానం లేక ఉత్పత్తివిధానాలుకదా!

సిద్ధాంతపార్శ్వానికీ, సామాజికపార్శ్వానికీ మధ్యగా రాజకీయపార్శ్వం పనిచేస్తూ సాంఘిక పోరాటంయొక్క ప్రతిబింబముగు సిద్ధాంతపోరాటంగా బహిర్గతిమౌతుంది.

సాంఘికవిధానంలో ఆర్థికం మొదటిమెట్టు, దీనిపైన సాంఘికపు మెట్టు, ఆపైన రాజకీయపుమెట్టు, దానిపైన సిద్ధాంతపుమెట్టు...ఇలా ఇవి ఒకదాని ఆధారంపై మరొకటి నిల్చియున్నాయి.

ఇక్కడొక ముఖ్యమైన తేడా...భౌతికవాదులకు తుదిమెట్టు సిద్ధాంత భాగం, కాని ఆదర్శవాదులకు తొలిమెట్టు లేక పునాదియే సిద్ధాంతభాగం. ఈ విభేదం చాలా ముఖ్యమైనది.

భౌతిక జీవనంలో ఉత్పత్తివిధానం సాంఘిక, రాజకీయ, సైద్ధాంతిక జీవనక్రమాన్ని నిర్మిస్తుందికదా! కాబట్టి మూలసత్తాయైన ఉత్పత్తివిధానం పునాదినిర్మాణం (Infra structure) అన్నమాట. పోతే సిద్ధాంతం మతాన్నీ, నీతినీ, శాస్త్రాన్నీ, సాహిత్యాన్నీ, కళలనూ మొదలైన వివిధ స్వరూపాలను ఆవరిస్తుంది. ఇది (Super structure) ఉపరినిర్మాణ మన్నమాట.

భౌతికవాదం 'వివేకం లేక చైతన్యం' పదార్థ ప్రతిబింబమని గుర్తిస్తుందని మనకు తెలుసు. సాంఘికస్థితి సాంఘికచైతన్యాన్ని కల్పిస్తుందని కూడా మనకు స్పష్టం. కాబట్టి ఇప్పుడు పునాదినిర్మాణం పై అంతస్థుగా ప్రతిబింబిస్తుందని మనం గమనించాలి. అంటే ఉపరినిర్మాణపు స్వరూపం పునాది నిర్మాణపు ఆధారంపై ఆధారపడియుంటుందన్నమాట. దీన్ని మనం ఒక ఉదాహరణద్వారా విశ్లేషింతాము. ఎంగెల్స్ ఈ క్రింది ఉద్ధరణచూడండి—

"సమకాలీక ధనికతత్వ సిద్ధాంతులలో కాల్విన్ దృక్పథం చాలా ప్రధానమైనది." బిషప్ కాల్విన్ మతదృష్ట్యా తన వ్యాపార ''కర్మ' సిద్ధాంతంలో "వాణిజ్యరంగంలో లాభనష్టాలు వర్తకుని తెలివితేటలపైగాక, అతని శక్తికిమించిన ఏవో అనివార్య ప్రభావాలవల్ల కల్గుతుంటాయి" అన్నాడు. "వర్తకుడు అనుకున్నది అనుకున్నట్లు జరుగదూ; తప్పించుకోజూచినది తప్పదూ. అతడు అనిర్వాచ్యమైన ప్రబలశక్తుల ప్రభావాలకు ఎలాగూ లొంగకతప్పదు—" ఈ కాల్విన్ సిద్ధాంత ఉదాహరణ అతనికాలంలో సరిగా అన్వయించింది. అప్పటి వాణిజ్య విప్లవదశలో "పాత వ్యాపార కేంద్రాలూ, పరిస్థితులన్నీ మూలబడి క్రొత్త వర్తకాలూ, విధానాలూ తల చూపినవి. ఇండియా, అమెరికాలు కనుగొనబడ్డాయి. దానితో వెండి బంగారు విలువలు క్రిందుమీదై చలించసాగినవి." ఈ మార్పులు కాల్విన్‌కు స్థూలంగా "కర్మసిద్ధాంతం" వలెనే కన్పించినవి.

వ్యాపారజీవనంలో వర్తకులస్థితి సామాన్యంగా ఎలా ఉంటుంది? వారు పోటీలకు గురియైయుంటారు. ఈ పోటీలలో మేడలుకడుతున్నవారూ, దివాళాలుతీస్తున్నవారూ ఉంటారు. సర్వసాధారణంగా ధైర్యంతో ముందంజ వేసే తెలివిగలవాడు అనుకోకుండా దెబ్బతినటం, ఉట్టి తెలివితక్కువవాళ్ళు డబ్బు సంపాదిస్తూపోవటం జరుగుతూనే ఉంటుంది. ఈ వాతావరణంలో కర్మసిద్ధాంతమే నిజం; జరుగనున్నది జరుగకమానదు; జరిగితీరుతుంది అనే ప్రొటెస్టెంట్ విశ్వాసం లేక మన నిష్కామ కర్మసూత్రం వాస్తవమనితోస్తే ఆశ్చర్యమేముంది?

ఆర్థికవిధానంలో యేర్పడ్డ పునాదినిర్మాణం పై ఉదాహరణలో పై అంతస్థగు సిద్ధాంతనిర్మాణంలో మార్పు నెలా కల్గించిందో మనమిక్కడ గుర్తించాలి. ఇక మనం మరో ఉదాహరణను చూద్దాం....

ఇద్దరు కార్మికులున్నారు. ఒకడొక చిన్న పెట్టుబడిదారు కర్మాగారంలో పనిచేస్తున్నాడు. మరొకడు పెద్దవర్తకుని మిల్లులో పనిచేస్తాడు. వీరు తమతమ కర్మాగార జీవనాలనుబట్టి తమతమ యజమానులవిషయంలో ఎలాంటి అభిప్రాయాలను కల్గియుంటారు? చిన్నవర్తకునివద్ద (అతనితో కలిసిమెలిసి) పనిచేసే అతడు తన యజమాని విషయంలో ఒక మధ్యరకం అభిప్రాయాన్ని

కల్గియుంటాడు. కాని ఘనోత్పత్తిమిల్లులో పనిచేసే కార్మికుడు తన యజమానిని వేల కార్మికులనూ, ప్రజలనూ (దేశాన్ని) దోపిడీచేస్తున్న రాక్షసునివలె చూస్తాడు. ఇక్కడ ఆర్థికోత్పత్తివిధానాలలోని భేదం ఇద్దరు కార్మికులచే రెండువిధాలుగా తమ యజమానులనుగూర్చి బహిర్గతమైనది. ఇది వారివారి పరిస్థితుల ఆధారంపై వారి భావాలలో యేర్పడిన భేదం.

ఈ ఉదాహరణ నిక మనం మరోవిధంగా చర్చిద్దాం....

## సరియైన చైతన్యం; తప్పుడు చైతన్యం:

సమాజంయొక్క భౌతిక పరిస్థితుల ప్రతిబింబమే సిద్ధాంతము, లేక భావమని మనకు తెలుసు. సాంఘికస్థితియే సాంఘికచైతన్యాన్ని నిర్మాణం చేస్తుంది. కాని దీనిఅర్థం ప్రతి కార్మికుడూ వర్గచైతన్యాన్ని కల్గియుంటాడని కాదు. ఎందుకు? వాస్తవికస్థితి ఈ సూత్రానికి సమన్వయమైలేదు. కార్మికచైతన్యం లేని కార్మికులుకూడా ఎందరో ఉన్నారుకదా! "ఒకమనిషి ప్రత్యేకపరిస్థితులలో నివసిస్తుండవచ్చు. కాని పరిస్థితులనుగూర్చిన చైతన్యం సరియైనది కాకపోవచ్చు." దీన్ని ఎంగెల్స్ తప్పుడు చైతన్యమని పేర్కొన్నాడు.

ఉదాహరణకు ఒక చేనేత కార్మికుణ్ణి తీసుకుందాం. అతడు (చేతిమగ్గంద్వారా) నేతపరిశ్రమ బాగుపడాలని ఆందోళనచేస్తాడు. మిల్లులూ, (పవరుమగ్గాలు) వాటి ఉత్పత్తి నిరోధింపబడాలని వాదిస్తాడు. ఇక్కడ చేనేత కార్మికునికి తన దౌర్బల్యం, నిస్సహాయత తెలియవనికాదు. కాని అతడు మధ్యయుగీన కుటీర పరిశ్రమల పరిస్థితులు తిరిగి యేర్పడితే బాగుంటుందని కోరుతాడు. మిల్లుల ఉత్పత్తిలోని నాణ్యతా, చౌకదనమూ అతనికి తెలిసికూడా (చేసేదిలేక) అతడు చేతిమగ్గాన్నే వెనుకవేసుకొనివస్తాడు. కాబట్టి పరిస్థితులు తెలిసికూడా చేనేత కార్మికుడు పొందుతున్న చైతన్యం సరియైనదికాదు. అతడు సమాజంలోని వైప్లవిక అభివృద్ధికి యెదురీత నీదుతున్నాడు.

ఈ ఉదాహరణలో చేనేతకార్మికుడు తనకోసం తిరిగి మధ్యయుగీన పరిస్థితులు కల్పనకావాలని వాంఛించటం హాస్యాస్పదమైనవైఖరి. అది అభి

వృద్ధి నిరోధకం కూడా. ఐతే మిల్లుల పోటీవల్ల తనపరిస్థితులు చెడిపోయిన వన్న అతని చైతన్యం సరియైనదే—కాని అతడు అభివృద్ధిక్రమంతో ముందుకు సాగలేక దాన్ని వెనుకకు నెట్టగోరటం పొరపాటు. కాబట్టి అతని చైతన్యం అసమగ్రసత్యమై యున్నది.

అట్లాగే ఒకరాజుపోయి మరొకరాజు వస్తే తమ దారిద్ర్య నిస్సహాయ తలు తొలగిపోతవనే నమ్మకం కూడా. ఒకవేళ కార్మికులు ఇలా భావిస్తుంటే వారి చైతన్యం అసమగ్రంగా నున్నట్లే. తమ దారిద్ర్య నిస్సహాయతల చైతన్యం వారిలో ఉంది. కాని వాటిని తాము తొలగించుకోవాలన్న చైతన్యం లేదు... ఇదీ అభివృద్ధిమార్గానికి వ్యతిరేకమైన ధోరణియే. అసమగ్ర చైతన్యం ఇలా ఆచరణ క్షేత్రాన్ని వెనుకకు నెట్టుతుంటుంది.

కాబట్టి పరిస్థితుల 'స్థితి' నుండి చైతన్యం లేక సిద్ధాంతం యేర్పడ్తుం దంటే, ప్రతిబింబరూపకమైన ఆ చైతన్యం అనివార్యంగా (సమగ్ర సత్యంగా) సరియైనది కానక్కర్లేదు....కాగా, పాలకవర్గా లెప్పుడూ పీడితప్రజలలో వైవిధ్యమైన తప్పుడు చైతన్యాన్ని వ్యాపింపజేయుటకే కృషి చేస్తుంటవి. మనకు పాఠశాలల్లో—ఇతర పాలకవర్గ విజ్ఞానరంగాలలో సామాన్యంగా తప్పుడు చైతన్యమే నూరిపోయబడ్తు:టుంది. పాలకవర్గాల ప్రచారసాధనాలు (1) పత్రికలు, (2) రేడియోలు, (3) సినిమా మొదలైనవి అందుకు సాధనాలుగానే ఉపయోగపడ్తుంటాయి.

ఈ పరిస్థితులలో మార్క్సిస్టులకు "సిద్ధాంత భాగం" చాలా అవశ్యమైనది. తప్పుడు చైతన్యం సరియైన సిద్ధాంతాలద్వారా తొలగింపబడాలి. విమర్శద్వారా సరియైన చైతన్యం నిర్మాణం చేయబడాలి. ఇది కేవలం సిద్ధాంత రంగంలో కృషి ద్వారామాత్రమే సాధ్యమౌతుంది.

కాబట్టి మార్క్సిజం సిద్ధాంతాలకు దూరంగా ముడికట్టుకొని నిలబడదు. అది సమాజంలోని సిద్ధాంతాలపాత్రల ప్రాముఖ్యతను గుర్తిస్తుంది. సమాజం నుండి సరియైన సిద్ధాంతాన్ని నేర్చుకొనుటకూ, దాన్ని మానవులకు నేర్పుటకూ మార్క్సిజం ద్వారాలెప్పుడూ తెరవబడియేయుంటవి. ఇందుకు సాధనమైన తత్వశాస్త్ర అధ్యయన, ప్రచారాలను మార్క్సిస్టులు ముఖ్యవిధిగా పాటిస్తారు.

## సిద్ధాంతభాగాల చర్యా: ప్రతిచర్యా:

మనం కేవలం వస్తుగత ఆర్థికపరిస్థితులే భావాలను నిర్మాణం చేస్తాయని సంకుచితంగాను, గుడ్డిగాను నమ్మి ప్రయోజనంలేదు. అది నిజమే కాని, మిగిలిన విషయాలను విడిచిపుచ్చి కేవలం ఆర్థికమూలములపైన మాత్రమే ఆధారపడటం అసమగ్రతకూ, ప్రమాదానికే దారితీస్తుంది. కాబట్టి నిర్ణాయకమయ్యే ఆర్థిక పునాది నిర్మాణంపైన పై అంతస్తుల ప్రభావం కూడా పాటించబడాలి. అప్పుడే సరియైన నిష్కర్ష యేర్పడుతుంది. దీన్ని ఎంగెల్స్ ఇలా వివరించాడు.

" చారిత్రిక భౌతికవాద దృక్పథంతో చరిత్రగమనాన్ని నిర్ధరించే మూలశక్తి వాస్తవిక జీవనపరిస్థితుల నిర్మాణమూ, దాని సరియైన ప్రతిబింబ స్వరూపమూ. మార్క్సుకాని, నేనుకాని ఇంతకుమించి మరేమీ చెప్పలేదు. కాబట్టి ఎవరైనా ఒక్క ఆర్థిక స్థితియే ఏకైక నిర్ణాయకమని (అప) వ్యాఖ్యానాలు చేసినట్లయితే వారా ప్రాతిపదికను అనూహ్యంగా, అర్థరహితంగా, వికారంగా అర్థం చేసికొన్నట్లేనన్న మాట. ఆర్థికవిధానం మూలాధారమే. కాని పై అంతస్థు స్థితిగతులుకూడా తమతమ పాత్రలను నిర్వహిస్తూ తమతమ ప్రభావాలను వేస్తూనేఉంటవి. ఈ రెండు ప్రభావాలూ అన్యోన్య ఘర్షణకు గురియౌతుంటాయి. వీటి ఎడతెగని అనుక్రమ పరంపరనుండి తుదకు ఆర్థిక భూమికయే యథావసరరూపంలో విజృంభిస్తుంది. "

కాబట్టి మనం ఆర్థిక స్థితిగతులను పరిశీలించేముందు మిగతా అంశాలను కూడా గమనించాలి. ఐతే, ఒకవేళ అవి పరిస్థితులకు కారణాలుగా కనిపిస్తున్నా—అవే సరైన కారణాలు కావనిమాత్రం జ్ఞాపకముంచుకోవాలి. ఇక ఆర్థిక పునాదుల మన పరిశీలన ఇలా కొనసాగాలి.

భావాలూ, సిద్ధాంతాలూ ఆర్థిక పునాదుల పరిణామాల ప్రతిబింబములే. కాని ఈ రెంటి సంబంధం సూటియై—తేలికైనదికాక సంక్లిష్టమైనదని గమనింపబడాలి. ఈ దృష్ట్యా మనం పై అంతస్థుల (భావాల, సిద్ధాంతాల) అనుబద్ధ అనుక్రమాలనూ, పునాది నిర్మాణం (ఆర్థికం) పై వాటి పరిణామాలనుకూడా అర్థంచేసికోవాలి. ఇక మనం తెలంగాణ పోరాటపు ఉదాహరణద్వారా పై సూత్రాన్ని పరిశీలింతాం....

తెలంగాణ రైతాంగ పోరాటానికి భూస్వామ్య దోపిడీ, దౌర్జన్యాలు కారణం. దీనికినిదర్శనం వెట్టిచాకిరి— జేవకులీలు— నిర్బంధపద్ధానం మొదలగునవి. ఇది నిజమే. కాని తెలంగాణపోరాటానికి ఇది మాత్రమే ఏకైక కారణంకాదు. ఇక ఇతర కారణాలెలా ఉన్నవి?...నిజాంయొక్క మత (రజాకార్) రాజకీయాలకు ప్రజలు బద్ధవ్యతిరేకులైయుండిరి. నిజాంప్రభుత్వయంత్రాంగంలోని భూస్వామ్య ప్రభావాన్ని కూడ వారు ద్వేషిస్తుండిరి. ఈ పరిస్థితులను రైతాంగపు విమోచనోద్యమానికి ఆధారంగా పనిచేశాయి. ఆంధ్రమహాసభ, రైతుసంఘాల ప్రచారం ప్రజలను ఆకర్షించింది. ఉద్యమం చెలరేగి భూముల పంపకంగా రూపందింది. భూస్వాములతోను, రజాకార్లతోను కమ్యూనిస్టుపార్టీ సాయుధపోరాటం నడచింది. సమస్య ఆర్థిక భూమిక పైనే ముందుకు సాగింది...

కాని మరోవంక కాంగ్రెస్, ఆర్యసమాజం, మరికొన్ని హిందూసంస్థలూ, వ్యక్తులుకూడా నిజాం ప్రభుత్వ మతరాజకీయ రాచరికంతో పోరాటం సాగిస్తుండిరి. ఇలా ప్రజల విమోచనోద్యమం వివిధశక్తుల ఐక్యరంగం రూపంలో నుండియుండెను.

ఈ దశలో పోలీస్ యాక్షన్ జరిగింది. దానితో ప్రజా సముదాయానికి కాంగ్రెస్‌పై సానుభూతి విజృంభించింది. పైఅంతస్తులోని ఈ బలమైన ప్రభావం ఆర్థికపోరాటాన్ని క్రమక్రమంగా వెనుకకు నెట్టసాగింది. కాంగ్రెస్ ప్రభుత్వం మిలిటరీనీతితో భూమిని తిరిగి భూస్వాములకు స్వాధీనపరచటంగా పరిణమించింది. భూ పోరాటం ఇలా వెనుకకు నెట్టబడి, సాంఘిక రాజకీయ స్వరూపాలలో మితవాద భూ దాన ఉద్యమం, కౌలుదారీచట్టంరూపంతో బహిర్గతమై శేషించింది ...

ఈ ఉదాహరణలో పునాదినిర్మాణం (ఆర్థికం) ఉపరినిర్మాణం (సాంఘికమూ, రాజకీయం) ఇలా తమ వ్యతిరేక ప్రభావాలతో పనిచేసినవి.

ఇక మనం హిందూ కోడ్‌బిల్లును తీసుకుందాం. ఈ సమస్య సాంఘిక పునాదిపై ఆధారపడియున్నది. మత, నైతికవాద సంకుచితత్వాలు ఈ బిల్లుతో తీవ్రమైనఘర్షణ సాగిస్తున్నవి. అందుకని ఈబిల్లు వెనుకకు నెట్టబడటం జరుగుతున్నది. ఐతే ఈ సాంఘికప్రభావాలవెనుక ఆర్థికప్రభావాల ఆధారం

కూడా లేకపోలేదు—సమస్య ఇలా సంక్లిష్టమైన స్వరూపాన్ని దాల్చి యున్నది.

ఇక మనం పన్నుల ఉదాహరణను మరొకమారు పరిశీలిద్దాం. ధనిక వర్గం పరోక్షపన్నులనూ, కార్మికవర్గం ప్రత్యక్షపన్నుల విధింపులనూ కోరుతారు. ఈ ఘర్షణకు పర్యవసానమేమిటి? పెట్టుబడిదార్లు తీవ్రాందోళన చేస్తారు కనుక ధనిక (ప్రజా) స్వామ్యం పరోక్షపన్నులను విధిస్తుంది. ఫలితం? దీని వల్ల చిల్లరవర్తకులూ, మధ్యతరగతి ప్రజలూ ఆర్థిక ఒత్తిడికి గురియౌతారు. చిన్న వర్తకులు చితికిపోయి పెట్టుబడులు మరింత కేంద్రీకరణ జెందుతవి. ఆర్థిక పరిస్థితులు ఈ క్రమంలో మార్పుజెందుతాయి.

ఈ ఉదాహరణలో జరిగిందేమిటి?... పెట్టుబడిదార్ల ప్రచారం నెగ్గింది. అంటే ధనికవాదం (సిద్ధాంతం) తన ప్రభావాన్ని వేయగలిగింది. ఈ క్రమాన్ని సరిగా అర్థంచేసికొనటానికి మనకు విభిన్న పక్షాల వాదాలను (సిద్ధాంతం) పరిశీలింపవలసియుంటుంది. వాటి విశ్లేషణద్వారా తుదకు తేలేదేమి?... పరిస్థితుల ఇట్టి మార్పులన్నిటికీ మూలం ఆర్థికావసరాలనేదే....

ఇప్పుడు మనం సిద్ధాంతాల విభిన్న ప్రభావాల స్వరూపాన్ని గమనించి యున్నాము. ఇక సారస్వతరంగానికివద్దాం.



1. సారస్వత విశ్లేషణ:
2. రచనలతో మార్క్సిజం సమన్వయం:
3. సిద్ధాంత పోరాటం:
4. తుదిమాట:

రచయితలు సామాన్యంగా ఏ సిద్ధాంతాన్నీ ప్రత్యక్షంగా బలపరచనట్లు కన్పిస్తారు. కాని వారు ఏదివ్రాసినాసరే తమ దృక్పథాలను ప్రకటింపకుండా ఉండలేరుకదా? వారి భావాలు అంత విస్పష్టంగా ఉండకపోవచ్చు. అభిప్రాయాలు ప్రత్యక్షంగా బహిర్గతం కాకపోవచ్చు. ఐనా ఒక రచనను—అదేదైనా కానీయండి—మనం సూక్ష్మంగా విశ్లేషిస్తే దాని అంతర్గతమైన

సిద్ధాంతం (లేక రచయిత దృక్పథం) ప్రకటమవౌతుంది. రచయిత అభిరుచులు రచనలో ప్రకటంకాకుండా ఉండవుకదా! కాని, సారస్వత విశ్లేషణ అంత సులభమైనది కాదు. విషయపరిశీలనలో మనం చాలా జాగ్రత్త వహింపవలసి యుంటుంది. తొందరపడి యాంత్రికంగా సంకుచిత నిష్కర్షలు తీయటం మన అజ్ఞానాన్ని ప్రకటించుకొనుటే కాగలదు—ఇక మనం ఒక రచనను ఎలా విశ్లేషించాలో లేక గతితార్కికసూత్రాలను రచనకు (దృక్పథాలకు) ఎలా సమన్వయించాలో ఈ క్రింద పరిశీలిద్దాము.

## రచనలతో మార్క్సిజం సమన్వయం:

మనం ఒక రచనను విశ్లేషించుటకు అందలి విషయాన్ని గూర్చిన పరిజ్ఞానం అవసరం. సారస్వతవిమర్శకు చాలా విషయజ్ఞానం ఉండాలి. కాబట్టి విషయ పరిజ్ఞానం చేకూర్చుకోబడటం ప్రాథమికావసరం. లేకపోతే, మన విమర్శకారివేరూ, రచయిత భావాలదారివేరూ ఐ తప్పుడు నిష్కర్షలూ—అసమన్వయమైన తప్పుడు విమర్శలూ ఫలితం కాగలదు. అట్టి విమర్శ నాస్యాస్పదం కాగలదు...

ఒకపుస్తకాన్ని, లేక వ్యాసాన్ని, లేక కథను లేక నవలను—రచనను మనం ఈ క్రిందిక్రమంలో విశ్లేషించాలి...

**1.** రచనలోని మూలవిషయం లేక అందలి కథయేమిటో మనం సరిగా తెలిసికోవాలి. ఐతే ప్రతి విషయమూ, లేక ప్రతి కథా అనివార్యంగా వర్గపోరాటంనుండియే వెలువడదు. లేక నేటిసామాజిక సర్వసాధారణ సమస్యల నుండి వెలువడాలనీలేదు—కాబట్టి మనం రచనయొక్క వస్తుగతదృష్టితో విషయాన్ని ముందు తెలుసుకోవాలి.

రచన ఏ సాహిత్యదృక్పథానికి చెందినదో లేక ఏ సాహిత్య విచారధార ప్రభావాన్ని ప్రతిబింబిస్తున్నదో మనం పోల్చిచూచుకోవాలి. అంటే మనం పుస్తకంయొక్క వైధానికభాగాన్నీ (Form), దానికి ఆధారమైన సిద్ధాంత (Content) భాగాన్నీ సరిగా పోల్చుకోవాలి.

**2.** కథ లేక రచన యేకాలానికిచెందినది? అందలిపాత్రలు—ముఖ్యంగా ముఖ్యపాత్రలు—లేక ఆశయాలూ, అభిప్రాయాలు ఏకాలానికి, ఏ పరి

సరాలకు చెందినవో గమనించాలి. పాత్రలు ఏవర్గానికి చెందినవో చూచుకోవాలి. ఆ పాత్రలు లేక భావాలు సాంఘికపరిస్థితులకు ఎంతవరకు వాస్తవికంగా సరిపోతున్నవో పోల్చుకోవాలి. ఒక వేళ అలా పోల్చుకొను అవకాశంలేనిచో అందుకు బలవంతపు ప్రయత్నం చేయకూడదు. రచనపై పోలికలను మనం స్వయంగా రుద్దకూడదు.

3. పాత్రల లేక భావాల వర్గీకరణకుపిదప మనం రచనయొక్క ఆర్థిక మూలమును అన్వేషించాలి. అంటే రచన కాలమునకు చెందిన ఉత్పత్తిసాధనల, విధానాల స్వరూపాలతో విషయాన్ని సమన్వయించుకోవాలి.

ఒకవేళ సమకాలిక సమాజానికి చెందినదైతే అది నేటి ధనికస్వామ్యపువాదిపై నుంటుందికనుక సర్వసాధారణంగా ధనికస్వామ్య ప్రస్తుత స్వరూపానికి వ్యతిరేకాభిప్రాయాలను ప్రతిబింబిస్తుండటం మామూలు. ఐతే, రచయిత ఈ అసంతృప్తి ధనికస్వామ్యాన్ని ఏమార్గంలో వ్యతిరేకిస్తున్నదో గమనింపబడాలి....రచయిత ఎలా విమర్శిస్తున్నాడు?

(1) ముందుకుపోతున్న అభ్యుదయగామివలెనా?

(2) లేక వెనుకకు పోగోరుతున్న అభివృద్ధి నిరోధకునివలెనా? (అంటే రచయిత ఏ మధ్యయుగపు పరిస్థితుల ప్రభావానికో లోనై ఆ చరిత్ర తిరిగి ఆవిష్కరణ కావాలని కలలుగంటాడా చూడాలన్నమాట. అట్టి రచయిత సమాజపు సమకాలిక చరిత్రగతిని పరిశీలింపలేకున్నట్లు దీనివల్ల స్పష్టమౌతుంది.

4. పిదప మనం రచనలోని భావాలను, అభిరుచులను, రచయిత విచారధారను, మూలసిద్ధాంతాన్ని సరిగా గమనించాలి. ఆ విచారధార లేక సిద్ధాంత ప్రసారం పాఠకులపై వేయగల ప్రభావాన్ని కూడా నిర్ణయించాలి. (రచనయొక్క ఈ ప్రభావోత్పాదకత లేక రచయిత ఆవేశం అతని వర్గస్థితి, సంస్కారాలపై ఆధారపడియుంటుంది.)

పై విషయాలను సరిగా పరిశీలించుటద్వారా మనం ఒక ప్రత్యేక రచన—ప్రత్యేక కాలంలో—ప్రత్యేకవిధానంలో యెందుకు కొనసాగినదో మూలికంగా గ్రహింపగలము.

ఇలా రచనకు ఆధారమయ్యే మౌలికభావపు స్వభావాన్నీ (Content) దాని వ్యక్తీకరణకు అవలంబింపబడిన వివిధ భావ సముదాయపు (Form) స్వరూపాన్నీ మనం గుర్తించి, సమన్వయరూపకంగా అర్థం చేసికోవాలి.

సారస్వత విమర్శయొక్క ఈ క్రొత్తవిధానం గతితార్కికములకు సంబంధించియున్నది. ఐతే మనం ఈ పుస్తకంలో గత ప్రకరణాలలో చదివిన పాఠ్యాంశాలనన్నిటినీ సరిగా అర్థంచేసికొని, జ్ఞప్తియుంచుకొని వాటిని రచనతో సమన్వయింపగల్గటం అన్నది ముఖ్యమైనఅంశం. ఇంతే కాక మనము విమర్శనీయమైన రచనయొక్క వక్తృత్వవిషయ పరిజ్ఞానంకూడా చాలా అవసరం. ఈ రెండుఅంశాలపైనా మన విమర్శయొక్క సఫలత ఆధారపడ్తుంది.

ఈ ఉదాహరణ మార్క్సిజంయొక్క ప్రయోగవిధానాన్ని సూచిస్తున్నది. ఒక్క రచనలకే కాదు. మన సామాజికజీవితంలో—విజ్ఞానాన్వేషణలో—అనుభవాలలో వచ్చే వివిధ సమస్యల విశ్లేషణలో మనం ఈవిధానాన్ని అనుసరించాలి. ప్రతి వస్తువునూ చలనంపొందుతున్నదిగా, మార్పుకు గురియౌతున్నదిగా మనం గుర్తించాలి. చలనంలేకుండా పదార్థంకాని, భావంకాని స్థిరంగా ఉంటుందనుకోవటం అసమగ్రతకూ, అచేతనకూ దారితీస్తుంది. కాబట్టి మనం చలనాన్నీ, దాని వివిధదశలనూ, ఒడుదొడుకులనూ సూక్ష్మంగా పరిశీలించాలి. అప్పుడు మనం సరియైన నిర్ణయాలకు రాగలము. ఇలా ప్రతిచోటా, ప్రతి సమస్యకూ మార్క్సిజాన్ని సమన్వయించుకొటే ఈ తత్వశాస్త్ర ఆశయము.

## సిద్ధాంత పోరాటం:

ప్రజాజీవితంలో సిద్ధాంత పోరాటభాగం చాలా ప్రాధాన్యతను కలిగియుంది. ఆచరణరంగంలో అది కార్యకర్తలను అనుక్షణమూ ఎదుర్కొంటుంటుంది. ఇప్పుడీ నూతన భౌతికవాద పరిచయ వాచకాన్ని మనం ముగింపనున్నాము. ఈ పుస్తకంద్వారా " మార్క్స్, ఎంగెల్స్ " లు ఆవిష్కరించిన గతితార్కిక సిద్ధాంతాన్ని పరిచయం చేసుకున్నాము. ఐతే, ఈ పుస్తకం అత్యంత మౌలికమైన అనేక సమస్యలను స్పృశిస్తూ అతివేగంగా ముందుకు సాగింది ఈ పుస్తకం మార్క్స్—ఎంగెల్స్‌ల అనేక ఉద్ధరణల ఆధారముపై నిర్మితమైంది, ఆ ఉద్ధరణలు సమస్యలను మౌలికంగా స్పృశించినవి. కాని ఈ పుస్తకంతోమాత్రమే మనం " మార్క్సిస్టు ఆచార్యుల " మని భావింపబడకూడదు. ఈ సూత్రాలను మార్క్స్—ఎంగెల్స్‌లు ఎంతో వివరించియున్నారు— ఈ తత్వశాస్త్రాన్ని లెనిన్ మరికొంత అభివృద్ధిపరచాడు. అందుకే ఇది " మార్క్సిజం-లెనినిజమ్ " అని పేర్కొనబడ్తూ ఎంతో విస్తృత

రూపాన్ని దాల్చియున్నది. గతితార్కిక భౌతికవాదం లేక మార్క్సిజం లెనినిజాన్ని, దాని విస్తృతమైన సైద్ధాంతిక సంపత్తిని సాధించుటకు—అర్థం చేసికొనుటకు తొలిమెట్టుగా ఈ చిన్నపుస్తకం ఉపయోగపడ్తుంది. కాబట్టి మూలసిద్ధాంతాలను స్పృశించే ఈ పుస్తకపరిచయం మన మార్క్సిస్టు విజ్ఞాన సాధనకొక మెట్టుగా ఉపయోగపడాలి.

పాలక (ధనిక) వర్గాలకు ఈ మార్క్సిస్టు మూలసూత్రాల "సత్తా" పూర్తిగా తెలుసు. కాబట్టి వారు మార్క్సిస్టు విద్యార్థులను ఎన్నో రూపాలతో, విధానాలతో తికమకపరుపజూస్తారు. ఏవేవో తప్పుడుసిద్ధాంతాలతో వారిని గగ్గోలుపరుప యత్నిస్తారు. మార్క్సిజం ప్రచారం కాకుండా ఎన్నో విధాల నిరోధిస్తారు. ఒకవేళ సైద్ధాంతిక పోరాటాన్ని ఎదుర్కొనలేకపోయి వచోమూకీభావంతో-పరోక్షమైనఆంక్షతో వెన్నుపోటు మార్గాన్ననుసరిస్తారు. ఈ నూతనసిద్ధాంతం కనిపెట్టబడి అప్పుడే ఒకశతాబ్దం గడచినది. అది అనుభవక్షేత్రంలో కాకలుదీరి బ్రహ్మాండమైన విజయధ్వజా లెత్తినది. కాని నేడు కూడ మన స్కూళ్ళలో, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో విశ్వక్రమాన్ని నిర్దేశించే ఈ తత్వశాస్త్ర భాగానికింకా ప్రవేశమేలేదు. తుదకు విద్యార్థులు గ్రంథాలయాలలో స్వయంగానైన చదువుకొనగల్గుటకు అవకాశాలు నిరోధింపబడ్తున్నవి. రైల్వే పుస్తకశాలల్లో మార్క్సిస్టు గ్రంథాలకు స్వతంత్ర ప్రజాస్వామిక దేశమైన "భారతదేశంలోను" ఈనాడు ఆంక్ష విధింపబడుతూనే ఉన్నది. ధనిక పాలకవర్గాలకు మార్క్సిజమంటే ఎంతభయమో ఇది ప్రత్యక్ష నిదర్శనం.

మన కళాశాలల్లో ఈనాడు సామాజిక విజ్ఞానశాస్త్రాలు, రాజకీయ శాస్త్రం, తత్వశాస్త్రం, అర్థశాస్త్రం మొదలైనవికూడా అధిభౌతిక సూత్రాల ఆధారంపైననే విద్యార్థులకు బోధింపబడుతూ అసమగ్ర విలోకనకు దారితీస్తున్నవి. ప్రకృతి విజ్ఞానశాస్త్రాలలోకూడ విజ్ఞానం విజ్ఞానంకొరకే—(ఆచరణకొరకు కాదు) అన్నధోరణిలో విద్యార్థుల తరగతిఉపన్యాసాలు నిర్మాణం పొందియున్నవి. ఇలా ధనికవాదాన్ని యాంత్రికంగా సమర్థించేధోరణి విద్యాశాలలోనే విద్యకు విద్రోహంచేయుటగా ఈనాడు పరిణమిస్తున్నది. వైజ్ఞానికరంగం ఇలాంటి ఆత్మవంచనకు గురియైయున్నది.

ఒకవేళ నేటి మన విద్యార్థులు—భావిసమాజ స్తంభాలు-ఈనాడు విద్య కేవలం డిగ్రీకొరకేననీ, శాస్త్రజ్ఞులు తమ శాస్త్రకృషి ప్రయోగశాలవరకే

166

లేక తమ స్వంత పొట్టకూటికేననీ భావించే సంకుచిత ఆత్మీయ వాదదృష్టికి గురి యైయుండక—ప్రపంచ పురోగతిలో తమకూ గురుతర పాత్ర కలదనీ, విజ్ఞానానికి ఆచరణభాగంతో సమన్వయముండాలనీ తెలిసికొనగల్గినట్లయితే—అందుకు మన 'విశ్వ' విద్యాలయ కవాటాలు మూసుకపోబడినట్లయితే, వ్యక్తి స్వార్థ లాలస దానికి అడ్డుపడనట్లయితే...ఇలాంటి విజ్ఞానం మన యువకశక్తులకు చేకూర్చ బడినట్లయితే మన చరిత్రగతి అప్పుడెలా ఉంటుందో—ఇప్పుడెలా ఉంటున్నదో—ఈ అగాధం ఎంత శోచనీయమైనదో వేరే చెప్పనవసరంలేదు. ఈ దశలో మన సిద్ధాంత పోరాటపు ప్రాధాన్యత ఎంతో ఇక్కడ గుర్తింపబడాలి.

ఈ తత్వశాస్త్రాన్ని మనం విరివిరిగా కార్యకర్తలలో, మార్క్సిస్టు విద్యార్థులలో ప్రచారం చేయటం అవసరము. ఎందుకన...మన ధనిక స్వామ్య మేధావులు ఏంచేస్తారు? వారు శాస్త్రీయ కక్షకరంగాలను ఎన్నెన్నో కల్లబొల్లి సిద్ధాంతాలూ, వాదాలతో మోసగింప ప్రయత్నించటమేకాక, చీలికలు కల్పించుటకై, తరుచు తాముకూడా మార్క్సిస్టు ముసుగులు దాలుస్తారు. [డాల్మియా ఇలస్ట్రేటెడ్ వీక్లీలో తనబొమ్మ వేసుకొని "నేను కమ్యూనిస్టునే" అని ప్రకటించుకొన్నట్లు.] మరికొంత పెద్దమనుష్యులు మార్క్సిజాన్ని మేము సరిదిద్దుతున్నాం...అంటూ [illegible]నా మార్క్సిస్టులుగా...యువకశక్తులను ఆకర్షింప చూస్తుంటారు. [illegible]విస్తృత ప్రచారాన్ని పొందియున్న రాజకీయాధిక సమయంలో వారి "సరిది[illegible]ట" ఎత్తుగడలకు మోసపోయేవారుండరుకదా! కాబట్టి [illegible]వ పరిచా[illegible]న్ని చేకూర్చుకొనని మార్క్సిజంయొక్క మౌలిక సిద్ధాంత[illegible]న్ని—తత్వశాస్త్రాన్ని—తమ దాడికి వారు రంగస్థలం చేసికొంటారు. [illegible]వీరి "సరిదిద్దు" ఎత్తుగడల నెదుర్కొనుటకై మనకు మార్క్సిస్టు సిద్ధాంత [illegible]ము, అందుకై విరివైన తత్వశాస్త్ర విజ్ఞానం—ఎంతైనా అవసరము...

[illegible]చాలమంది మార్క్సిజాన్ని ఒక రాజకీయ విప్లవవాదంగా మాత్రమే అర్థం చేసికొంటారు. కాని ఒక తత్వశాస్త్రంగా గుర్తింపరు. అది చాల పెద్ద అసమగ్రత. ఎందుకంటే వీరు గతితార్కిక సూత్రాలను లేక మూలాధారాన్ని విడిచి మిగతావరకే తమను మార్క్సిస్టులుగా భావిస్తున్నారు—ఈ లోపం జాతీయవాద స్వరూపంలోను సంస్కరణవాద రూపంలోను బహిర్గతమౌతుంటుంది. ఇట్టి అనేక విచారధారలు యూరప్ ఖండంలో ఎక్కువగా బయల్పడినవి. వాటిని లెనిన్ తన "భౌతికవాదం—ఊహావాద విమర్శలు" అన్న గ్రంథంలో ఖండించాడు అన్ని సందేహాలకూ సమాధానం చూపే ఆ

సర్వతోముఖగ్రంథం యువకశక్తులలో ఇంకా ప్రచారం పొందవలసియుండి— అది విరివైన ప్రచారాన్ని పొందనందున, చేసిన విమర్శలనే తిరిగితిరిగి చేస్తూ మార్క్సిజం సంస్కర్తలుగా ధనికతత్వ మేధావులింకా చలామణి కాగల్గు తున్నారు. ఈ కుహనా మార్క్సిస్టులను బట్టబయలుచేయుటకు సైద్ధాంతిక పోరాటవ్యాప్తి దాని ప్రాధాన్యత ఎంతైనా అవసరం.

## తుదిమాట:

మార్క్సిజాన్ని, భౌతికవాద తత్వశాస్త్రాన్ని చదువుకోవాలన్న కోరిక చాలమంది కార్మిక, కర్షక యువకులలో, కార్యకర్తలలో, విద్యార్థులలో పెంపొందుతూ ఉన్నది. ఇది చాల ముదావహమైనవిషయం. ఐతే ఆచరణ క్షేత్రానికీ, సిద్ధాంతభాగానికీ సమన్వయ మేర్పడటంద్వారా ముందుకు సాగా లన్న చైతన్యం, పాటింపబడటం అవసరం. తప్పులు దిద్దుకొనుటకూ, సరియైన మార్గాన నడచుటకూ దీక్ష కార్యకర్తలలో పెంపొందింపబడాలి. ఇట్టి మార్క్సిస్టు విజ్ఞాన ప్రచారం ఈనాడు అత్యధిక ప్రాధాన్యతను కల్గియున్న

ఇందుకై మార్క్సిస్టు శాస్త్ర చర్చలు—ఉపన్యాసాలు—సాంస తిక సాహిత్యగోష్ఠులు—పుస్తకాలు యువకశక్తులలో విరివైన ప్రచారా గాంచవలసియుంటుంది. సైద్ధాంతిక పోరాటంద్వారా ధనికవాద సిద్ధాం లనూ, అవి కల్గించే అపోహల నెదుర్కొనుటద్వారా మార్క్సిజం ముంద సాగుతుంటుంది. ఇతరుల వంచనలనుండి, తప్పుడు ఎత్తుగడలనుండి త మ కాపాడుకొనుటకూ, ఇతరుల తప్పుడువాదాలను ఖండించి వారిని సరిదిద్దుట గతితార్కిక భౌతికవాదం మార్క్సిస్టు విద్యార్థులకు అనివార్యమైన ఆయుధ ఈ ఆయుధ సంచాలన వర్గరహితసమాజ మేర్పడి—విజ్ఞాన ప్రచారంద్వారా శాస్త్రాభివృద్ధికిగల ఆటంకాలన్నీ నిర్మూలింపబడు తుదిక్షణంవరకూ కొనసాగ వలసినదే.

సమాప్తి.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B139 |
| పుస్తకం పేరు | త్రివర్ణ పతాక |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 181 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasif |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |